# దేశభక్త
# కొండ వేంకటప్పయ్య పంతులు
## స్వీయచరిత్ర



## ప్రథమభాగము



देशभक्त

# कोंडा वेंकटप्पय्य पंतुलु की आत्मकथा

प्रथम भाग



ప్రకాశకులు:

ఆంధ్ర రాష్ట్ర హిందీ ప్రచారసంఘము
విజయవాడ - 2

సర్వోదయ గ్రంథమాల - ఆరవపుష్పము.

ప్రథమముద్రణం 1952

ప్రతులు 1000

వెల:

రెండు రూపాయల పావలా

ప్రకాశకులు:

ఆంధ్ర హిందీ ప్రచార ప్రెస్,

విజయవాడ-2.

# తొలిపలుకు

—ooo—

శ్రీ దేశభక్త కొండ వెంకటప్పయ్యపంతులుగారు భారతదేశమునను, విశేషముగా ఆంధ్రదేశమునను మిక్కిలి ప్రఖ్యాతిగాంచిన పురుషవరేణ్యులు. ఆంధ్రోద్యమజనకులు ఆయన యని చెప్పనొప్పును. బాల్యమునుంచి, ప్రేమతో, జాగరూకతతో, దూరదృష్టితో దానిని పెంచి, పెద్దచేసి, సుప్రతిష్ఠితమొనర్చెను.

దృఢమైన ఆస్తిక్యబుద్ధియు, నిర్మలమైన ప్రవర్తనయు, అచంచలమైన ధైర్యమును, నిశ్చలమైన దీక్షయు, అరమరలేని అమాయకత్వమును, ఉన్నత ఆశయములును కలిగిన నిరాడంబర ఆదర్శజీవి ఆయన. ఆ సద్గుణములచేతనే లోకోత్తరుడైన గాంధిమహాత్ములవారి ప్రేమకు పాత్రుడయ్యెను. స్వరాజ్యసంగ్రామములో అన్ని ఘట్టములలో ముందంజ వేయుచునేయుండెను. శాసనసభా బహిష్కారములో, వృత్తివిసర్జనములో, పన్నుల నిరాకరణలో, ప్రభుత్వబహిష్కారములో, కారాగారశిక్షపరంపరాసహిష్ణుతలో, పేరెన్నికగన్న పెద్ద ఆయన. కార్యోత్సాహములో, నిరంతరకృషిలో, యువకులను వెనుకకునెట్టు, ధీరులచేయు, కర్తవ్యపరాయణుడు. వయసు పెరుగుచున్నను, కార్యాసక్తి తరుగుచుండలేదు సరికదా, ఆ రెండునూ— వయస్సు, ఆసక్తి— ఒండొరులతో పోటీపడుచున్నట్లుగా కనబడును. సహస్రమాసములు సంతోషసంభరిత జీవితము గడపెను సన్మార్గవర్తి.

ఇట్టి అనఘుని ఆత్మకథ నీతిబోధకమును, ఉత్తేజకరమును అయియున్నది. దానిని అచ్చొత్తించి ప్రకటించుభాగ్యము ఆంధ్రరాష్ట్ర హిందీ ప్రచారసంఘమున కబ్బుట సవ్యమే. అనేకసంవత్సరములు ఆయన అధ్యక్షులుగనుండి దానిని రక్షించిరి. ఈ సంఘమును, ఆత్మకథయు తోబుట్టువులు పరస్పర శ్రేయోభిలాషులు.

దీనికి తొలిపలుకు వ్రాయు అవకాశము దొరికినందులకు నాకును ఆనందము కలుగుచున్నది. పితృతుల్యుని సంస్మరణము సంతోషకారణముగదా!

భౌతికదృష్టితో ఆంధ్రరాష్ట్ర అవతరణమును ఆయన చూడజాలకపోయినను దివ్యదృష్టితో దానిని త్వరలో దర్శించుగాక!

వినయాశ్రమము<br>ఖరనామ సం॥ర మాఘ శుద్ధ<br>నవమి, సోమవారం.

సీతారాం<br>గాంధిశరం<br>౧౮—౬—౫

# విజ్ఞప్తి



వీరేశలింగంపంతులు స్వీయచరిత్రతో మన భాషలో స్వకథాకథనము పరిపాటియైనది. రాయసం, చిలకమర్తి, టంగుటూరివారల స్వీయచరిత్రలును, దేశభక్తుని యీ స్వీయచరితయు 19 వ శతాబ్ది చతుర్థచరణముతో మొదలిడి, యించుమించుగా ఈ శతాబ్ది మధ్యభాగమువరకు నడచినవి. ఈ డెబ్బది యెనుబదేండ్లలో మనదేశమున ఎన్నో యుద్యమములు తలచూపినవి. మన సంఘవ్యవస్థ క్రొత్తరూపు దాల్చినది. పరప్రభుత్వముగూడఒత్తిగిలి భారతమున స్వతంత్రప్రభుత నెలకొన్నది. ఈమార్పులన్నిట భాగస్వాములై, వాటికి రూపరేఖలుదిద్దిన ఆంధ్రమహాపురుషులలో దేశభక్త వేంకటప్పయ్యపంతులుగారగ్రగణ్యులు.

పంతులుగారు తనువెత్తిచాలించులోపల మూడుపురుషాంతరములు గడచినవి. ఈ మూడుతరములవారిలోను పంతులుగారెప్పటికప్పు డగ్రగాములై నిలిచిరి. మదరాసులో కళాశాలావిద్యార్థుల సమ్మేళనములో వారిదే ముందంజ. బందరున మొదటి వితంతూద్వాహమున వారిదే ప్రథమతాంబూలము. కృష్ణాజిల్లాసంఘముతో నారంభించిన పంతులుగారి రాజకీయజీవనము స్వరాజ్యలబ్ధివరకు ఒక్కతీరున సాగినది. కృష్ణాపత్రిక వారి కూరిమిబిడ్డ. ఆంధ్ర జాతీయకళాశాలా స్థాపకులలోను పంతులుగారున్నారు. స్త్రీవిద్యకై శారదానికేతన సంకల్పము వారిది. వృత్తివిసర్జనమొనర్చి, జీవితమును ప్రజారాధన కంకితమొనర్చిన మొదటి ఆంధ్రులు పంతులుగారు. 1887 లో మదరాసున మూడవ కాంగ్రెసుమహాసభ జరిగినపుడే అచట విద్యార్థిగానున్న వెంకటప్పయ్య తన చేతికి కాంగ్రెసుతోరము కట్టుకొనెను. అది మొదలు స్వరాజ్యలబ్ధివరకు గడచిన ఏబదేండ్లలో ఆంధ్రజీవననౌక నాయనయే కర్ణధారియై నడిపించెను. ఇవి యన్నియు నొకయెత్తు, ఆయన స్వయము కనిపెంచిన ఆంధ్రోద్యమ మొకయెత్తు. ఆంధ్రరాష్ట్ర మాంధ్రరాష్ట్ర మని జపించుచునే వీరపుంగవుడగు దేశభక్తుడు తనువుచాలించెను. ఇట్లు బహుముఖముల విస్తరించిన పంతులుగారి స్వీయచరిత్రయే ఈ డెబ్బదేండ్ల ఆంధ్రదేశచరిత్ర. పంతులుగారి ప్రజారాధన ప్రవణత తెలుగునేల యెల్ల లతిక్రమించినదిగాన భారతదేశచరిత్రగూడ నిందు అల్లుకొనియున్నది.

పంతులుగారి ఆకారప్రజ్ఞాబలసంపద అంతచెప్పుకోదగ్గవికావు. విద్యలో, వాచాలతలో వారిని మించిన తెలుగువారున్నారు. భోగరాజువారి ప్రజ్ఞాప్రదర్శనగాని, టంగుటూరివారి సాహసరసికతగాని, కాశీనాథునివారి వితరణవీరముగాని కొంత వారికిలేవు. అట్లయ్యు, వీటినన్నిటిని మించిన సత్యరతిత్వరల, ఆస్తిక్యము, వినయము, నిరంతరసేవాసక్తి, ఆత్మవితరణము — ఇవి దేశభక్తుని సమానులలో ఉత్తమశ్లోకు నొనర్చినవి. పంతులుగారి హృదయము కుసుమకోమలము. కావుననే వజ్రకఠోరత నపేక్షించు రాజనీతిధౌరంధర్యము వారి కలవడలేదు. పంతులుగారి జ్ఞానశక్తికంటె క్రియాశక్తి దొడ్డది. క్రియాశక్తికంటె భక్తిపరిప్లావితమగు వారి ఆర్ద్రచిత్తము దొడ్డది. కనుకనే వారి సేవాశీలము మాత్సర్యము నెఱుగదు. వారి ప్రభుత ఘృణాలలితమై, పట్టువిడుపులు నేర్చికొని, యుదారచరిత కాస్పదమైనది. గాంధిజీపిలుపు పంతులుగారి గోపికాహృదయమునకు వేణునాదమైనది. చిన్ననాటనే నాటకములలో స్త్రీపాత్ర మభినయించిన పంతులుగారికి రసతత్పరత వెన్నతోబెట్టినవిద్య. అదిగావునను పంతులుగారు రాజకీయజంబాలమున బడినను ఒడలు బురదగాకుండ సాధుహృదయమును సంరక్షించుకొనిరి.

ఈ గ్రంథమున పంతులుగారి కలము కావ్యపాకము నందికొన్న ఘట్టము లెన్నియో యున్నవి. దాపరిక మెఱుగని వారి సత్యసంధత, మాయమర్మము లెఱుగని వారి అచ్ఛశీలము, చేముసాలెఱుగని ఉత్సాహశక్తి — అడుగడుగున నిందు ప్రత్యక్షమగును. పంతులుగారు హాస్యరసమునుగూడ నిందు ఎడనెడ చవిచూపిరి. ఆంధ్రభాషకు, చరిత్రకు అలంకారప్రాయమైన ఈ స్వీయచరిత్ర పరిపూర్తినందక 1932 లో నాగిపోవుట మన దురదృష్టము. అందలి ప్రథమభాగము 1918 వరకు నడచినది. అనతికాలమున రెండవభాగముగూడ ప్రకటింతుము. అమూల్యమగు ఈ గ్రంథప్రచురణభాగ్యము మా సంఘమునకు గల్పించిన పంతులుగారి కుటుంబమునకు కృతజ్ఞులము.

విజయవాడ,<br>2—2—1952.

కాటూరి వేంకటేశ్వరరావు,<br>సాహిత్యశాఖాధ్యక్షులు.<br>ఆంధ్రరాష్ట్ర హిందీ ప్రచారసంఘము

# విషయసూచి

# ప్రస్తావన

లోకమున పుట్టినది మొదలు ఇంతవరకును నా జీవిత యాత్ర యెట్లు నడచినదో వివరించుటవలన చదువరుల కేపాటి ప్రయోజనము కలుగును అను విషయము ఆలోచన చేసిన ఎడల నా జీవితములో మార్గదర్శకములగు విశేషములు గానరావు. ఇందువలననే ఆత్మకథ వ్రాయవలెనను సంకల్పము నాకు కలుగి లేదు. కాని మిత్రులు పలువురు మాటిమాటికి నా జీవితవృత్తాంతమును వ్రాయవలసినదని నొక్కిచెప్పుటచేత దానిని వ్రాయవలెనని ఇప్పుడు పూనితిని గాని దానికి కావలయు పరికరములు నే నమర్చుకొని యుండలేదు. కొందరు బుద్ధిమంతులగువారు తమ జీవితకాలములో నిత్యము జరుగు విషయములు దినచర్య (Dairy) గా వ్రాసి పెట్టుదురు. నాకు అట్టి అభ్యాసము లేక పోయెను. కాన నేనిప్పు డేమి వ్రాసినను నా జ్ఞాపకశక్తి ననుసరించియే. ఈ వృద్ధదశయందు జ్ఞాపకశక్తి యైనను దృఢముగ నుండజాలదు. కాబట్టి నేను వ్రాయునది సంతృప్తికరముగ నుండజాలదని సందియము కలిగినను నా జీవితచరిత్ర వ్రాయుట నిశ్చితమైనదిగాన నిపుడట్టి లోపములనుగూర్చి యోచించి ప్రయోజన ముండదనుట స్పష్టమే.

సాధారణముగ నెవ్వరి జీవితమైనను మొదటినుండి తుది వరకు నొక్కరీతిగనే సుఖమునకో, దుఃఖమునకో భాజనముగాదు. సుఖదుఃఖములు రెండును అనుభూతములగుచుండును. కాని మొత్తమున నీ జీవిత మింతవరకు సుఖప్రదముగ నుండెనా, లేక

దుఃఖదాయకముగ నుండెనాయని ఎవ్వరేని నన్ను ప్రశ్నించిన యెడల నిస్సందేహముగ సంతోషకరముగనే యున్నదని చెప్ప గలను. సామాన్యముగ నెంత దుస్థితిలో నున్నవారైనను దీర్ఘ జీవితులైనవారు సౌఖ్యమే యెక్కువగ ననుభవింతురని నా విశ్వాసము. ఏలననగా ప్రతిదినము నిద్దురతో శరీరక్లేశము తగ్గి ఉదయమున మేల్కాంచునప్పటికి దేహము పుష్టికరముగ తోచి నట్లు అప్పటికప్పటికి కలుగు దుఃఖములును పిమ్మటి సుఖాను భవములచేత మాసిపోవును. దినదినమును నూతనానుభవములు కలుగుచుండుటచే జీవితము నూతనకళలతో నొప్పారు నొక నాటకరంగమువలె నుండును. క్రొత్త యనుభవముల సందడిలో ప్రాత దుఃఖములు మాసిపోవును. ఇంతకును సుఖదుఃఖముల మేరలు చాలవరకు వారివారి మనస్సులనుబట్టి యుండును. ఒక రికి ఎక్కువ సుఖముగ దోచు విషయము మరియొకరి కంతగా సుఖప్రదముగ నుండదు. అటులనే ఒకరికి దుఃఖకరముగ నుండు నది మరియొకరికి అంతగ దుఃఖము కలిగింపక పోవచ్చును.

ఈ సుఖదుఃఖములు కొన్ని దేహమునకు, మరికొన్ని మనస్సునకు సంబంధించి యుండును. యమ నియమముల ననుస రించి జీవించినవారు సామాన్యముగ దేహారోగ్యము మొదలగు దైహిక సుఖముల ననుభవింతురు. నిర్మలవర్తనము కలిగి సత్య నిష్ఠతో ప్రవర్తించువారికి మనఃక్లేశమునకు కారణము లుండవు. అనివార్యములగు విపత్తులు సంభవించినను ధైర్యముకలిగి సర్వ మును పరమేశ్వరాధీనమను పరమార్థచింతనకలవారు దుఃఖ ములు పాటింపరు.

జీవితములో సుఖదుఃఖములను నని వ్యక్తికే మాత్రమే సంబంధించినవి. పరుల కుపకరించినదే సార్థక జీవనమని యెంతును. ఈ నిర్ణయము లోకులు చేయవలసినదే. కాని ప్రతి వ్యక్తియు తన జీవితము పరుల కుపయోగించెనో, లేదో నిర్ణయించుట కధికారి కాకపోయినను తన శక్తికొలది నుపయుక్తముగనే జీవితము నడపగలిగితినని ఆత్మతృప్తి చెందుటకు మాత్రము అవకాశము కలదు. కావున నా జీవితము కేవలవ్యర్థముకాదను ఆత్మసంతుష్టి పరమేశ్వరుడు నాకు ప్రసాదించెనని మాత్రము చెప్పగలను.

కావున యీ సృష్టియందు నాకు జన్మయొసంగి కర్మఫలముల ననుభవించుటకు దీర్ఘజీవితము ననుగ్రహించిన పరమేశ్వరునకు ప్రణమిల్లి, లోకమున రూపమెత్తుటకు కారణభూతులైన తలిదండ్రులకు నమస్కరించి, పెంచి పెద్దవానిగ జేసి విద్యాబుద్ధులు గరపించిన నా తండ్రిగారిని, విద్యాగురువులను గూడ కృతజ్ఞతాపూర్వకముగ ప్రస్తుతించి, నా పరమ మిత్రులను సంస్మరించి, యీ నా జీవయాత్రా ప్రకరణ వ్రాయుచున్నాను.

మరియు—

తనువులు రెండు జన్మంకు తారకమార్గము చూడనొక్కటే
యనుచును నీతిధర్మముల నారసి యెప్పుడు దైవభక్తితో
జనుపగబూన కాపురము చల్లగ సాగెను ప్రేమసింధువం
దనుపమలీల గ్రుంకులిడ నాదర మొప్పగమానె దుఃఖముల్.
ఇటులనె నేబదేండ్లు భువి నిచ్చలు సౌఖ్యముగొల్పు భార్య న
న్నిట విడనాడి స్వర్గమున కేగెను విడ్డలనెట్లు బాసెనో
పటుతరశీల సంపదల భద్రతగాంచిన భాగ్యశాలి పే
రట కృతినిత్తు పుణ్యముల రాశికి వెంకట సుబ్బమాంబకున్.

*

# జననము - దేశస్థితి

నేను గుంటూరు పురమందొక బ్రాహ్మణ కుటుంబమున జనన మొందితిని. నా జన్మదినము ఎనుబది రెండేండ్ల క్రిందటి క్రోధననామ సంవత్సర మాఘ బహుళ సప్తమి - అనగా భారత దేశ ప్రథమ స్వాతంత్ర్య సమరము నడచిపోయిన తొమ్మిది యేండ్లకు. అది క్రైస్తవశకము 1866 సంవత్సరము ఫిబ్రవరి 2 వ తేది యగుచున్నది. అంతకుముందు యుద్ధములు, పిండారీ మూకల దోపిడులు మొదలగు నలజడులచే కలతనొందిన దేశము నందు కొంత శాంతి నెలకొల్పబడినది. ఈ ప్రాంతము పూర్వ కాల హైందవ ప్రభుత్వముల క్రిందనుండి, పిమ్మట మొగలాయి రాజ్యములో చేరిన హైదరాబాదు సంస్థానములో నైజాము యొక్క పరిపాలనలో నుండెను. యుద్ధములో నోడిపోయిన నైజాము ఈ దేశమును కొలదికాలము క్రిందటనే ఆంగ్లేయుల కిచ్చివేసెను. కాని మొగలాయి సాంప్రదాయములు ప్రజల నింకను బూర్తిగ విడువలేదు.

ఆంగ్లేయులకును నైజామునకును జరుగుచుండిన కలహముల మధ్య బుస్సీయను ఫ్రెంచి సేనాపతి కొంత సేనతో యీ ప్రాంతముపై దాడివెడలి భయంకర యుద్ధప్రచారము సాగించి యుండుటచేత ప్రజలు మిక్కిలి కలవరము నొందిరి. కావుననే ఆ బూసి సేనానిపేరు మరవక ఇప్పటికిని పోరుబెట్టు బిడ్డలను బూచివాడు వచ్చుచున్నాడని భయపెట్టి ఏడ్పుమాన్ప ప్రయత్నించు చున్నారు.

అప్పుడు సర్కారు ఉద్యోగులుగా నుండువారును, ప్రజలలో మరికొందరు ప్రముఖులును మోకాళ్ళవరకు సాగు పొడవు చొక్కాలు, షేర్వాణీలు లేక అంగర్ఖాలను పేరుగలవి తొడుగుకొనుచుండువారు. తలగుడ్డలు వంకరగా చుట్టుకొని, వీపున తోకవలె కొంగులు జారవిడుచుచుండెడివారు. కొందరి ఇండ్లలో పట్టాకత్తులును, బాకులు, బల్లెములుగూడ నుండెడివి.

'పార్షి' అను పేరుతో ఉర్దూభాష నా కాలమున నేర్పుచుండిరి. ఇంక నెప్పటికైన మరల మొగలాయి రాజ్యములో మనదేశము చేరునను భ్రమచే తమ పిల్లలకు హిందువులు గూడ 'పార్షి' నేర్పించెడివారు కావున పార్షిభాషా పండితులు గూడ మనవారిలో నుండెడివారు.

ఆ కాలమున వేసవియెండలు మిక్కిలి తీవ్రముగ నుండెడివి. రాత్రివేళలో సయితము వేడిగాడ్పులు వీచుచుండెను. వర్షములును అధికముగ కురియుచు భూములు బీళ్ళునడిచున్నటకు దుస్సాధములుగ నుండెను. పంటలు చాల తక్కువ. ఈ ప్రాంతమంతటను మెట్టసాగే సాగుచుండెను. మాగాణి అప్పుడప్పుడె యరుదుగ ప్రారంభమయ్యెను.

జొన్న, సజ్జ, వరిగె, మొక్కజొన్న మొదలగు మెట్ట పంటలు పండుచుండెడివి. జనులు సాధారణముగ తాము పండించుకొను ధాన్యమునే తినుచుండెడివారు. బ్రాహ్మణులు సయితము పలువురు జొన్నన్నము, వరిగన్నము తినుచుండెడివారు. కొంత

కాలమునకు ఒకపూట జొన్నఅన్నమో వరిగఅన్నమో తినుచు రెండవపూట వరియన్నము తినుట బ్రాహ్మణులు, వైశ్యులు మున్నగు వారిలో ప్రారంభమయ్యెను. రయితులు శిస్తు చెల్లించుటకు డబ్బు దొరకక చాల కష్టపడుచుండిరి. కొన్నిచోట్ల శిస్తులు చెల్లించని వారిని ఎండలో నిలబెట్టి వీపుపై బండలు పెట్టి బాధించి శిస్తు వసూళ్ళుచేయుచుండుట సాధారణముగ నుండెను. ఈ అభ్యాసము కొన్నిచోట్ల దారుణముగ నుండుటచే చెన్నపట్టణములో రాజకీయములకు దారిజూపిన గాజుల లక్ష్మీనరసింహ చెట్టిగారును, శ్రీ రంగయ్య నాయుడుగారు మొదలగు ప్రముఖులు కలసి గవర్నరుగారికే మాత్రమేగాక లండనులో పార్లమెంటువారికి గూడ మహాజరులను పంపి ఈ దురభ్యాసము మాన్పించుటకు గొప్ప ఆందోళన గావించి, తుదకు కృతకృత్యులైరి. ప్రజలు చాల విద్యావిహీనులుగనే యుండిరి. బ్రాహ్మణులలో మాత్రము పలువురు చదువను వ్రాయను లెక్కలువేయను నేర్చియుండిరి. కాని భాషా పాండిత్యము కలవారు అప్పటికే దేశమున నరుదుగా నుండిరి.

నేను పుట్టిన కాలమున ఇప్పటి గుంటూరులో పాత గుంటూరు అని పిలువబడు భాగము మాత్రము ప్రధానముగ నుండెను. అది అప్పటికి చిరకాలమునుండి సంస్థానాధీశులగు వాసిరెడ్డి వారికిని, మానూరి వారికిని ముఖ్య స్థానముగ నుండెను. వాసిరెడ్డివారి కోట పెద్దది యొకటి యూరి మధ్యను, మానూరివారి కోటలు రెండు దక్షిణభాగమున నుండెను. ఆ సంస్థానములు అధికారములు కలిగి భాగ్య

వంతముతై యుండిన కాలమున మా పాతగుంటూరు గొప్ప వైభవము ననుభవించెను. కాని నా జననకాలమునకు కొన్ని సంవత్సగముల పూర్వమే ఆంగ్లేయ ప్రభుత్వమువారు తమకు చెల్లించవలసిన పేష్కషు చెల్లించలేదను మిషబెట్టి, తమకు రావలసిన పేష్కషును రాబట్టుకొని మరల జమీందారీలను వదలి వేయుదుమని వ్రాతపూర్వకమైన వాగ్దానములుచేసి జమీందారీలు స్వాధీన పరచుకొనిరి. జమీందారులకు మాత్రము అలవెన్సుల పేరట వారి జీవితభృతికి కొంతసొమ్ము ఏటేట ఇచ్చుచుండిరేగాని ఎంతయో ఆదాయము జమీందారీ గ్రామముల మీద వసూలై తమ పేష్కషు సంబంధమగు అప్పు ఎప్పుడో తీరిపోయినను మరల జమీందారులకు వారి గ్రామములను స్వాధీనపరచక ఆంగ్లేయ ప్రభుత్వమువారే శాశ్వతముగ నాక్రమించుకొని పరిపాలించుచుండిరి.

ఈజమీందారీలు మొగలాయి ప్రభుత్వము నాటినుండి నున్నవియే. కృష్ణానదికి దక్షిణమున నున్న దేశము కొండవీటి సూబా యనియు, ఉత్తరమున నున్న దేశము కొండపల్లి సూబా యనియు పిలువబడుచుండెను. మొగలాయిల ప్రభుత్వము మారి ఆంగ్లేయ ప్రభుత్వము ప్రారంభమైన పిదప ఇప్పటి గుంటూరు జిల్లా భాగములో ఒంగోలు తప్ప తక్కినదంతయును, కృష్ణకు నుత్తరమున బెజవాడ బందరు గుడివాడ నూజివీడు మొదలగు ప్రాంతమంతయు కలిసి కృష్ణాజిల్లా యను నొక మండలముగ నేర్పరచిరి. జిల్లాకలెక్టరు బందరులో నుండినను జిల్లాకోర్టు గుంటూరులోనే యుండుచువచ్చెను. పిమ్మట కొంతకాలమునకు

జిల్లాకోర్టు సయితము బందరులోనె స్థాపించబడెను. 1904 సంవత్సరములో గుంటూరుజిల్లా ప్రత్యేకించబడువరకు జిల్లాకోర్టును, కలెక్టరు కచ్చేరియును బందరులోనే యుండెను.

# బాల్యము

నల్లచెరువు నానుకొనియున్న రామచంద్ర పురాగ్రహారమును, ఎఱ్ఱచెరువు నానుకొనియున్న పాతగుంటూరు - ఈ రెండును దూరదూరముననున్న స్వతంత్ర గ్రామములేకాని యీ రెంటిమధ్యనున్న భాగమంతయు పిమ్మటి కాలములో క్రమముగ పెరుగుటచేత పైన జెప్పిన రెండు స్వతంత్ర గ్రామములు నొక్క పట్టణముగ రూపమెత్తినవి. కాని అన్నిటికిని పాత గుంటూరే ముఖ్యమగుటచేత పట్టణమున కంతకును గుంటూరు అను పేరే ప్రధానమైనది.

మా పాతగుంటూరులో వాసిరెడ్డివారికి దివానులుగా నున్న పొత్తూరివారు అను నొక ఆర్వేల నియోగి కుటుంబము గొప్ప పేరు ప్రతిష్ఠ పొందియుండెను. మాచిరాజువారు అను మరియొక ఆర్వేల నియోగివంశమువారు గొప్ప అగ్రహారీకులుగా నుండి గౌరవస్థానమున నుండిరి. తక్కిన బ్రాహ్మణ కుటుంబములలో దేశిరాజువారును అక్కినప్రగడ వారును ముఖ్యులు. కాని మా కుటుంబమువారి పేరు కొండవారు. వీరి బంధువులు మట్టిగుంటవారు అను నాలుగు కుటుంబములవా రుండిరి. వీరందరు కూడ లీరులవి ...

బ్రాహ్మణుల తోటివారే గాని పాండిత్య గరిమ గలవారెవ్వరును లేరు. మా కొండవారి కుటుంబమునకు ముప్పది యకరముల యీనాముభూమి యుండెను. మా తాతగారైన అప్పయ్య గారికి చిన్నతనములోనే తల్లి చనిపోయినందున ఆయన తండ్రి గోవిందరాజులుగారు మరల వివాహము చేసుకొనిరి. ఆ రెండవ భార్యకు చినఅప్పయ్య అను నొక కుమారుడును, ఆయనకు కుమాళ్ళు, కుమార్తెలు నుండిరి.

మా తాత అప్పయ్యగారు వాసిరెడ్డివారి జమీనుకు ప్రధాన స్థానముగానున్న అమరావతిలో నేదియో యుద్యోగము చేయుచు అక్కడనే చాలకాలము కాపురముచేసి ఉద్యోగము మాని గుంటూరు తిరుగవచ్చునప్పటికి ఈనాముభూము లును, కుటుంబపు ఇల్లును సవతి సోదరుని కుటుంబమువారు అనుభవించుచుండిరి. ఎట్లో కొంత ప్రయత్నముమీద ఈనాము భూమి ముప్పది యకరములలో మా తాతగారి సగభాగము విడగొట్టి, ఆయనకు స్వాధీనపరచి, కుటుంబపు ఇంటి ఆవరణ స్థలంలో చాలవరకు సవతిసోదరుల కుటుంబము క్రిందనే యుంచు కొని, తూర్పుమూల మూడువందల గజముల ఖాళీస్థలములో నున్న యొకంటి దూలపు పాత పెంకుటిల్లు మా తాతగారికి నిచ్చి యుండిరి. ఆ యింటిలో కాపురముచేయుచు తన భాగమునకు వచ్చిన పదునైదు యెకరముల భూమిని నొక జీతగానిని పెట్టు కొని వ్యవసాయము చేయించుకొని దానివలన వచ్చెడి ఆదాయ ముతో నెట్లో కాలము గడుపుచు పెద్దకాలము జీవించి లోక మును విడిచిపోయిరి. ఆ తుదిదినము ఉదయముననే లేచి

ఊరికి మైలుకంటె దూరముననున్న తనభూమికి కాలినడకను పోయి భూమి చుట్టును ప్రదక్షిణముచేసి "తల్లీ! ఈ దినముతో నీకును నాకును ఋణము తీరెన"దని భూదేవికి నమస్కరించి వచ్చెనట. ఆరాత్రియే ఆయన మరణించెను.

మా తాతగారు చనిపోవునప్పటికి ఆయన భార్యయును నొక కుమారుడును, నొక వితంతువగు కుమార్తెయు నుండిరి. మా తాతగారివలెనే మా నాయనమ్మగారును అమాయికురాలు. అప్పటికి కొమారుడు అనగా మా తండ్రిగారు ఇరువది రెండేండ్లకు లోపు ప్రాయములో నుండిరి. మా మేనత్తగారు ఆమె యత్తవారింటనే యుండెడిది. కాబట్టి మా తాతగారు చనిపోవు నాటికి ఇంటిలో మా తండ్రిగారును మా నాయనమ్మగారు మాత్రమే యుండిరి. భూమివలన వచ్చెడి ఆదాయమే వీరికి జీవనాధారముగా నుండెను. పదునైదు యకరముల భూమి యైనను వర్షము లధికముగ నుండుటచేత పంట తక్కువగ నుండెను. కమతగానికి ఇయ్యవలసినది పోను మిగిలెడి ఆదాయము వారికి చాలకుండెను. ఒకనాడు పొలములో ఏదో ధాన్యము కైలు చేయించుటకు వెళ్ళి మధ్యాహ్నపువేళ కమతగానిని ఇంటికి అన్నమునకు పంపి మా తండ్రి తానొక్కడే కాపలా కాయుచుండెను. ఎండ చురుకుగా నుండెను. ఆ పొలములో నొక తాటిచెట్టు మాత్రముండెను. ఆ చెట్టు నీడనే కూర్చొని మా తండ్రిగారిట్లు ఆలోచించెను. "ఎన్నాళ్ళు ఈ భూమిని నమ్మి వ్యవసాయము చేయించుకొన్నను పొట్ట గడచుట కష్టముగానున్నది. దీనినే కనిపెట్టుకొని యుండిన

ఇంతకుమించిన ఆదాయము రాబట్టుటకు అవకాశము లేదు. కాబట్టి వ్యవసాయము ఎత్తివేసి భూమిని ఇతరులకు కవులు కిచ్చి ఎక్కడనైన నుద్యోగము సంపాదించుకొని జీవించుట యుక్తము" అని యోచించి, వ్యవసాయము ఎత్తివేయుటకు నిశ్చయించుకొనెను. భూమిని సాలుకు రు 32 లకు మక్తాయిమ్చులాగున ఒక ఆసామికి కవులుకిచ్చి, ఉద్యోగము నిమిత్తము ప్రయత్నము నాగించెను. మా ఇంటికి దాపుననే సర్వే డిపార్టుమెంటులో ఉద్యోగిని ఆశ్రయించగా నుద్యోగమిప్పించెదనని వాగ్దచ్చెను గాని తుదకు ఆయన సహాయము చేయలేకపోయెను. ఇప్పుడు వైశ్యులని పిలువబడువారు నాడు కోమట్లని పిలువబడుచుండిరి. వారు బ్రాహ్మణులయందు హెచ్చుగా భక్తివిశ్వాసములు గలిగియుండిరి. వారియొద్ద గుమాస్తాగా ప్రవేశించినవారు నమ్మకస్తులైన యెడల మిక్కిలి గౌరవము చూపుచుండిరి. కనుక ఒక కోమటివారి కొట్లో మా తండ్రిగారు ప్రవేశించిరి. కాలము గడచిన కొలది మా నాయనగారియందు మిక్కిలి గౌరవము చూపుచు వారి కొట్లో అమ్మకమైన సరుకులోనుండి గుమాస్తాగారి భాగమని కొంచెము సరుకు తీసి వేరుగా పెట్టుచుండిరి. అట్లు వేరుపరచిన సరుకులు మా తండ్రిగారింటికి తెచ్చుటచేత యింటిలో పలువిధములయిన సరుకులు కొఱతలేకుండ నుండెను. గుమాస్తాగిరిలో ప్రవేశించిన పిదప కుటుంబవ్యయములకు కొదువలేకుండ చేతిలో డబ్బు మెలగుచుండెను. తెచ్చినడబ్బు తల్లిగారి కిచ్చెడివారట. పెట్టె బేడలు ఏమియు లేకపోవుటచే నొక గూటిలో ఆమె దాచి పెట్టుచుండెను. ఇట్లు జరుగుచుండగా మా తండ్రిగారికి వివా

హము చేసుకొనవలెనని కుతూహలము కలిగెను. మాతల్లి, వలివేటికాపురస్థులు తిమ్మరాజు గోపాలరాయుడుగారి కుమార్తె అయినను మట్టిగుంట నారాయుడుగారు తనకు పిల్లలు లేక పోవుటచేత ఆమెను తెచ్చుకొని పెంచుకొనుచుండెను. ఆ నారాయుడుగారు పాతగుంటూరులో మా ఇంటికి సమీపము లోనే కాపురముండిరి. కలసిన బంధుత్వమే యగుటచేత ఆమెను మా నాయనగారి కిచ్చి వివాహముచేసిరి. ఏదో కొంత సంపాదించుకొనుచున్నను వివాహఖర్చులకుగాను ఒక బందుగు రాలియొద్ద అప్పు తెచ్చుకొనెను. కాని ఆమె కొలదిరోజులలోనే తన బాకీ చెల్లించవలసినదని నడిబజారులో తగాదాపరచినందున అగౌరవముగా తోచి రామచంద్రపురపుఅగ్రహారములో పెన్షను పుచ్చుకొన్న ఒక తహశ్శీలుదారునొద్ద తన యీనాము పదు నైదు యకరములు తాకట్టుపెట్టి ఆమెబాకీ వెంటనే చెల్లించెను. కాని తాకట్టు వ్రాసి సొమ్ము తెచ్చినదిమొదలు దానిని సాధ్యమైనంతత్వరలో తీర్చివేయువలెనని పట్టుపట్టి కొన్ని మాసములలో బాకీ చెల్లించి, తాకట్టు విడిపించుకొనెను. మా తండ్రిగారు నానాటికి సంపాదనపరు లగుచుండిరి. నాకు ముందు నా తల్లిగారికి ఒక ఆడపిల్ల పుట్టెను. పిమ్మట రెండేండ్లకు నేను జనన మొందితిని. మా అక్క పసితనముననే చనిపోయెను. మా తల్లిగారికి పిమ్మట ఏడేండ్లవరకును సంతానము లేదు. కాబట్టి ఆమెయొద్ద నేను చాలకాలము స్తన్యపానము చేయు చుంటిని. మా తల్లిగారు ప్రతిదినమును సూర్యునకు నమస్కా రము చేసిననేగాని భోజనముచేయునదిగాదు. మబ్బుపట్టి సూర్య బింబము కనుబడని రోజామె కుపవాసమే.

నాకు అయిదవయేడు రాకముందు ఏదో కాయలా ఏర్ప డెను. మా నాయనమ్మగారును ఏదో జబ్బువలన చనిపోయెను. ఆమె అస్థులను వైకుంఠపురమునకు గొనిపోయి కృష్ణలో గలిపి తిరిగివచ్చునపుడు నాకు కాయలా నయమైన యెడల నా పుట్టు వెంట్రుకలు తీయించి ఉపనయనము అచ్చటి స్వామి దేవాలయ ములో చేయుదునని మా తండ్రిగారు మ్రొక్కుకొని వచ్చెనట.

# విద్యాభ్యాసము

అయిదవయేట నన్ను బడిలో చదువవేసిరి. ఆరోజున నాకాళ్ళకు ముచ్చులజోడొకటి తొడిగి క్రొత్తరుమాల నాపైన గప్పిరి. బడిపంతులు పిల్లలతోగూడ మాయింటికి వచ్చిరి. ఓం నమశ్శివాయ సిద్ధం నమః అనువాక్యములు వ్రాయించిరి. పిమ్మట పంతులుగారు నన్ను తనచంకను బెట్టుకొని బడికి తీసికొని పోయిరి. చదువులబడి పాతగుంటూరులో మరియొకబజారులో నొక పెద్దఅగ్రహారీకులైన మద్ధ్వులయింట నుండెను. ఆయింటి వారి పిల్లవాడును చదువుకొనుచుండెను. పంతులుగారు ఆయింటి లోనే ఒకవైపున కాపురముండిరి.

ఆయింటి యజమానురాలు నన్ను దయతో చూచు చుండెను. తన కుమారునితోపాటుగ నా తలయును దువ్వుచు ప్రేమతో మాట్లాడుచుండెను. అందరికంటె ముందు బడికి పోవు చుండినందున శ్రీయో చుక్కయో నాకే లభించుచుండెను. బాలు రందరిలో నొకకొంత చురుకైనవాడని నన్ను భావించుచుండిరి.

తెలుగుబడిచదువు అనగా చిన్నబాలశిక్ష కొన్ని ఆట విడుపుపద్యములు, ఎక్కములు మొదలగునవి. మాకంటె పెద్ద బాలురు కొందరు వెనుకలువేయుచుండిరి. అనగా నింగ్లీషులో Practice లెక్కలవంటివి.

నా తొమ్మిదవయేట కలప మొదలగునవి మా నాయన గారు బెజవాడనుండి కొనితెచ్చి మా మూడువందలగజముల ఖాళీస్థలములోనే చిన్న పెంకుటిభవంతి కట్టించి, అందులో కాపురముండిరి. మా తండ్రిగారు మ్రొక్కినమ్రొక్కుబడి చెల్లించుటకు వైకుంఠపుర దేవాలయములో నాకు పుట్టువెంట్రుకలు తీయించి ఉపనయనముగూడ చేసిరి.

మా తండ్రిగారు చాల మితవ్యయపరులు. మా తల్లి గారికి గట్టిగట్టు చేతిగాదని ఆమెను కోపించుచుండెడివారు. మా తండ్రిగారు ఆ కోమటి గుమాస్తాపనియే చేయుచుండిరి. మధ్యాహ్నము భోజనమునకు ఇంటికి వచ్చునపుడు వాకిటిలో ముష్టిపెట్టునపుడు రాలినగింజలు చూచి కోపించి ఆగింజలు ఎత్తువరకును లోపలికి వచ్చువారుకారు. ఎవ్వరియొద్దను అరువు గాని, బదులుగాని తెచ్చుట ఆయనకు అయిష్టము. ఇంట లేని వస్తువు ముందుగా చెప్పవలసినదని మాటిమాటికి మాతల్లిగారిని హెచ్చరించుచుండెడివారు.

తాకట్టుఋణము తీర్చినపిమ్మట వా రెవ్వరివద్దను అప్పు తెచ్చియుండలేదు. ఇతరులకు ఋణము లిచ్చుచుండెడివారు.

బాకీచెల్లింపవచ్చినవారు సాధారణముగ చదువురానివారుగనుక లెక్క ఋజువుచూచుకొనుటకు తెలిసినవారి నెవ్వరినైన తెచ్చు కొనుడని నిర్బంధించుచుండెడివారు. ఎవ్వరును దొరకనిపక్షమున తామే వడ్డీ కట్టి, ఒక కాగితముమీద వ్రాసియిచ్చి ఎవ్వరికైన చూపించుకొని సరిగానున్నదని చెప్పినమీదటనే బాకీ చెల్లు పుచ్చుకొనుచుండిరి. ఋణస్థుడు ఎంతగా కోరినను ఒక్కదమ్మిడీ యైనను తీసివేయక చాల నిష్కర్షగను నిష్పక్షపాతబుద్ధితోను వర్తించుచుండెడివారు. దేని నిమిత్తమైనను ఇతరుల నాశ్రయింప నొల్లకుండెడివారు. మాయూరిలో పేరుపొందిన పెద్దకుటుంబముల వారితో సంబంధములుపెట్టుకొనుటయు, వారి యిండ్లకు బోవు టయు ఆయనకు అభ్యాసములేదు. చాల స్వతంత్రప్రియులు, అభిమానవంతులును.

నా యేడవయేట మాతల్లి రెండవ కుమారునికనెను. ఆమె సూర్యనమస్కారములు చేయుచుండెనుగాన వానికి సూర్య నారాయణ అని పేరుపెట్టిరి. మరల మూడేండ్లకు నా రెండవ తమ్ముడు జన్మించెను. ఇతనికి ఆదినారాయణ యని పేరుపెట్టిరి. పిమ్మట కొలదికాలమునకు మాతల్లి మరణించుటచేత పసిబాలుడు గానున్న మా చిన్నతమ్ముని మా అమ్మమ్మగారు వలివేరు తీసుకొనివెళ్లి కొన్ని సంవత్సరములు పెంచినది. అప్పుడో, మరికొంత కాలమునకో వానిని హరినారాయణయని పిలువ నారంభించిరి.

మాతల్లిగారు వైద్యుని తెలివితక్కువవలన ఆకస్మికముగ మృత్యువువాతబడినది. ఎదియో చిక్కాక తగులుచు కాళ్లు

నొప్పుచున్నవని మా తండ్రిగారితో పలుమార్లు చెప్పు చుండుట చేత నొక మధ్యాహ్నము పేరుపడిన తంబల వైద్యు నొకని పిలుకొనివచ్చిరి. ఆయన తన యిత్తడిపెట్టెలో నున్న కుప్పెకట్టెలు కొన్ని బండమీద నూరి, మాత్రలుకట్టి, ఒక పెద్దమాత్ర ఆమెచే తినిపించుటయేగాక బండకడిగిన ఔషధపునీళ్లుగూడ త్రాగించి వెళ్లిపోయెను. సాయంకాలమగునప్పటికి విరేచనములుప్రారంభమై పలుసారులు రక్తముగూడ పడసాగెను. పిమ్మట నోడలు చలువలుగమ్మి నోటిమాట పడిపోయినది. ఆ వైద్యుని పిలిపించినను మరల రాలేదు. పిమ్మట పదునైదురోజులు దాదామియా యను యునానీడాక్టరు, పేరుపొందినవాడే, ఏవేవో ఔషధములిచ్చెను గాని దినదినము క్షీణించి పదునారవరోజున మాతల్లిగారు మరణించిరి.

ఆమె చనిపోవునాటికి ముప్పదియేండ్లది. ఆమె మొదటి నుండియు సుకుమారముగ పెరిగినది. గాన బలహీనురాలు. సామాన్యముగ ఆరోగ్యముగనే యుండునది. ఇంటిలో దాసీపని వారు లేరుకావున కసవూడ్చుట, ఇల్లుఅలుకుట, అంట్లుతోముట చెరువుకు పోయి నీళ్లుతెచ్చుట, మడిబట్టలు తడిపి పిండి ఆరవేయుట, బావికి పోయి మడినీళ్లుతెచ్చుట మొదలగు పనులన్నియు ఆమె యొంటిగనే చేయుచుండెను. బిడ్డలపోషణ, ఇంటిలో వంట, పెట్టుఅనునవి ఆమెకుతప్పనివే. సాధారణముగ ప్రతిగృహమందును ఆడవారు ఈపనులన్నియుచేయుట ఆకాలమున అగౌరవముగ నెంచెడివారు కారు. ఈదినములలోనైనను పల్లెటూళ్లలో సామాన్యకుటుంబములలో ఈరీతినే ఆడవారుపాటుపడుచుందురు.

మాతండ్రి కావపారుగా నుండు దృఢకాయుడు. ప్రతి దినమును ఉదయముననే చెరువునకు బోయి స్నానముచేసి సంధ్యా వందనముచేసుకొని, పేటకు బోయి, మధ్యాహ్నమునకు ఇంటికి వచ్చి, మడిగట్టుకొని సంధ్యవార్చి భోజనముచేయువారు. రాత్రి ప్రొద్దుపోయి ఇంటికివచ్చినను సంధ్యవార్చుకొనియే భోజనము చేయుచుండిరి. ఇట్లు ప్రతిదినము మూడుసారులు సంధ్యావంద నముచేయుటయు, అప్పుడప్పుడు దేవాలయమునకు బోయి దేవ దర్శనము చేసుకొనుటయు వారికి అభ్యాసము. ఇంతకుమించిన మతవిషయమైన ఆలోచనలు ఆయనకు ఉండినట్లు కనబడవు. ఆయన సాధారణముగ కోపదారి. కొంత కఠినహృదయముకలిగి మిక్కిలి మితభాషిగా నుండెడివారు. తనసొమ్ము రవ్వంతయైన నితరులకు బోనీయక మితవ్యయముతో కాలముగడపుచు ఉన్నంతలో ద్రవ్యము కూడబెట్టి వృద్ధిచేసిరి. పాతభూమికి ఎరువుదోలించి బాగుచేయించి పాలికిచ్చి ఫలదాయకముగాఎం చిరి. మరికొన్ని క్రొత్తభూములు కొనిరి. తనద్రవ్యము బీరుపోకుండ నెంత గట్టిపట్టుగనుండునో యితరులసొమ్ముపట్లగూడ అంత పట్టు గనే యుండి తృణమైన అపేక్షించువారు కారు. ఇతరులపై నాధారపడక స్వప్రయత్నమువలననే తనపనులు సాగించుకొనవలె నను గట్టిదీక్షతో వర్తించుచుండెను. మాతల్లి దయాదాక్షిణ్య ములు గలది. బీదసాదల కష్టములకు జాలిచెందియు, ఒక్క కాసైనను చేతలేమి, నేమియు చేయలేకుండెను. ఇంటిలో బియ్యము, పప్పు మొదలగు ద్రవ్యములు సమృద్ధిగ నుండినను వానిలోనుంచి ఇతరుల కిచ్చినచో మా తండ్రిగారు కోపపడుదురని మిక్కిలి భయపడుచుండెను. కాని ఒకానొకప్పుడు, మిక్కిలి

కష్టములోనున్నవారి కెట్లో రహస్యముగ కొలది. సాయము చేయుచునేయుండెను. కాని ఆమె యకాలమరణమువలన అప్పుడప్పుడే కూడబారుచున్న కాపురము ఒక్కసారిగ కూలినట్లుండెను. ఆమె చనిపోవునాటికి మా మేనత్తగారు మాయింటిలోనే యుండెనుగాని కొలదిమాసములకే మా తండ్రిగారితో కలహించి ఆమె అత్తవారింటిలో సవతికొమారునియొద్దకు వెడలిపోయెను. అందువలన ఇంటిలో ఆడదిక్కు కరవాయెను. మాతండ్రి విశేష ధనవంతుడు గాకపోవుటచేతను ఎవరియందును విశ్వాసములేక పోవుటచేతను ఇంటిపనులకు మరెవ్వరిని ఏర్పాటుచేయలేదు. తాను ఇల్లు కనిపెట్టుకొనియుండువాడు కానందునను, మేము ఏమియు తెలియని చిన్నవాండ్రమగుటచేతను ఇంటి నొక పరాయివంట మనిషిపై వదలిపెట్టుటకు సాహసించలేకపోయెను. అందువలన ఇంటిపనులన్నియు తనమెడను వేసుకొని ఈదవలసివచ్చెను. నౌకరీ వదలివేయుటకు తగిన ఆర్థికస్తోమత లేనివాడగుటచేత ముందు కాపురముగడచుట కష్టముగావచ్చుననుభయముకూడ ఆయన నావహించెను. ఆయన కప్పటికి నలుబదియేండ్లు. మరల వివాహముచేసుకొనుటకు తగిన యవకాశము లుండెను. కాన ఇతరుల ప్రేరణచేత అందుకు కొంత ప్రయత్నముచేసెను. గట్టిగ పట్టుపట్టినయెడల వివాహము సమకూడియేయుండునుగాని, ముగ్గురము మగపిల్లలము చెడిపోవుదు మని యోచించి, వివాహయత్నము మానివేసెను. అప్పటినుండియు దృఢవ్రతుడై బ్రహ్మచర్యమునే నడుపసాగెను.

గుమాస్తానౌకరీచేయుచు, ఇంటిపనులన్నియు చక్కబెట్టి మమ్ము అన్నివిధముల సాకుచు మోయరానిమోపు తలపై

మోయవలసివచ్చెను. కాని విసుగక, ఏమరుపాటులేక ఇంత భారమును వహించుటకు సంసిద్ధురయ్యెను. ప్రతిదినమునను తెల్లవారుఝాముననే లేచి దాశరథీశతకములోని పద్యములు పాడుకొనుచు ఇల్లు శుభ్రముచేసి, పాత్రలుకడిగి తెల్లవారక మునుపే చెరువునకుబోయి స్నానముచేసి బానెనీరు కావిడితో మోసుకొనివచ్చుచుండిరి. అప్పుడే వంటగూడ ప్రారంభముచేసి ఎనిమిదిగంటలలోపల తాను భోజనము ముగించుకొని బజారులో నౌకరీనిమిత్తము పోవుచుండిరి.

మాతల్లి చనిపోవునప్పటికి నేను పదేండ్లవాడను. నేనే ఆమెకు అంత్యక్రియలు జరిపియుంటిని. మా తండ్రిగారు నా ప్రక్కనుండి అన్నియు నాచేత చేయించిరి. అప్పటి కింకను నేను తెలుగుబడిలోనే చదువుచుంటిని. నా పెదతమ్ముని అయిదవ యేట ఊరబడిలో చదువవేసిరి. రెండవతమ్ముడు తొమ్మిది మాసముల పసిబాలుడగుటచేత మా అమ్మను కన్నతల్లి వానిని పెంచుచుండెను.

## ఇంగ్లీషు చదువు

ఇక నాచదువువిషయమై కొంత సమస్య యేర్పడెను. ఇంగ్లీషువిద్య చెప్పించుటయా, లేక పార్శి చదివించుటయా? కొన్ని దినములు మఖ్తబ్ అనగా ఉర్దూపారశాలకు పంపిరిగాని కొలది దినములలోనే అచ్చటనుండి మార్చి ఇంగ్లీషుబడికి పంపించిరి. అది యొక ప్రైవేటు గ్రాంటుస్కూలు. గోవిందరాజు సూర్యనారాయణ

రావుగారు ప్రధానోపాధ్యాయుడుగానుండి బాగా చదువునేర్పువా రని పేరుగాంచెను. ఈపాఠశాలలో నాకంటె చాల పెద్దవారు, పదునారు పదునేడేండ్ల వయస్సుగలవారుగూడ చదువుచుండిరి. ఒక్కొక్కప్పుడు ఈబాలురను బెత్తముతో వీపుమీద మాష్టరు గారు బాదుచుండ చిన్నబాలురము మిక్కిలి భయపడుచుంటిమి. ఆదినములలో విద్యార్థులను బెత్తముతోకొట్టుట చదువులపంతు ళ్ళకు అభ్యాసము. ఇంగ్లీషుబళ్ళలో బెంచిఎక్కించినిలువబెట్టు మరి యొక శిక్షగూడ వాడుకలోనుండెను. తెలుగుబడిలో చదువు నప్పుడుగూడ పంతులుబడిలో లేనపుడు పిల్లలు అల్లరిచేయు చుండిరి. పంతులుగారు ఇంటిలోపలినుండి కోపముతో వచ్చి కేకలువేయుచు బెత్తముతోనందరిని వరుసగ బాదుచుండెడివారు. దైవవశమున నేనుమాత్రము బెత్తపుదెబ్బలు తినుట ప్రాప్తించ లేదు. నాపాఠములు ఏమరుపాటులేక చదివి ఒప్పజెప్పుచుంటిని. కనుక నాయందు వారు దయతోనుండెడివారు. ఒకటిరెండు సంవ త్సరములు ఈసూర్యనారాయణగారిస్కూలులో చదివినతర్వాత మిషన్‌హైస్కూలులో మూడవక్లాసు అనగా ఇప్పటి ఫస్టు ఫారమునకు సరిపోవు తరగతిలోప్రవేశపెట్టిరి. ఈపాఠశాల పాత గుంటూరునుంచికొత్తగుంటూరువచ్చురోడ్డుమీదనె యుండెడిది. కావున నేను పోయివచ్చుటకు సుకరముగనుండెను.

ఇక్కడ చదువుచుండగా మాతండ్రి ఉదయమున ఇంట వంటచేసి భోజనముచేసి, మాతమ్మునిని బడికిపంపి తాను బజారు నకు పోవుచు ఇంటితాళముచెవి నా బడిదగ్గరకు వచ్చి నా కిచ్చి పోవుచుండిరి. నేను బడివిడిచినపిదప పదిగంటలకు ఇంటికిపోయి

మాతమ్ముడును నేనును కలిసి అన్నముతిని మధ్యాహ్నము రెండు గంటలవరకును ఉండి మరల నిరువురమును అన్నముతినినపిమ్మట తమ్ముని బడికిపంపి నేను బడికిపోవుచుండెడివాడను. మరల సాయంకాలము ఇంటికిచేరి చీకటిపడునప్పటికి దీపమువెలిగించి యింటిలో నుండలేక మే మిరువురమును తలవాకిట గూరుచుండి మాతండ్రిగారిరాకకు ఎదురుచూచుచుండువారము. ఒక్కొక్క సారి లోపలికిబోయి అమ్మా యని పిలిచి ఏడ్చుచు మరల వెలుపలకువచ్చుచుండువారము. మానాయనగారింటికివచ్చినపిమ్మట ప్రొద్దుటివంటపదార్థములనే ముఖ్వారమును తిని పరుండెడివారము. ఈరీతికష్టములు ఏడుసంవత్సరములు పడినపిమ్మట మా మేనత్త గారు తనంతటతానే మాయింటికి వచ్చినందున అప్పటినుండి మానాయనగారికి ఇంటిపనులభారము తప్పెను. మేమందరము కొంతసౌఖ్య మనుభవించితిమి. నేను నాబడిలో చక్కగ పరీక్షలలో కృతార్థుడనగుచుండుటయేగాక తరగతిలో మెరుగుగ నుండుటచే జీతమీయనక్కరలేకుండ ఉపకారవేతనము నిచ్చుచుండిరి. ఇదిగాక కొన్ని పుస్తకములును బహుమతిగ నిచ్చుచుండెడివారు. ఏటేట జరుగువార్షికోత్సవసభలలో బాలురచేత పద్యములు పాడించుచు వినోదసంభాషణలు (Dialogues) చేయుచుండిరి. ఒకసారి మరియొకవిద్యార్థితో నట్టి సంభాషణ గావించుటలో నేను రోకంటిపాటవలెగాకుండ సహజరీతి భాషించుటచేత సభ్యు లంద రానందమొందిరి. అప్పుడు మాకు ఆంధ్రోపాధ్యాయులుగానుండిన శ్రీ కొండుభొట్ల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు కొన్ని నాటకములు తెలుగున వచనశైలిని వ్రాసి వానిని ప్రదర్శింపవలెనని కుతూహలపడుచుండిరి. వారు అందుకు

నాటక పాత్రలుగ మార్చతలచినవారిలో నన్నుగూడ చేర్చి ప్రోత్సహించిరి.

అదివరకు దేశములో వీధినాటకములు సామాన్యముగ నాడుచుండిరి. చాలవరకు ఈ నాటకములలో దరువులుపాడుచు నృత్యముచేయుచుండుటచేత సంగీతము ప్రధానముగ నుండెను. ఈ నాటకబృందములలో చాలవరకు బ్రాహ్మణులే చేరియుండిరి. వీరిలో కొందరి నడవడి చెడ్డదిగ నుండెను. అందువలన భాగవతులు అంతగా గౌరవపాత్రులుగ నెంచబడకుండిరి. కాని కూచిపూడిభాగవతులనువారు ఈప్రాంతమున మిక్కిలి పేరు పొందిరి. వీరిలో భరతనాట్యము, అభినయశాస్త్రములందు ప్రవీణులై పేరెక్కినవా రుండిరి.

నే నప్పటికి మిడిల్‌స్కూలుపరీక్షలో కృతార్థుడనై యుండియుందును. అది ఇప్పటి ఫోర్తుఫారమువంటిది.

## నాటకములు - వేషధారణ

ఆ దినములలోనే ధార్వాడనాటకసంఘము గుంటూరులో నాటకములను ప్రదర్శించి ప్రేక్షకుల నెక్కువగ నాకర్షించి గొప్పగా ధనము నార్జించెను. వీరు వీధులలో నాటకములు ఆడక పెద్ద పాకవేసి ఆపాకలో నాటకరంగమేర్పరచి దానిలో పలు రంగుల తెర లమర్చి అలంకరించి ఆకర్షణీయముగ జేసియు, నాటకపాత్రలకు వీధినాటకములలోవలె మోటుగ కిరీటములు,

భుజకీర్తులు మొదలగు నలంకారములు చేయక వారివారి స్థితుల
ననుసరించి సహజముగ ప్రజలు ధరించు దుస్తులను ధరింపజేసి
వచన శైలిని సామాన్యముగ నొకరితో నొకరు మాట్లాడినట్లే
నాటకప్రదర్శనము గావించుచుండిరి. ఇందులో శృంగారము,
క్రోధము, శోకము మొదలగు రసములు మిక్కిలి నిపుణముగ
సహజముగ ప్రకటితమగుచుండెను. శోకమును పాడుచు,
ప్రదర్శించుట సహజానుభవమునకు విరుద్ధముగ దోచకమానదు.
కాబట్టి సహజమార్గమున శృంగారాదిరసములను ప్రదర్శించుట
యను నూతనపద్ధతి పలువురకు ఆనందము గొల్పుచుండెను.

ఈ నాటకసంఘము ఆంధ్రదేశములో చాల స్థలములందు
ప్రదర్శనములు గావించి ప్రఖ్యాతిగాంచెను. కావున వచనముననే
కొన్ని నాటకములు వ్రాసి, సిద్ధముచేసి శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రి
గారు కొందరు విద్యార్థులను నాటకములందు ప్రీతిగలవారిని
చేర్చి, సొమ్ము సంపాదింపవలెనను ఉద్దేశ్యముతోగాక, కేవలము
ఆత్మానందము నిమిత్తము ప్రజలనానందింపజేయుటకు నుద్దేశించి
గుంటూరు హిందూనాటక సమాజమను నొకసమాజమును స్థాపించిరి. శ్రీరామజననము, సీతాకళ్యాణము, ప్రహ్లాదనాటకము,
హరిశ్చంద్రోపాఖ్యానము, మొదలగు నాటకములు వేసవి సెలవు
లలో వరుసగ కొన్ని సంవత్సరములు ప్రదర్శింపజేయుచువచ్చిరి.
వీరిరచనలు రసపూరితములై మిక్కిలి జనరంజకములుగనుండెను.
కొందరు సమర్థులగు నటులు నేర్పడిరి. తగినస్థలములో పాక
వేయుట, తెరలు సిద్ధముచేయుట నాటకపాత్రలకు కావలసిన
దుస్తులు అలంకారములు మొదలగుపనులు సర్కారు కచ్చేరీలలో

గుమాస్తాలుగానుండిన పొత్తూరు కృష్ణయ్య, భువనగిరి హనుమ దీక్షితులు, భాగవతుల రాఘవయ్యగార్లును, గుంటూరు ఉన్నత పాఠశాలలో ఉపాధ్యాయుడుగానున్న భాగవతుల చెన్న కృష్ణయ్యగారును చాల శ్రద్ధతో జరుపుచుండిరి. శ్రీ మల్లాది సోమయాజులు, ఇవటూరి వియ్యన్నగార్లును విదూషకవేషమున మిక్కిలి సమర్థులు. ప్రతినాటకమునందు నాయకపాత్రకు కలపటపు నరసింహము అను నొక విద్యార్థి సమర్థుడుగనుండెను. ఈయన బందరులో పిమ్మట కొంతకాలమునకు శెకండుగ్రేడు ప్లీడరుగ పనిచేసిరి. నాకు ప్రతినాటకమందును ముఖ్యమగు స్త్రీపాత్ర నియమించిరి. చెన్నూరు సూర్యప్రకాశరావు, భువనగిరి సూర్యనారాయణ యను మరియిరువురుగూడ స్త్రీవేషములు వేయుచుండిరి. వారివేషములు ఎక్కువ అంద ముగ నుండెడివిగాని వారిలో కథనడిపించు సామర్థ్యము కొంత కొరవబడియుండుటచేత నన్నే ప్రధానస్త్రీపాత్రగా నేర్పరచ వలసివచ్చినది. ఆకృతిగూడ పాత్రోన్నతికి అనుకూలముగనే యుండి ప్రసంగములలో సందర్భోచితముగ రసపోషణచేయుచు ప్రేక్షకుల హృదయముల నాకర్షించుచుంటినని పలువురు నన్ను మిక్కిలి అభినందించుచుండిరి. మంగళపల్లి శాస్త్రి యను నొకరు నాటకములలో విశ్వామిత్రవేషమును, రౌద్రరసప్రధానమగు ఇతరవేషములను వేయుచుండిరి. ఇతని ప్రసంగములు మిక్కిలి శ్లాఘ్యములుగ నుండెడివి. మొత్తమున ఈనాటకసంఘమున చేరినవా రందరును సమర్థులని పేరుపొందినారు. ఈ నాటక సంఘము గుంటూరులో ఫస్టుకంపెనీ అని పిమ్మట కొన్ని సంవత్సరముల వరకు పేరుగాంచెను. పిమ్మట మరియొకసంఘము

మేర్పడుటచేత దీనిని అట్లు ప్రజలు పిలువనారంభించినారు. మేము ఈ సంఘము నడిపినంతకాలము ద్రవ్యాపేక్షలేక కేవలము వినోదముగనే నడిపించియుంటిమి. ఒక్కసారి రాజమహేంద్ర వరములో మా నాటకసంఘము హరిశ్చంద్రనాటకము ప్రదర్శించెను. మొదటిసారి ఆనాటకము వేసినరోజున ఎవ్వరో పాకపై నిప్పువేయుటచేత ప్రేక్షకులలో కలవరముకలిగి పాకలోనుండి వెలుపలకు తప్పించుకొనిపోవలెనను తొందరలో నొకరినొకరు త్రొక్కుకొనుట, కొందరికి గాయములగుట మొదలగు ప్రమాదములు సంభవించినవి. కాని రెండవసారి వేసిననాటకము చాల జయప్రదముగ నడిచెను. అక్కడ ప్రధానన్యాయవాదులలో నొకరైన మాకర్ల సుబ్బారావునాయుడుగారును గవర్నమెంటు కాలేజీలో లెక్చరరుగానున్న శ్రీ వావిలాల వాసుదేవశాస్త్రి గారు మొదలగు పురప్రముఖులు నాటకముదర్శించి పాత్రల సామర్థ్యమును మిక్కిలి పొగడిరి.

నాటకములలో పాత్రవహించిన కారణమున చిన్నతనము నుండియే గుంటూరుపట్టణమునందు సామాన్యముగ నన్ను పలువురు గుర్తించుచుండిరి.

ఇట్లు నాటకములలో పాల్గొనుచున్నకారణమున నా బడిలో పాఠములకు లోటురాకుండ చక్కగనే చదువుచు పరీక్షలలో మెప్పుగ కృతార్థతచెందుచు ప్రతిసంవత్సరము వార్షికోత్సవ సభలలో బహుమతులను పొందుచుండుటచేత మా తండ్రిగారికి నాటకములలో తిరుగుట ఇష్టములేకపోయినను నాకు ఆవిషయమున ఎట్టి అడ్డుపాటును గావించినవారుకారు.

# మిషను పాఠశాల

నేను చదువుకొనుచున్న మిషన్‌పాఠశాలలో ప్రధానోపాధ్యాయులు అమెరికాదేశమునుంచి వచ్చిన యొక పాదరి. ఆయన పేరు డాక్టర్ యూలు. వీరుమిక్కిలి దైవభక్తిగలవారు. నీతివర్తనయందు ఈడులేనివారు. అసిధారావ్రతచర్య నడుపు మహార్యశ్రేణిలోచేరిన మహానుభావుడు. క్రీస్తుసిద్ధాంతములను తదేకనిష్ఠతో ఆచరింప ప్రయత్నించుచుండెడివాడు. ఇట్టి సత్పురుషుని యొద్ద నేను విద్యాభ్యాసము బడయుఅవకాశము కల్పించినందుకు ఇప్పటికిని పరమేశ్వరుని కృతజ్ఞతతో తలచుచుందును. నా జీవితములోని నైతికవిషయములందు తండ్రిగారును ఈ విద్యాగురువులగు యూలుదొరగారును నాకు మేలుబంతులు. వారు పెట్టిన ఒరవడిని నేను అనుదినము ననుసరించి ప్రవర్తింప ప్రయత్నించినాను. తక్కిన పాఠములవలెనే క్రైస్తవ మతగ్రంధమగు బైబిలుపాఠమును క్రమముగ పఠించెడివాడను. సామాన్యముగ తక్కిన విద్యార్థులకంటె శ్రద్ధతో చదువుచు, చురుకుగానుంట గమనించి, నాయందు ఉపాధ్యాయులు ప్రేమపూరితులై యుండిరి. ప్రధమఫారములలో చదువు ప్రారంభించినప్పుడే శ్రీ నారప్పగారను నొకఉపాధ్యాయులు నన్నెక్కువ ఆదరించుచుండిరి. వారింటికి బోయి రాత్రివేళ అక్కడనే చదువుకొనుచుండెడివాడను. వారింటిలో ఆడవారుసహితము నన్నాదరణతో చూచుచుండెడివారు. పైతరగతులలోనికి వచ్చిన కొలదియు నావిషయము శ్రీ ఊలుదొరగారు ఎక్కువగ పరికించుచుండిరి.

నన్నొక క్రైస్తవవిద్యార్థి అకారణముగ కొట్టినందున నేను ఊలుదొరగారితో చెప్పుకొంటిని. ఆ కుఱ్ఱవానిని బిలిచి, చేయిచాపించి అరచేతిలో బెత్తముతో పదిదెబ్బలుకొట్టిరి.

మాచిరాజు సుబ్బారావను నా సహాధ్యాయి గజ్జితో తరగతిలో అందరితో కలసి కూర్చొనుచుండగా నేను ఊలు దొరగారితో చెప్పుటతోడనే ఆయన తరగతిలో చివరను ఇతరవిద్యార్థులతో కలియకుండ నింమక దూరమున నాతని కూర్చుండచేసెను.

నే నొకప్పుడు జబ్బుపడి, దేహమున నీరుజూపి, బడికి పోవుట కొన్నిదినములు మానవలసివచ్చెను. అప్పు డొక దినమున ఊలుదొరసాని మాయింటికి వచ్చి, నాస్థితి చూచి, నన్ను గవర్నమెంటుఆస్పత్రికి తీసికొనివెళ్ళి, అక్కడి డాక్టరుతో చెప్పి, నాకు మందిప్పించెను. ఆ ఔషధముతో నాకు ఆరోగ్యము కలిగి తిరిగి బడికిపోవుట కవకాశముకలిగినందున ఊలుదొరగా రును ఆయనభార్యగారును మిక్కిలి సంతసించిరి. దైవాను గ్రహమున వారికి నాపై నిట్టి అభిమానము గలిగెను.

నేను అయిదవతరగతిలో చదువుచుండగా రివరెండుపాలు అను నొక క్రైస్తవుడు హెడ్‌మాష్టరుగా నుండెను. అగ్రహారీకు లగు మాచిరాజువారికుటుంబములో చేరిన కృష్ణమూర్తియు సుబ్బారావు అను ఇరువురుబాలురుగూడ విద్యార్థులుగా నుండిరి. వీరిలో మొదటివాడు మాకు పై తరగతిలోనూ, రెండవవాడు

మాతరగతిలోనూ చదువు చుండిరి. వీరు చక్కని రూపములకు దోడుగా విలువగల దుస్తులుధరించి, తాము గొప్పవారమను గర్వముతో వర్తించుచుండిరి. తెలివితేటలుగూడ వీరి కుండెను. వీరియందు మా హెడ్‌మాష్టరుగారికి అభిమానము. వారిని మెచ్చుకొనుచుండెడివారు. ప్రతిఆదివారమును ఈసోదరు లిర్వురును హెడ్‌మాష్టరుగారింటికి పోయి, వారితో సరససల్లాపములు గావించుచు వినోదముగ కాలముగడుపుచుండిరి. బడిలోగూడ హెడ్‌మాష్టరుగారు తమవారైనట్లు, సంభాషణలవలనను, నడవడివలనను బయలుపరచుచుండిరి. ఇట్లుండ క్లాసుపరీక్షలు సమీపించినవి. రాబర్టు అను నా సహాధ్యాయి యొకడు బడిలోనుండి వెలుపలకు నన్ను బిలిచి, రహస్యముగ నిట్లనెను. "మన హెడ్‌మాష్టరుగారు మాచిరాజు సుబ్బారావుకు, ఆయన అనుకొన్న పరీక్షాప్రశ్నలు ముందుగనే చెప్పినాడట. ఇది మిక్కిలి అన్యాయముగదా! ఈసంగతి నీవు ఊలుదొరగారికి తెలుపవలెను. వారు విచారణచేసినయెడల నిజము బయటపడును" అని నన్ను బలవంతపెట్టెను. నేను అందుకు సమ్మతించి, ఊలుదొరగారితో "పరీక్షాప్రశ్నలు ముందుగనే హెడ్‌మాష్టరుగారు తమకభిమానపాత్రులైన సుబ్బారావునకు, ఆయన అన్నగారికి చెప్పినారని అనుకొనుచున్నారు. వారిరువురును ప్రతిఆదివారము హెడ్‌మాష్టరుగారి యింటికిబోయివినోదములతో కాలముపుచ్చుచుందురు" అనినేను మనవిజేసితిని. అంతట ఆయన కొన్నిరోజులు విచారణజేసి హెడ్‌మాష్టరు రివరెండుపాలుగారిని ఉద్యోగమునుండి బర్తరఫు చేసిరి. ఇంత కఠినమైనశిక్ష విధింతురని మే మెవ్వరము అనుకొన

లేదు. మాకును ఈచర్య మిక్కిలి సంతాపము కల్గించెను. పాలుగారు బడివిడిచిపోవురోజున బడిలోనిబాలుర నందరిని సమావేశపరచి తా నేపాపము నెరుగననియు, ఎవ్వరో దుర్మార్గులు చేసినపితూరీనిబట్టి అక్రమముగా తన్ను ఉద్యోగమునుంచి తొలగించుట కలిగినదనియు, ఇట్టి ఘోరకృత్యమునకు పూనిన వారికి తనకువలెనే అపకారముజరిగినప్పుడుగాని, తాను పడుచుండు పరితాపము తెలియదనియు, పరమదయాళుడగు దేవుడు వారిని క్షమించుగాక యనియు, ప్రార్థించుచు కన్నుల నీరుగార్చి, దుఃఖించెను. ఆయన చేసిన భాషణ యంతయు నన్నుగూర్చి చేసినట్లును, నేనే ఆ గొప్పయపకారినైనట్లును మిక్కిలి పరితపించితిని. హెడ్‌మాష్టరుగారు పక్షపాతమువహించి ఆబాలురకు ప్రశ్నలు ముందుగనే చెప్పియేయుందు రనువిషయము నిజమే అనుకొన్నను ఇంతకాఠిన్యము దొరగారు వహింతురని ఎప్పుడును తలచియుండలేదు. నాన పాలుగారు అప్పుడు చెప్పిన వాక్యములు మనస్సున సూదులుగ్రుచ్చినట్లు బాధించినవి. నే నిట్టిపితూరి ఊలుదొరగారితో నెందుకు చేసితినాయని పశ్చాత్తాపము నొందితిని గాని, ఏదియో గొప్పతప్పు లేకుండిన ఊలుదొరగారి వంటి నీతివర్తనుడు ఇట్టి శిక్షవిధించియుండరని మరల హృదయమున సంతుష్టిచెందితిని.

రివరెండుపాలుగారిస్థానే రెంటాల వెంకటసుబ్బారావు బి. ఏ; బి. యల్. గారిని నియమించిరి. వీరు చాల సమర్థులనియు నెలకు రు 150 లో, రు 200 లో జీతముమీద వారీపనిని కంగీకరించిరనియు, ఒకటిరెండు సంవత్సరముల కాలమునకు మాత్రమే వా రీయుద్యోగము స్వీకరించిరనియు చెప్పుకొనిరి.

ఈ సుబ్బారావుగారు Physics, Chemistry పాఠ్యపుస్తకములలోని విషయములను పాఠకులకు సుబోధకమగునట్లు పుస్తకములుగా ప్రకటించి, దేశ మంతట ఖ్యాతిగాంచియుండిరి. ఇంగ్లీషు వ్యాకరణముమొదలగువానికిసయితము Made Easy series సులభసంగ్రహరూపావళులను ప్రకటించుచుండిరి. ఇట్టి విద్యాగరిష్ఠులు మాకు హెడ్‌మాష్టరుగా వచ్చినందుకు విద్యార్థులగు బాలురము మిక్కిలి సంతోషించితిమి. నే నప్పుడు మెట్రిక్యులేషన్‌క్లాసులో ప్రవేశించితిని. కనుక మాకు ముఖ్యముగ సుబ్బారావుగారే పాఠములను చెప్పుచుండిరి. చెప్పునపుడు విషయములు సుకరముగ బోధపడుచుండెను.

వీరు ఇంచుక కోపస్వభావులగుటచేత తప్పులుచేసిన విద్యార్థులను బెత్తముతో కఠినముగ కొట్టుచుండిరి. వీరికాలమున బాలు రందరు ఎక్కువ భయము కలిగి మెలగుచుండిరి. పాఠశాలయెడల ప్రజలకు కొంత గౌరవము హెచ్చెను. కాని మిషన్‌వారు వీరికి హెచ్చుజీత మిచ్చి భరింపజాల రనుట స్పష్టముగనే యుండెను. వీరు మనశక్తికి మించినవా రని ఊలు దొరగారే యనినట్లు చెప్పుకొనుచుండిరి.

శ్రీ సుబ్బారావుగారు హెడ్‌మాష్టరుగా మా పాఠశాలకు వచ్చిన మొదటిసంవత్సరముననే 1883 డిసెంబరులో నేనుమెట్రిక్యులేషన్ పరీక్షనిచ్చితిని. గుంటూరులో గవర్నమెంటు హైస్కూలు ఒకటి క్రొత్తగా వెలసినది. ఆ పాఠశాలకు శింగారవేలు మొదలియారుగారు హెడ్‌మాష్టరు. వీరు

మిక్కిలి సమర్థులు. ఊలుదొరగారివలెనే నీతివర్తనులగు సాధు పురుషులు. వీరు కొంతకాలము గుంటూరు మునిసిపాలిటీకి ఛెయిర్మనుగా నుండి మంచివారని శ్లాఘ్యతగాంచిరి. ఆ పాఠశాలలో మెట్రిక్యులేషన్ చదువుబాలురలో శేడింబి హనుమంతరావు అను చిన్నవాడు మంచి తెలివిగలవాడని చెప్పుకొనుచుండిరి. మే మొకరినిగూర్చి యొకరు వినుచుంటిమేగాని ఇరువురము కలుసుకొనుటమాత్రము సంభవించలేదు.

# మెట్రిక్యులేషను పరీక్ష

గవర్నమెంటు హైస్కూలులో చదువుకొనుచుండు మల్లాది సోమయాజులుగూడ ఆయేడు మెట్రిక్యులేషన్ చదువుచుండెను. ఈ సోమయాజులే నాటకశాలలో హాస్యముచెప్పు విదూషకుడుగ నుండుటచే నాకు స్నేహితుడు. ఈతడు నాకంటె రెండుమూడేండ్లు పెద్ద. హనుమంతరావని పైనచెప్పబడిన గవర్నమెంటుపాఠశాలావిద్యార్థి నాయీడువాడే.

ఈ ప్రాంతముల మెట్రిక్యులేషన్‌పరీక్షనిచ్చువారు మచిలీపట్టణ కేంద్రమునకే పోవుచుండిరి. కాని సోమయాజులును మరికొందరు మిత్రులును గలసి మచిలీపట్టణముకంటె బాగుండుననియెంచి రాజమహేంద్రవర కేంద్రమునకు దరఖాస్తులు పెట్టుకొనిరి. నాచేతను నాకు సహపాఠిగానున్న కోడూరి చంద్రశేఖరముచేతను ఆ కేంద్రమునకే దరఖాస్తులు పెట్టించిరి.

ఈ చంద్రశేఖరము అనునతడు పాతగుంటూరులో అతని పెదతల్లిగారి యింటిలో భోజనముచేయుచు మాయింటిలోనే నిదురించుచు నాతో మిక్కిలి స్నేహముగ మెలగుచుండెను. అతనికి చదువుటకు పుస్తకములు లేకపోయినను నాపుస్తకములనే తీసికొని చదువుకొనుచుండెను. ఇతడు కొలదికాలము గవర్నమెంటుపాఠశాలలో చదివి పిమ్మట మిషన్‌పాఠశాలలో చేరెను. గవర్నమెంటుపాఠశాలలో నున్నపుడు హనుమంతరావుతో పరిచయమేర్పడెను. నంబూరి తిరునారాయణస్వామి యను మరియొకవిద్యార్థి పాతగుంటూరులో బంధుగుల యింటినుండి గవర్నమెంటుపాఠశాలలో మెట్రిక్యులేషన్ చదువుచుండెను. తరచు మాయింటికి వచ్చుచు నాతోడను చంద్రశేఖరముతోడను కలసి చదువుకొనుచుండెను. షికారుబోవుచు ముచ్చటలు చెప్పుకొనుచు మైత్రితో కాలము గడుపుచుండెడివారము. ఈవిద్యార్థియు రాజమహేంద్రవరముననే దరఖాస్తుపెట్టుకొనెను.

ఇట్లు రాజమహేంద్రవరములో పరీక్షనిచ్చుటకు నిశ్చయించుకొన్నవారందరమును అష్టదిక్పాలకులవలె ఎనిమిదిమంది యును కలిసి యొక్కసారిగనే రాజమహేంద్రవరము చేరి, అచ్చట ఇన్నీస్‌పేటపెద్దవీధిలో రెండుమూడు కొట్లను అద్దెకు తీసికొని నివసించుచు పూటకూళ్ళబసలో భోజనముచేయుచుంటిమి. అప్పుడు మేము వెలుపలకుపోయినపుడెల్ల అందరము కలసియేపోవుచుంటిమి. ధోవతులు కట్టుకొని తెల్లలాంగుకోట్లు తొడిగి, ఎఱ్ఱటోపీలను ధరించి, యేగుచుండుమమ్ము చూచువారలకు వినోదముగానుండి "మీ రేవూరి వా" రని ప్రశ్నించు

చుండిరి. మాసంగతి ఆపట్టణమున పలువురు విచిత్రముగ చెప్పు కొనుట సంభవించెను. గుంటూరుజిల్లాకారుమూరి అగ్రహారములో సుప్రసిద్ధులగు వఠ్యంవారి కుటుంబముతో సన్నిహితబాంధవ్యము గలిగిన శ్రీ వావిలాల వాసుదేవశాస్త్రి బి. ఏ. గారు రాజ మహేంద్రవర గవర్నమెంటుకళాశాలలో ఉపాధ్యాయులుగా నుండిరి. వారికి గుంటూరువారియెడల సహజముగ అభిమా నము కలదు. మరియును మాకు విద్యాగురువులగు కొండుభొట్ల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు మిక్కిలి సమీపబంధువగుటచేత మా గుంటూరువిద్యార్థులయెడ వారికి హెచ్చుగా ప్రేమభావము కలిగెను. మేము వసతిగా ఏర్పరచుకొనిన కొట్లును వారింటికి సమీపముననే యుండెను. కావున మా బసయొద్దకు వచ్చి మా క్షేమసమాచారములు విచారించుచుండిరి. పరీక్షలు పూర్తి యైనపిదప మమ్ములనందరిని వారియింటికి భోజనమునకు బిలిచి పిండివంటలతో విందుగావించిరి.

రాజమహేంద్రవరమున పరీక్షనిచ్చినవారిలో నొక్కరు తప్ప తక్కిన మేమందరము పరీక్షలో కృతార్థులమైతిమి.

మేము రాజమహేంద్రవరములో శ్రీ కందుకూరి వీరేశలింగముపంతులుగారు స్త్రీపునరుద్వాహములు చేయుటను గూర్చి విని వారియింటనే వారిదర్శనము చేసియుంటిమి. కాని అప్పటికి సంఘసంస్కరణము మొదలగు ఉద్యమములవిచారణ గాని వారు వ్రాయుచున్నగ్రంథములనుగూర్చిన విచారణగాని మా కెవ్వరికిని పట్టలేదు.

ఈమెట్రిక్యులేషనుపరీక్ష నిమిత్తము రాజమహేంద్రవరము నకు పోవుటయేగాక అంతకు రెండుసంవత్సరములముందు కొండు భొట్లసుబ్రహ్మణ్యశాస్త్రిగారు నన్నును, నాసహాధ్యాయుడు చెన్నూరిప్రకాశమును, అప్పటికి మిషనుపాఠశాలలో క్రింది క్లాసులోచదువుచుండిన కొలచిన అప్పయ్యదీక్షితు లనువిద్యార్థిని గూడతనవెంటబెట్టుకొని రాజమహేంద్రవరము తీసికొనివెళ్ళిరి. మధ్యదారిలో ఏలూరులో వారిబంధుగులయింట నొకటిరెండు రోజులుండినపిమ్మట రాజమంహేంద్రవరము తీసికొనిపోయిరి. శాస్త్రులవారు తమకుటుంబముతోగూడ బయలుదేరిరి. అప్పుడు గుంటూరునుండి బెజవాడకు బోవుటకు రెండెద్దులబండియే సాధనము. ప్రయాణీకులు ఉండవల్లిరేవుకొద్ద చక్రాలబోటు మీద నెక్కి కృష్ణ దాటి బెజవాడ చేరుచుండిరి. మేమును ఆప్రకారమే ప్రయాణముచేసి, పడవమీద కృష్ణకాలువపైన ఏలూరువరకు బోయి, అక్కడ మరియొకపడవ నెక్కి రాజమహేంద్రవరమునకు పయనమైతిమి. కాని ఒకరాత్రివేళ మేము ఎక్కిన పడవకళాసులు మమ్ము మరియొకపడవలోనికి మా సామానులతోగూడ మారవలసినదని బలాత్కరించుటచే తప్పని సరియై ఆ బోట్లు ఖామందులదే మరియొక పడవలోనికి సామానులు మార్చుచుంటిమి. అప్పయ్యదీక్షితులు ఒకకాలు మేము యెక్కియుండిన పడవపడిచెక్కమీద బెట్టి ఆ రెండవపడవ పడి చెక్కమీద రెండవపాదమును బెట్టి నిలువబడి ఒకపడవలోనుండి సామానులు రెండవపడవలోనికి అందించుచుండెను. ఇట్లు అందించుచుండగా అనుకొనియున్న రెండుపడవలు కొంచెము దూరమైపోవుటచేత రెండుపడవలమధ్య సందు ఎక్కువవెడల్పై

కాలుజారి అప్పయ్యదీక్షితులు కాలువలో రెండుపడవలసందున పడిపోయెను. చీకటిగ నుండెను. పడవక్రిందికి అతడు మునిగి పోయెనేమోయని గొప్పభయము తోచెను. దైవానుగ్రహము వలన ఎట్లో పడవకళాసులు నీళ్ళలోనుండి అతనిని లేవనెత్తిరి. ఇట్లు ప్రాణోపద్రవముతప్పినది. ఈ అప్పయ్యదీక్షితులు శ్రౌత-స్మార్తకర్మలు నేర్చినపిమ్మట ఇంగ్లీషుచదువుటకు ప్రారంభించి నాడు. ఫస్టుఫారములో ప్రవేశించునప్పటికి ఆయనవయస్సు పదునారేండ్లు. నేను ఈ మొదటితరగతిలో పదమూడవఏట ప్రవేశించితిని. కనుక ఆయన నాకంటె పెద్దవాడు, పొడవరి, దృఢకాయుడు. క్లాసులో మిక్కిలి బుద్ధిశాలియని పేరుపొందెను. హెడ్‌మాష్టరు వెంకటసుబ్బారావుగా రతనిప్రజ్ఞను మెచ్చుకొనుచుండెడివారు. కావున ఇట్టియుపద్రవము సంభవించినందుకు శాస్త్రిగారు మిక్కిలి భయాక్రాంతులైరి. కాని ఉపద్రవము తప్పినపిమ్మట ఇతడు గొప్పవాడుకానున్నాడని యోచించి సంతసించిరి. మరునా డుదయమున రాజమహేంద్రవరము రేవు చేరితిమి. శాస్త్రిగారు వారిబందుగులయింటిలో బసచేసిరి. మాకును అక్కడనే భోజనము పెట్టించిరి. వారు ఆ పట్టణములో ప్రముఖులను చూడబోయి మమ్ములనుగూడ తమతో తీసికొనిపోవుచుండిరి. శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారియింటికి పోయియుందుముగాని వారి నప్పుడు దర్శించినట్లు జ్ఞాపకములేదు. వావిలాల వాసుదేవశాస్త్రిగా రప్పుడు గ్రామమున లేరు. సోమంచి భీమశంకరముగారనువారు శ్రీ వీరేశలింగముపంతులుగారికి కుడిభుజముగానుండి స్త్రీ పునర్వివాహములు జరుపుటలో మిక్కిలి ధైర్యముతో చేయూత

నొసంగుచుండిరి. స్త్రీలు పునర్వివాహముచేసుకొనుట తలి దండ్రులకుగాని బంధుగులకుగాని తెలియకుండగనే నడిచిపోవు చుండెను. కాన ఆ స్త్రీలను వారియిండ్లనుండి బయలుదేరతీసి రాజమహేంద్రవరములో శ్రీ పంతులవారియొద్దకు భద్రముగ గొనివచ్చి వారికి నొప్పజెప్పుటలో అతిశైన పుణ్యముతో కృషి చేయుచుండిరి. ఆ భీమశంకరముగారిని చూచినట్లు జ్ఞాపకము కలదు. ఈ ఉద్యమమును దూషించువారు ఇట్లు స్త్రీలను రహస్యముగ తీసికొనివచ్చుట గొప్పతప్పుగా భావించుచుండిరి. మరియు మేము అచ్చటికి వెళ్ళినది. డిశంబరుశలవురోజులగుట చేత కళాశాలయు, పాఠశాలలును మూసివేయబడియుండెను. రాజమహేంద్రవరముదగ్గర గోదావరి రమారమి ఆరుమైళ్ళ వెడల్పుగలిగి విశాలముగనుండుటచేత అది అఖండగోదావరియని పిలువబడుచున్నది. గోదావరిగట్టుపై నిలిచి చూచినయెడల ఆదృశ్యము నేత్రానందముగావించుచుండెను. ధవళేశ్వరముదగ్గర ఆనకట్ట అప్పుడు చూచినట్లు జ్ఞాపకములేదు. సారంగధరమెట్ట రాజమహేంద్రవరముదగ్గరనే యున్నట్లు తెలిసికొంటిమి. రాజ మహేంద్రవరములో నున్నరోజులలోనే యొక్క నాటిరాత్రి శాస్త్రిగారిస్నేహితునియింట జంగము కోటయ్యగారు అను సంగీతవిద్వాంసుడు ఫిడేలువాయించి పలువుర నానందపరచెను. ఆయన బందరుకాపురస్థుడు. దక్షిణదేశముపోయి ఫిడేలు వాయించుటయు,పాడుటయు క్రొత్తగా నేర్చుకొని వచ్చి పాట కచ్చేరీలు చేయుచుండెను. అదియే ఆయనపాట మేము వినుటకు ప్రారంభము. అంతమాత్రముగ హృద్యమైనపాట అదివరకు మేము వినియుండలేదు. మరలివచ్చునపుడు తిరుగ ఏలూరులో

దిగి పిమ్మట పడవమీద బెజవాడ చేరితిమి. బెజవాడనుండి గుంటూరు వచ్చునపుడు మధ్య ఒకరాత్రి మంగళగిరిలో బసచేసి తెల్లవారు ఝామున బయలుదేరి గుంటూరు చేరితిమి. నేను మిషన్ పాఠశాలలో చదువుచున్న కాలములోనే నా పెదతమ్ముడును తెలుగుచదువు ముగించి ఇంగ్లీషుచదువు ప్రారంభించెను. నా చిన్నతమ్ముడింకను తెలుగుబడిలోనే చదువుచుండెను.

# కుగ్లరుదొరసాని - క్రైస్తవమతాభిమానము

మెట్రిక్యులేషన్ పరీక్షనిమిత్తము రాజమహేంద్రవరము వెళ్ళినవారము గుంటూరు చేరినపిదప పరీక్షాఫలితములు తెలియు వచ్చులోపల నాజీవితమందొక చిన్న చిత్రకథ నడచినది. నా చెలికాడగు కోమూరుచంద్రశేఖరము జ్వరపడి యేదియో యొక వాతప్రకోపమున నొకరాత్రివేళ మాటపడిపోవుటచేత వారి బంధుగులు మిక్కిలి భయముచెంది మాయింటికి వచ్చి నన్ను నిద్రలేపి డాక్టరు కుగ్లరుదొరసాని నెట్లయిన తీసికొనిరావలసినదని మిక్కిలి ఆతురతతో చెప్పసాగిరి. డాక్టరు కుగ్లరుదొరసాని కొలది మాసములక్రిందట అమెరికానుంచి మిషనరీగా వచ్చి ఈ యూరిలో ఇండ్లకుబోయి ఉచితముగ రోగులకు చికిత్సచేయుచుండెను. సమర్థురాలని అప్పటికే పేరుపొందెను. కాబట్టి ఎట్లయిన ఆమెను తీసికొనివచ్చి ఆమెచేత చికిత్సచేయించిన యెడల చిన్నవాడు దక్కునను ఆశతో నన్ను కోరిరి. నాకు ఆమెతో నెంతమాత్రమును పరిచయములేదు.

కాని ధైర్యముచేసి అర్ధరాత్రివేళయైనను నొక్కఁడనే యూలుదొరగారిబంగళాయొద్దకు బోయి, మేడమీాద పడుకొని యున్నవారిని గట్టిగా కేకలువేసి లేపి, చంద్రశేఖరము ప్రాణావశిష్టుడుగానున్న సంగతి చెప్పి కుగ్లరుదొరసానిగారిని తీసికొని రమ్మని అతని బంధువులు తెలిపి రని పలికితిని. అంతట యూలు దొర, దొరసానిగారిని నాతోకూడ అప్పుడు ఊరివెలుపల నొక మిషన్‌బంగాళాలో నివసించుచున్న కుగ్లరుదొరసానియొద్దకు బంపెను. ఊలుదొరసాని కుగ్లరుగారిని లేపి విషయములు తెలియజెప్పగా వెంటనే నేను తెచ్చిన యొంటెద్దుబండిమీాద పాతగుంటూరువచ్చి, రోగిని చూచునప్పటికి అతనికి బొత్తిగా మాట పడిపోయి, మనుష్యులను గుర్తించుట దుస్సాధ్యముగ నుండెను. అప్పు డామె ఇన్‌జెక్షన్ ఇచ్చినపిమ్మట కొలదినిముషములకు తెలివివచ్చి రోగి మెల్లగ మాటలాడ నారంభించెను. అందరికిని ధైర్యముకలిగెను. ఆమె ఇంటికి వెళ్లెదనని పోబోవుచుండగా అతని బంధువులందరును తగిన ఔషధ మిచ్చి జాడ్యము నయము చేయవలసినదని ఆమెను కోరిరి. ఆమె "నేను చెప్పినప్రకారము పథ్యపానములు జరిపి క్రమముగ ఔషధసేవచేయుట ఇచ్చోట నెవ్వరికిని అభ్యాసములేదు. చెప్పినప్రకారము నడిపించనిచోట ఔషధమిచ్చుట ప్రయోజనములేదు" అని చెప్పివేసెను. ఆమెకు అప్పటి కింకను తెలుగుభాష రాదు. నేనే ఆమె చెప్పినమాటలను తెలుగులో రోగిదగ్గరనున్న బంధువులకు తెలియజెప్పితిని. అంతట వారు ఆమె చెప్పినప్రకారమే క్రమముగా ఔషధసేవయు, పథ్యపానములును నడిపెదమనియు, ఆమెయే ఔషధమీాయవలెననియు ప్రార్థింపసాగిరి. ఆమె తుదకు నన్ను బిలిచి నీవు క్రమ

ప్రకారము నడిపించుటకు పూనికపడినయెడల నేను మందిచ్చెదనని నుడివినందున నే నందుకు సమ్మతించితిని. ఆమె ఔషధమిచ్చుట ఆనాడే ప్రారంభించెను. నిత్యమును రోగిస్థితిని తెలిపి, ఆమెవద్ద నుండి ఔషధము తెచ్చి, రోగి కిచ్చి, అది క్రమముగా నాతడు సేవించునట్లుచూచుచు ఆమె చెప్పినప్రకారము పథ్యపానములు అతనిబంధువులు జరుపునట్లు జాగ్రతతో పరికించుట నావిధిగా భావించితిని. ఇట్లొక్క నెల దినముల పై కాలము ప్రాతఃకాలము, సాయంసమయములందును తప్పక డాక్టరు కుగ్లరుగారి బంగళాకు పోయివచ్చుచు, ఆబంగళాలో ఆమెతో కలిసి నివాసముచేయు చున్న మరికొందరు మిషనరీలు వారి బాలబాలికలతో దినదినము సాయంకాలమున అందరునుగూడి దైవప్రార్థనలు జరుపుట చూచుచు, వారి సంభాషణలు వినుచు, కొంతవరకు క్రైస్తవ మతప్రభావమును పరికించగలిగితిని. అందు ముఖ్యముగ డాక్టరు కుగ్లరుదొరసానిగారి దైవభక్తియు, ఉదారస్వభావమును, త్యాగ శీలమును నాహృదయమున క్రైస్తవమతముపై నభిమానము కల్పింపసాగెను. సాయంకాలము జరుపుచుండిన ప్రార్థనలలో వారితో కలిసి ప్రార్థనచేయుచుంటిని. ఇట్లు కొంతకాలము ఔషధ సేవ చేయగా నామిత్రుడు చంద్రశేఖరము ఆరోగ్యవంతు డయ్యెను. ఇందువలన నా మనస్సున కెంతయు ఆనందముగలి గెను. డాక్టరుగారితో చెప్పినప్రకారము ఔషధసేవ మొదలగు నవి జరిపించగలిగితినిగదా యని సంతుష్టినొందితిని. డాక్టరు కుగ్లరుగారును నాయెడ సదభిప్రాయము ప్రకటించుచుండిరి. నామిత్రునికొరకు ఔషధమునిమిత్తము ఆమెయింటికి వచ్చుచు పోవుచున్న రోజులలో నొకదినము సాయంకాలము ప్రొద్దు

గ్రుంకినపిమ్మట క్రొత్తగుంటూరులో నొక బాలింతకు నేదియో జాడ్యము ఉపద్రవముగ నున్నదని ఆమెబంధువులు డాక్టరు గారితో చెప్పుకొని, ఆమెను రోగియొద్దకు తీసుకొనివెళ్ళవలెనని వచ్చి, ఆమెతో మొరపెట్టుకొనుచుండిరి. నేను అప్పుడు అచ్చటనే యుండుటచేత వారిమాటలను ఇంగ్లీషులో డాక్టరు గారికి స్పష్టముగ తెలిపినవెంటనే ఆమె మిక్కిలి ఆతురతతో బయలుదేరి వారు తెచ్చిన బండిపై నెడలిపోయెను. ఆమెకు బాధనొందు దీనులపై గల దయార్ద్రహృదయమును గమనించి నేనును కొంతసేపటికి ఆ బాలింతయున్న ఇంటికి చేరితిని. బాలింత యున్నది చిన్న పెంకుటిల్లు. అది వీధి నానుకొనియున్నది. బాలింతయున్నగదియు ఆ వీధివైపుననే యున్నది. ఆ గదికి కిటికీలు లేవు. ఒక్కటే ద్వారము. ఆ గదిలో నొకకుంపటిలో కుమ్మ పెట్టినందున ఆకుమ్మ కాలినవాసన చుట్టును ఆవరించి నది. పొగ గదియంతటను నిండినది. గాలి దూరని చోటగుటచేత ఆగదిలోనికి బోవుటయే మిక్కిలి కష్టముగనుండెను. అయినను దేనిని లక్ష్యముచేయక డాక్టరుగారు గదిలో ప్రవేశించి, బాలింతను పరీక్షించినపిమ్మట గదిలోపలనుండి వెలుపలకు వచ్చుటతోడనే నేను రోగస్థితి యెట్లున్నదని అడిగితిని. చాల ఉపద్రవస్థితిలో నున్నదనియును తా నచ్చటనే రోగియొద్ద కని పెట్టుకొని యుండెదననియు చెప్పి, ఆమె ఇంటికి బోయి బట్లరుతో పాలుగాని మరియేదియైన ఆహారముగాని తీసుకొని తన కిమ్మని చెప్పవలసినదని నన్ను కోరెను. అప్పటికె రాత్రి ప్రొద్దు కొంత గడచినది. క్రొత్తగుంటూరు చిన్నబజారులో నున్న ఆరోగి యింటివద్దనుండి ఊరివెలుపల దూరమున ఆమె బంగళాకు

అనగా కొరిటెపాడురోడ్డుప్రక్క ఇంగ్లీషుచర్చికి దక్షిణమువనున్న రోడ్డుమీద కొంతదూరము పడమటకు బోయినపిమ్మట అప్పుడు 'రావుదొర' అను మిషనరీపేరున పిలువబడు బంగళాకు అనగా ఇప్పుడు స్టాన్లీబాలికాపాఠశాల యున్నచోటికి పోవలసివచ్చెను. చీకటిలో నొంటరిగ మనుష్యసంచారములేని ఆరోడ్డుమీద పోవుట చిన్నవాడనగు నాకు భయముగ తోచవలసినదేగాని నాకేమియు అట్టిభయము తోచలేదు. మహోపకారబుద్ధితో, మురికికూపముగ నున్న గదిలోనికి బోయి అసహ్యించుకొనక శాంతముతో రోగిని పరీక్షించి ప్రాణోపద్రవస్థితిని బరికించి కూర్చుండుటకు కుర్చియైనను లేక రోగి ప్రక్కనే నేలను గూర్చుండి, మానవసేవ చేయు ఆ మహనీయురాలికి అంత మాత్రముగనైన నే నుపకరించగలిగితి నను సంతోషోత్సాహము లతో బంగళాకు బోయి బట్లరుతో ఆమె చెప్పినమాట చెప్పి నేను పాతగుంటూరులో మాయింటికి చేరి భోజనముచేసి నిదు రించితిని. తెల్లవారవచ్చుచుండగనే మెలకువ వచ్చుటచేత ఆబాలింత ఎట్లుండెనో, డాక్టరుగారు రాత్రి యెట్లుగడపిరో తెలుసుకొనవలెనని వెంటనే బయలుదేరి రోగియున్న యింటికి బోవునప్పటికి యింటివారు పెద్దగ నేడ్చుచుండిరి. బాలింత అంతకుముందే చనిపోయెననియు, డాక్టరుగారు రాత్రియంతయు ఔషధము లిచ్చుచు రోగి ప్రాణము పోవువరకు నుండి అప్పుడే వెడలిపోయెననియు విచారించగా తెలిసినది. చనిపోయిన బాలింత పదునారు సంవత్సరముల బాలిక. డాక్టరుగా రెంత శ్రమచేసి నను మృత్యువాతబడెనని చింతించితిని. ఉచితార్థముగ కేవల పరోపకారబుద్ధితో ఎంతటి శరీరకష్టమునకైన నోర్చి, దృఢ

వ్రతమై మానవసేవజేయుట కాదు క్రైస్తవమతస్థురాలగుటయే కారణముగ దలంచితిని. ఇందువలన నాహృదయమునందు క్రైస్తవమతాభిమానము గాఢమగుచుండెను. ఇదిగాక మాకు మిషన్‌పాఠశాలలో నుపాధ్యాయులుగా నుండిన ప్రభల రామచంద్రయ్య బి. ఏ. గారు దక్షిణాదినుంచి వచ్చిన బ్రాహ్మణుడు, కొలది సంవత్సరములకు మునుపే భార్యాసమేతముగ క్రైస్తవ మతములో కలసెను. గుంటూరులో తహశీలుదారుగా నుండిన దేవేంద్ర వెంకటచలముపంతులుగారును క్రైస్తవమతమును స్వీకరించిరి. కనుక నేనుమాత్రము క్రైస్తవుడ నేల కాగూడ దను ప్రశ్న నన్ను బాధించగా చివరకు క్రైస్తవమతములో చేరవలెనని నిశ్చయించుకొని శ్రీరామచంద్రయ్యగారియొద్దకు పోయి, నాకోరికను తెలిపితిని. కాని నన్ను ప్రోత్సహింపక "బాగుగ ఆలోచించుకొని చేరవలెను. ఇంతలో తొందరపడనేల" అని వాక్రుచ్చిరి. మరియొక క్రైస్తవపెద్దమనుష్యునియొద్దకు గూడ పోయి వారితో ముచ్చటించితిని. ఆయనయైనను ప్రోత్సాహము చేయలేదు. నాకుమాత్రము ఉత్సాహము తగ్గలేదు, గాన క్రైస్తవ మతములో కలియవలెనని దృఢనిశ్చయముచేసుకొని యూలు దొరగారియింటికి పోతిని. యూలుదొరసాని వారిబంగళావెలుపల వరండాలో ఆసీనయైయుండెను. ఆమెతో నాకోర్కె తెలుపుటతోడనే మిక్కిలి సంతోషముతో లేచి నా జంధ్యము తీసివేయుమని నాతో చెప్పుచు లోపల గదిలో ఎదియో వ్రాసుకొనుచున్న యూలుదొరగారియొద్దకు పరుగెత్తుకొనిపోయి నేను క్రైస్తవమతమును స్వీకరించుటకు వచ్చితినని పరమోత్సాహముతో చెప్పెను. ఆయన వెలుపలకు వచ్చి, నన్ను ప్రశ్నిం

చగా నేను క్రైస్తవుడనుకావలెనని దృఢసంకల్పముతో వచ్చినా నని చెప్పితిని. క్రైస్తవమతమునందు గాఢమగువిశ్వాసముకలదా యని ప్రశ్నించి, కలదు కలదని నేను గట్టిగ చెప్పినపిదప తాను మోకరించి, నాహృదయమున నిట్టిమార్పు కలిగించినందుకు దేవుని కృతజ్ఞతతో స్మరించుచు తమ మతమునందు నాకు విశ్వాసము మరింత కలుగజేయుమని ప్రార్థించెను. నేనును ఆయనతో కలసి ప్రార్థించితిని. యూలుదొరసానిగూడ ప్రార్థనలో పాల్గొనెను. కాని మధ్యమధ్య ఆమె నాజంధ్యము వెంటనె తీసివేయుమని మిక్కిలి ఆతురతతో చెప్పుచుండెను, గాని యూలు దొరగారు ఆమెను తొందరించవలదని వారించి, క్రైస్తవమతము నందు నీ వింకను గాఢమగువిశ్వాసము కలుగునట్లు ప్రార్థించుము అని నాకు చెప్పి న న్నింటికి బోయి మరునాడు రమ్మని పంపి వేసెను. ఇంతలో నెట్లో నేను క్రైస్తవమతములో కలియబోవు చున్నాననువార్త యూరంతట వ్యాపించెను. మాతండ్రి మిక్కిలి దుఃఖాక్రాంతుడై నే నెక్కడికి బోయినదియును తెలి యక నానిమిత్తము ఊరిలో వెదకుచుండెను. నే నింటికి చేరు నప్పటికి ఆయనయు చేరెను. నన్ను కూర్చుండబెట్టి నాతండ్రియు, నాతమ్ములును నాచుట్టును కూర్చుండి చింతాక్రాంతులై పరిత పింపసాగిరి. "నాయనా! ఎప్పుడును నిన్ను నాప్రాణమునకు ప్రాణముగ జూచుకొనుచుంటిని. మీతల్లి పోయినదిమొదలు నీకొరకు నే నెన్నికష్టములు పడుచుంటినో నీ వెరుగవా ? నీ కేమి కొరతగావించితిని ? నీకొరకు నాప్రాణములనైన ఇచ్చుటకు సిద్ధముగనున్న నన్ను విడిచిపోయెదవా ? ఈ చిన్నతమ్ములను విడనాడెదవా ? ఎందుకు దేవుడు నీ కట్టిబుద్ధి పుట్టించె"నని

మిక్కిలి దుఃఖింపసాగెను. నాతమ్ముం లిరువురును ఏడువసాగిరి. నాకును ఇదంతయు భరించరాని దుఃఖముకల్పించెను. ఇంతలో నావిద్యాగురువులు మిక్కిలి గౌరవపాత్రులు అయిన కొండుభొట్ల సుబ్రహ్మణ్యశాస్త్రిగారును మరికొందరు ఉపాధ్యాయులును మాయింటికి దయచేసి నన్ను ఏల ఈపనికి బూనితివని హెచ్చరించుచు నీకు క్రైస్తవమతము మిక్కిలి మంచిదని విశ్వాసము కలిగిన కలుగవచ్చును. మన హైందవమత మెట్టిదో విచారించితివా ? ఏమియైన గ్రంథములను చదివితివా ? పెద్దలతో ముచ్చటించితివా ? మన పెద్దలంద రాచరించిన మత మెట్టిదో తెలుసుకొనకుండ పరమతమును స్వీకరించుట వెఱ్ఱితనముగాదా? నీ వింకను చిన్నవాడవు. ముందింకను మనశాస్త్రములను చదివి మనమతమునందలి గుణాగుణములు తెలుసుకొని పిమ్మట పరమతముసంగతి విచారించవచ్చునుగాని మనమతముసంగతి ఏమియు తెలియక అన్యమతములో కలియుట బొత్తుగా సరిగాదని వారు నాకు హితోపదేశముగావించిరి. ఈహితోపదేశమును దానికంటె నాతండ్రిగారియొక్కయు నాతమ్ములయొక్కయు దుఃఖతాపములు నామనస్సును త్రిప్పివేసెను. అప్పటికి క్రైస్త మతములో ప్రవేశించుట మాని మనమతవిషయము ఆలోచించుకొనెదగాక యని మనస్సును శాంతింపచేసుకొంటిని.

మరునాడు అనుకొనినట్లు యాలుదొరగారియింటికి వెళ్లుటకు ముఖము చెల్లకుండెను. అంతగాఢముగ క్రైస్తవమతమునందు విశ్వాసముకలదని చెప్పిన నేను ఈనాడు ఆయనతో నేమని చెప్పగలనని తర్కించుకొనుచు వారియొద్దకు పోవుటమానితిని. కాని

మూడవనాడు వారియొద్దకు బోయి, నామనస్సున కలిగినమార్పు స్పష్టముగ చెప్పివేయుటయే యుక్తమని వారియింటికి వెళ్లితిని. నిన్న నేల రాలేదని వారు నన్ను ప్రశ్నించిరి. జరిగినవిషయములను మనవిచేసితిని. అదంతయు శాంతముగా విని "మంచిది నీవు క్రైస్తవుడవు గాకపోయినను మంచిహిందువుగా నుండు" "Be a good Hindu" మని నాకు ప్రేమతో హితోపదేశము గావించిరి. అప్పుడు నిజమైన ఆయనగొప్పతనము నాకు మరింత విస్పష్టమయ్యెను. ఆ శాంతమును, ఆఉదారభావమును ఆయనపై నాప్రేమగౌరవముల వేయిరెట్లు హెచ్చుగావించెను. మానవులలో నిట్టిమహాపురుషులు అరుదనియు ఆదర్శప్రాయులనియు యెప్పుడును తలంచుచుంటిని.

## ఎఫ్. ఏ. చదువు

అంతట కొలది దినములకే పరీక్షాఫలితములు తెలియవచ్చెను. నేనును నామిత్రులు పలువురును కృతార్థులమైతిమని ఊరంతట చెప్పుకొనుచుండిరి. ఆనాడు మెట్రిక్యులేషనుపరీక్షలో ఉత్తీర్ణులగుట మిక్కిలి అపరూపముగ తలంచుచుండిరి. సుమారు ఇరువదివేలజనులతోగూడిన గుంటూరుప్రజలలో మాయశస్సు ప్రాకిపోయెను. హనుమంతరావు ఒక్కడుమాత్రము ఫస్టుక్లాసులో ఉత్తీర్ణుడయ్యెను. పరీక్షాఫలితములు తెలిసినపిమ్మట యఫ్. ఏ., పరీక్షకుగూడ చదువవలెననియే నాకు ఉత్సాహముండెను. మా తండ్రిగారు భారమువహించుట కష్టమని కొంత సంశయించెను. కాని తుదకు సమ్మతించెను. గుంటూరులో కాలేజీ లేదుకాబట్టి

బందరో, రాజమహేంద్రవరమో, చెన్నపట్టణమో పోవలసి యుండెను. చెన్నపట్టణములో క్రైస్తవకళాశాల ప్రసిద్ధమైనదిగా చెప్పబడుచుండెను. ఆకళాశాలలో చేరి చదువవలెనని కుతూహలము హెచ్చుగానుండెను. కాని చెన్నపట్టణము చాలదూరమగుటచేతను, ఆకాలమున రైళ్లు లేవు గనుకను అచ్చటికి బోవుట చాలప్రయాసగా నుండెను. పెద్దపట్నవాసమగుటచే ఖర్చులును హెచ్చుగానుండునను కారణముచేత మాతండ్రిగారికి చెన్నపురికి పంపుట కిష్టములేకుండెను. యూలుదొరగారు చెన్నపట్నములో క్రైస్తవకళాశాలకు బోయి చదువవలెననియు, అట్లయిన నెలకు పదిరూపాయలు ఉపకారవేతనము ఆకళాశాలవా రిచ్చునట్లు సిఫారసుచేసెదననియు గట్టిగా చెప్పుచుండెను. నాకు అంతవరకు మిషన్‌స్కూలులో జీతముఇచ్చుట అవసరములేకుండ ఉపకార వేతనము బహుమానముగా నియ్యబడుచుండెను. పుస్తకములకు దప్ప మరి యేమియు నావిద్యకై ఖర్చులుపెట్టవలసిన ఆవశ్యకము లేకుండెను. చెన్నపట్టణము కాలేజీలోగూడ ఉపకారవేతనము లభించుట మేలుగనేయుండునుగాని నాకు క్రైస్తవమతాభిమానము వలన లోగడ నడచినకథ గమనించి మాతండ్రిగారు క్రైస్తవ కళాశాలకు నన్ను బంపుటకు బొత్తుగా సమ్మతించకుండిరి. చివరకు రాజమహేంద్రవరము బోవుటకే నిశ్చయించుకొంటిని. హనుమంతరావు అక్కడికే సిద్ధమయ్యెను. కాబట్టి ఉభయులము కలసి రాజమహేంద్రవరము బోయి అక్కడ గవర్నమెంటు కళాశాలలో యఫ్. ఏ., తరగతిలో ప్రవేశించితిమి. మెట్‌కాఫ్. యమ్. ఏ., అను ఆంగ్లేయవిద్యాపండితుడు ఆకళాశాలకు ప్రిన్సిపాల్‌గానుండి ప్రసిద్ధిగాంచెను. ఆయన రూపమున నొద్దుపొడవు

గలిగి యించుక లావుగా నుండుటచేత పొట్టిగానున్న ట్లగపడు చుండెను. షేక్స్పియర్ నాటకమును, గ్రీకు, రోమనుచరిత్రలును మాకు జెప్పుచుండెను. ఈయన చాల సత్స్వభావముకలిగి విద్యార్థులయెడ దయతో మెలంగుచు శ్రద్ధతో పాఠముల బోధించు చుండెను. కళాశాలను కట్టుదిట్టములతో నడిపించుచు విద్యార్థులను అదుపాజ్ఞలలో నుంచి వారి శ్రేయస్సును గోరుచుండెను. సాయంకాలము ఆటలలో బాలురతోగూడ పాల్గొనుచుండెడివాడు. ఒకొక్కప్పుడు బాలురను ఆయాటలలో తన వీపుపై నెక్కించు కొనుచుండెను. ఇందువలన విద్యార్థులు వారియెడ ప్రీతితో, భక్తితో మెలగుచుండిరి. పాఠములు బోధించు సమయమున సందర్భముల ననుసరించి అప్పుడప్పుడు చిన్నకథలను చెప్పి విద్యార్థులకు సంతసమును ఉత్సాహమును కల్పించుచుండెను. వీరినిగూర్చి ఒకకథ చెప్పుకొనుచుండిరి.

వీరు రాజమహేంద్రవరములో పడమర యూరివెలుపల ఇంచుకదూరమున నొక చిన్నతిప్పపై నున్నబంగాళాలో కాపురముండిరి. ఒక సెలవుదినమున ఆబంగాళా ప్రహరీగోడ పోయిన చోట నొంటరిగనే తనచేతులతో మట్టిగలిపి రాళ్లువేసి పూడ్చుచుండెనట. ఆసమయమున ఆయనయొద్ద చదువుకొనిన ప్రాత విద్యార్థి, తహశీలుదారియుద్యోగమును పొందినపిదప ఆయన దర్శనమునకై పోయెనట. అప్పుడు మెట్కాఫ్గారు తాను చేయుచున్న మట్టిపని చేయుమనే ఆవిద్యార్థితో సంభాషణజరుపుచు ఇంచుక దూరముననున్న ఒకరాతిని అందియ్యమని ఆవిద్యార్థిని కోరెను. అంతట ఆ తహశీలుదారు తనతోవచ్చినజవానును

ఆరాయి దొరగారికి అందించుమని చెప్పెను. ఇంతలో మెట్ కాఫ్ గారు "రాయి తెమ్మని నిన్ను కోరినానుగాని నీబంట్రౌతును కోరలేదు. నీకు అది చేయుట అగౌరవముగ తోచినదా" యని చెప్పుచు తాను స్వయముగనే ఆరాతిని తెచ్చుకొనెనట. అంతట తహశీలుదారు సిగ్గుపడి క్షమాపణగోరెను.

కాలుచేతులతో పనిచేయుట తప్పుగాదని యిట్లు ఆయన బోధించెను. కాయకష్టముచేయువారు తక్కువవారనియు విద్యలు సంపాదించి యుద్యోగముచేయువా రెక్కువవారనియు నేటికిని మనదేశమున తలంచుచుండుట శోచనీయము.

ఆకాలములో వస్తువులు అగువగను డబ్బు అరుదుగ నుండుటచేత పూటకూలిబసలలో భోజనము పూటకు మూడు కాలకంటెను తక్కువగ నుండెను. రాజమహేంద్రవరములో నేనును హనుమంతరావును కళాశాలకు సమీపముననే నొకపూటకూలిఅమ్మవారియింట నెలకు రు 7 ల చొప్పున మూడుపూటల భోజనమున్ను వారవారమును తలంటుకును ఏర్పాటుచేసుకొని మరియొకయింటిలో అద్దెకు గదితీసుకొని చదువుకొనుచుంటిమి. కళాశాలలోని ఉపాధ్యాయులలో సుందరరావుగారు ఆంగ్లమును, నాగోజీరావుగారు గణితమును బోధించుచుండిరి. వీ రిరువురును ఎఫ్.ఏ. సీనియర్, బి.ఏ., తరగతులకే చదువుచెప్పుచుండెడివారు. కాన మాకు వారితో బరిచయములేకుండెను. శ్రీ కందుకూరి వీరేశలింగముపంతులుగారు ఆంధ్రపండితులుగా నుండిరి. కాని వారైనను మాతరగతి కేపాఠమును చెప్పుటలేదు గాన మాకు

పరిచయము లేకపోయెను. ఇల్లువదలి ఇతరగ్రామములో నివ సించుట మాకు క్రొత్తయగుటచేతను చదువునందు శ్రద్ధ తక్కువగుటచేతను ముచ్చటగ తిరుగుచు కాలము గడపుటకు అభ్యాసపడితిమి. ముఖ్యముగా చెన్నపట్టణములో చదువవలెనను అభిలాష మొదటినుండి హెచ్చుగానుండుటచేత రాజమహేంద్ర వరములో చదువుపై లక్ష్యములేకపోవుటవలన పాఠములు పట్టుపడలేదు. కాని ఏమో పెద్దక్లాసులో చదువుచున్నామని గర్వము మమ్ములను ఆవహించెనని చెప్పవచ్చును.

## చెన్నపట్టణము - సంగీతసాహితులు

సంవత్సరాంతమున గుంటూరు నాటకసమాజమువారు రాజమహేంద్రవరములో నాటకప్రదర్శనముచేయుటకు వచ్చిరి గాన అందులో నాటకపాత్ర నేను వహింపవలసివచ్చెను. హరి శ్చంద్రనాటకమునకు పౌరులు మమ్ము హెచ్చుగా పొగడిరసతెలిపి యుంటిని. వారిలో అచ్చటి న్యాయవాదులలో ప్రముఖులుగా నుండిన మాకర్ల సుబ్బారావునాయుడుగారు నాయందెక్కువ అభిమానమువహించియుండిరి. ఈలోపల హనుమంతరావు, నేనును చెన్నపట్టణమున క్రైస్తవకళాశాలలో ప్రవేశించి చదువ వలెనని నిశ్చయించుకొంటిమి. రాజమహేంద్రవరములో రెండవ సంవత్సరము చదువుటకై జీతముమొదలగువాని నిమిత్తము మా తండ్రుల నడిగి డబ్బు తెచ్చుకొని, శ్రీమాకర్ల సుబ్బారావు నాయుడుగారియొద్దకు బోయి, మేము చెన్నపట్టణ క్రైస్తవకళా శాలలో చదువనిశ్చయించుకొంటిమి గాన అచ్చట తగినవారికి

సిఫారసుఉత్తరము వ్రాసియియ్యవలసినదని కోరగా క్రైస్తవ కళాశాలలో ఉపాధ్యాయుడుగానుండి అచ్చట పరస్థలమునుండి వచ్చిన విద్యార్థుల భోజనాదివసతులను చూచుచుండు డబ్లియు. రామయ్యగా రనువారికి మమ్మునుగూర్చి సిఫారసుఉత్తరము ప్రేమతో వ్రాసియిచ్చిరి. అది తీసుకొని మేము కాకినాడలో ఎల్లోరా యను స్టీమరు నెక్కి చెన్నపట్టణమునకు పయనమైతిమి. ప్రొద్దుననే భోజనములుచేసి బయలుదేరితిమి. సముద్రములో దాదాపు ఆరుమైళ్లదూరమున లోతునీళ్లలో స్టీమరు నిలచి యుండెను. కాన స్టీమరు నెక్కుటకు సముద్రములో చిన్నపడవల మీాద పోవలసియుండెను. ఆపడవలనెక్కి కొంచెముదూరము పోవునప్పటికి నాకు ఒడలుత్రిప్పి డోకులు ప్రారంభమయ్యెను. ఎట్లో ప్రయాసతో స్టీమరు అందుకొని దానిపై టాపుమీాద అనగా 'డెక్' మీాదకు చేరితిమి. నాకు వమనము లెక్కువ అగు చుండుటచేత చాల బాధగానుండెను. ఆరో జంతయు ఆసితిలోనే యుంటిని. మరునాడు స్టీమరు బందరురేవు చేరునప్పటికి డోకులు కొంత తగ్గుటచేత మిత్రులతో మాటలాడుటకు అవకాశము కలిగెను. నంబూరు తిరునారాయణస్వామి అనుమిత్రుడు మాతో రాజమహేంద్రవరమున మెట్రికుర్యులేషన్ పరీక్షనిచ్చినవారిలో నొకడు. మేము చెన్నపట్టమునకు బోవుటకు ముందుగ మాతో వచ్చి కలుసుకొనెను. అతనికిగాని హనుమంతరావుకుగాని ఈ ఒడలుత్రిప్పుట లేక సుఖముగనేయుండిరి. గుంటూరులో నుపాధ్యాయుడుగా నుండిన శ్రీఅభిరామయ్యరు అను నొక అరవ బ్రాహ్మణుడు కొంత వయస్సుచెల్లినవాడు మాతో స్టీమరులో 'డెక్' మీాదనే ప్రయాణికుడుగానుండెను. మేము సాహసించి

చెన్నపట్టణములో చదువనిశ్చయించుకొన్నందుకు మమ్ము నభి నందించెను. ఆకాలములో ఈప్రాంతములనుండి చెన్నపట్టణ ములో చదువబోవువారు మిక్కిలి అరుదుగా నుండిరి. అంతకు మునుపు గుంటూరులో మెట్రిక్యులేషన్‌లో కృతార్థులైనవారి సంఖ్య మిక్కిలి స్వల్పము. అందు పైపరీక్షకు చదివినవా రొక్కరో యిరువురో యుండిరి. చెన్నపట్టణమునకు పోయినవా రెవ్వరు లేరనియే చెప్పవచ్చును. కనుక మేము చెన్నపట్టణమునకు బోవుట సాహసకృత్యముగనే తలంచవచ్చును.

మూడవదినము ఉదయమున చెన్నపట్టణపు రేవునకు స్టీమరు చేరెను. నేను ప్రయాణములో రెండవరోజుమాత్రము పెరుగులో నానిన అటుకులు కొలదిగా తిని నీళ్లుత్రాగితిని. చెన్నపట్టణము చేరునప్పటికి శరీరము బలహీనముగానున్నను తేటచిక్కినది. ఉల్లాసముగాగూడ నుండెను. చెన్నపట్టణము వంటి మహాపట్టణమును దర్శించుట అదియె ప్రథమముగాన అంతయు విచిత్రముగను వినోదముగను గనుపించుచుండెను. మేము స్టీమరుదిగుటతోడనే కూలీలు మొదలగువారు మాట లాడు అరవభాష శ్రుతికటువుగ తోచెను. మేము రేవునొద్ద నుండి సరాసరి రాయపురములో శ్రీ డబ్లియు. రామయ్యగారి యొద్దకు బోయి మేము వచ్చినపని చెప్పి, మాకర్ల సుబ్బారావు నాయుడుగా రిచ్చిన ఉత్తరము వారిచేతి కిచ్చితిమి. వారు దానిని చూచుకొని మమ్ము ప్రేమతో ఆదరించి లింగిచెట్టి వీధిలో విద్యార్థులవసతిగృహములో ప్రవేశమునకు చీటియిచ్చి మమ్ము ఎఫ్. ఏ. క్లాసులో చేర్చుకొనుటకు డాక్టరు మిల్లరు

గారి కొకయుత్తరము వ్రాసియిచ్చిరి. అంతట మేము వసతి గృహము చేరి భోజనముచేసి కళాశాల ప్రిన్సిపల్ గారైన డాక్టర్ మిల్లర్ గారిని కళాశాలలోనే దర్శించి, డబ్లియు. రామయ్యగా రిచ్చినఉత్తరము నిచ్చితిమి. వారు సంతసించి మీరు ఎఫ్. ఏ., జూనియర్ లో చేరుట మంచిదని మాకు సలహానిచ్చిరి గాని మేము జూనియర్ లో గతసంవత్సరమే యున్నాముగనుక ఈ సంవత్సరము సీనియర్ లో చేర్చుకొనవలెనని కోరితిమి. అందుకు సమ్మతించి మమ్ము ఎఫ్. ఏ., సీనియరులోనే చేర్చుకొనెను.

పరస్థలమునుంచి వచ్చిన విద్యార్థులనిమిత్తము మిల్లరుదొర 'స్టూడెంట్స్ హోమ్'అనుపేరుతో నొక విద్యార్థి వసతిగృహమును తనస్వంతద్రవ్యముతో కట్టించెను. ఆగృహములో మేము చెన్న పట్టణమువెళ్లిన కొలదిదినములకే గృహప్రవేశము జరిపితిమి.

మేము మాపెద్దలతో చెప్పకే చెన్నపట్టణము ప్రయాణము చేసి, అక్కడ చేరినపిదప, కాలేజీలో చేరుచున్నాము గనుక సొమ్ముపంపవలసినదని ఉత్తరముప్రాయగనే వారికి మే మిచ్చుటికి బోవుట యిష్టము లేకపోయినను వెంటనే సొమ్ముపంపిరి. మాకు అన్నియు సుఖముగనే జరుగుచుండెను.

ఇంగ్లీషు, తెలుగు, చరిత్ర, శరీరశాస్త్రము మొదలగువానియందు అభిరుచికలవాడనైనను లెక్కలనిన నాకు తలనొప్పి. కనుక బీజగణితము (Algebra) క్షేత్రగణితము (Geometry) (Trignometry) లలో పుస్తకములలోనిభాగము (Book work)

మాత్రము గట్టిగా నేర్చుకొనుచుంటినిగాని (Problems) ప్రాబ్లములు చేయుటలో బొత్తుగ నసమర్థుడుగ నుంటిని. ఈకారణముననో మరి జూనియర్ క్లాసులో బాగా చదువని కారణముచేతనో ఆసంవత్సరము ఎఫ్.ఏ., పరీక్షలో నెగ్గలేదు. హనుమంతరావును తప్పిపోయినాడు. కాబట్టి మరల యఫ్. ఏ., సీనియర్ లో చదువ వలసివచ్చెను. ఈసారి పరీక్షలో ఇరువురము కృతార్థులమైతిమి. 1888-వ సంవత్సరములో బి.ఏ. లో ప్రవేశించితిమి. నేను బి.ఎల్. చదువవలెనని దృఢనిశ్చయముతో నున్నాను. ఫిలాసఫీ (తత్త్వ శాస్త్రము) అభిమాన విషయముగా నేను చదువుటకు నిర్ణయించుకొంటిని. హనుమంతరావు గణితములో ప్రవేశము గలవాడగుటచేత ఫిజిక్సు (Physics) చదువుటకు నిశ్చయించుకొనెను. తిరునారాయణస్వామిగూడ క్రైస్తవకళాశాలలో జేరి ఎఫ్. ఏ. మొదటితరగతిలో ప్రవేశించినాడు. అప్పటికే వివాహితుడై యుండినందున తనకుటుంబమును రప్పించుకొని తండియార్ పేటలో కాపురము ఏర్పరచుకొని యుండెను. మెట్రిక్యులేషన్ లో మాతోడనే ఉత్తీర్ణుడైన నాసహాధ్యాయి కోడూరు చంద్రశేఖరము మిక్కిలి బీదవాడగుటచేత ఎఫ్.ఏ.లో జేరుటకు అవకాశము లేకపోయెను. కాని రెండుసంవత్సరములు గడచినపిమ్మట అతడు ఎట్టులో చెన్నపట్టణము జేరి తిరువళ్లిక్కేణిలో ఉద్యోగములలోనున్న తెలుగువారియిండ్లలో వారములేర్పరచుకొనియు, కొన్నిరోజులు స్వయముగ వంటచేసుకొని భోజనముచేయుచు ఎఫ్.ఏ. క్లాసులో క్రైస్తవకళాశాలలోనే చేరి చదువనారంభించెను. కాని జరుగుబాటు మిక్కిలి కష్టముగ నుండెను. మాటిమాటికి నన్ను కలియుచు తన కష్టములు చెప్పుకొనుచుండెను. నాకైనను మా

తండ్రిగారు కావలసిన ఖర్చులన్నియు నియ్యజాలరని నేను డాక్టరు కుగ్లరును కోరియుండగా ఆమె నెలకు రు 7/- ల చొప్పున కొంతకాలము దయతో పంపుచుండెను. మరి కొంతకాలము చెన్నపట్టణములోనే యొక ఆంగ్లో - ఇండియనుకుటుంబములోని పిల్లకు ఉదయమున నొకగంట తెలుగుచెప్పుటకై నన్ను కోరి అందుక్రింద నాకు తానిచ్చుచుండిన రు 7/- లు జీతముగా చూచుకొనవలెనని ఆమె నిర్ణయించెను. ఆప్రకారమే ఆచిన్నదానికి తెలుగుచెప్పుచుంటిని. నా తండ్రిగారు నాకు కావలసినసొమ్ము పంపుచుండినందున నాకు వచ్చుచున్న రు 7/-లును చంద్రశేఖరమునకు ఇచ్చుచుంటిని. నాఅవసరమునిమిత్తము అని చెప్పి కుగ్లరుగారియొద్దనుంచి తెప్పించుకొనుచున్నసొమ్ము ఆమెకు తెలుపకుండ నే నితరుల కిచ్చివేయుట తప్పు అని తెలియకపోలేదు. నా కవసరములేదని ఆమెకు తెలిపినయెడల ఆమె దానిని పంపుటమానివేయుననియు, అప్పుడు నాస్నేహితునకు సహాయము చేయజాలననుమాటయే మనస్సున బెట్టుకొని ఆమెకు తెలుపకుండగనే ఇట్లు వినియోగించుచుంటిని. కొంతకాలమునకు ఆమెకు ఎట్లో తెలిసి ఆమె సొమ్ముపంపుట మానివేసెను. కాని నేను దానిని మిక్కిలి కష్టమునకోర్చి చదువుచున్నవిద్యార్థియొక్క అవసరము నిమిత్తము వినియోగించితినని తెలుసుకొని కొంతవరకు నావిషయమై కలిగిన అభిప్రాయమును మార్చుకొనెను.

నేనును హనుమంతరావును మిల్లరుగారి విద్యార్థివసతి గృహములోనే నివసించుచుంటిమి. ఈ భవనము మూడంతస్తులు గలమేడ. దీనిలో టవరును, ఆటవరులో ఒకదానిపై నొకటిగా

నున్న రెండుగదులు ఉండెను. ఈభవనములో సుమారు ఏబది మంది విద్యార్థులు ఎఫ్. ఏ. మొదలు బి. ఏ. తరగతులవారు మాత్రమే నివసించుచుండిరి. భోజనములకు వంటశాల, వంట బ్రాహ్మణులు ఏర్పడియుండిరి. ఇందు బ్రాహ్మణవిద్యార్థులు మాత్రమే నివాసముచేయుచుండిరి. తక్కినకులములవారికి ఫైన్సు విద్యార్థిగృహము మరియొకటి కొంతకాలమున కేర్పరచబడెను. మేము దిగువగదులలో నలుగురువిద్యార్థులకు సరిపోవున ట్లేర్ప రచబడిన పెద్దగదిలో నుంటిమి. నెల 1కి ఒక్కొక్కరము ఒక్క రూపాయిచొప్పున అద్దెయిచ్చుచుంటిమని జ్ఞాపకము. భోజనము నకు నెల 1కి 10 రూపాయలు నిర్ణయమని జ్ఞాపకము. విద్యార్థి వలన వసూలుచేయబడిన మొత్తము అంతయు వసతిగృహమునకు వలయు ఖర్చులక్రిందనే వినియోగింపబడుచుండెను. ఈ వసతిగృహ విచారణకర్తగా అయ్యాదొరఅయ్యంగారనువారు, కాలేజీతో సంబంధించిన హైస్కూలులోని ఉపాధ్యాయులుగానున్నవారు నియమింపబడి పనిచేయుచుండిరి.

ఈ వసతిగృహములోనే చిత్తూరువా రిరువురు బి. ఏ. తరగతివిద్యార్థులు నివసించుచుండిరి. వారు తెలుగువా రగుట చేత మాకు వారితో చెలిమిచేకూరెను. వారిలో నొకరు విండ్లచెరువు రామయ్యగారు. వీరు చాల బక్కపలచగానుండెడి వారు, కాని లెక్కలలో మంచిసమర్థులు. తక్కినవిషయము లందును చురుకుగలవారే. రెండవవారు పిడతల సీతాపతయ్య గారు. ఈయన తెలివిగలవారు. తెలుగులయందు మంచి ప్రవేశముగలవారు. వీరిసహపాఠి నాగపూడి కుప్పుస్వామయ్య

గారు వసతిగృహములో నుండక తండియూరుపేటలో భార్యతో కాపురముచేయుచు కాలేజీకివచ్చి చదువుచుండెడివారు. వారు అన్నివిషయములందును సమానమగు సామర్థ్యముగలవారు. వారు అరవవారయ్యును తెలుగుభాషయందు ఎక్కువ అభిమానము గలిగి అందు పాండిత్యము సంపాదించిరి. సీతాపతయ్యగారును కుప్పుస్వామయ్యగారునుగూడ తెలుగులో పద్యములు వ్రాయుచుండెడివారు. వీరుముగ్గురకు (Chittor trinity) చిత్తూరిత్రయమని మేము పేరుపెట్టితిమి. దినములు గడచిన కొలది వారికిని మాకును ఎక్కువ స్నేహభావ మేర్పడెను. మాయందు వా రెక్కువ ప్రేమతో మెలంగుచుండిరి. మేము బి. ఏ. క్లాసులో చదువుకాలమునకు తిరునారాయణస్వామి ఎఫ్. ఏ. సీనియరులో చదువుచుండెను. ఈతనిభార్య గర్భిణియై యుండినందున ఆమెను పుట్టినింటికి పంపి మరియొకచోట భోజనముచేయుచుండెను. ఆకాలములోనే నాకు గుంటూరులో విద్యాగురువుగనుండిన శ్రీకొండుభొట్ల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు చెన్నపట్టణములో పచ్చయప్పకళాశాలలో తెలుగుపండితులుగా నియమింపబడుటచేత వారు తిరువల్లిక్కేణిలో కాపురము చేయుచుండిరి. వారియింటిలో వారిబంధువు అమ్మాయమ్మగారు అను వృద్ధురా లుండెను. ఆమెయు తెలుగుకవిత్వమందు కొంతప్రవేశము కలిగినవా రగుటచేత మేము అప్పుడపుడు శాస్త్రిగారిని చూడబోయినపుడు ఆమెతోగూడ సంభాషించుచుంటిమి. తిరునారాయణస్వామి తెలుగుపద్యములు సుకరముగ వ్రాయుచుండెను. తాను వ్రాసినపద్యములను ఆమెకు చదివి వినుపించుచుండెను. ఇట్లుండగా అతనిభార్య ప్రసవించి కుమారునిగనె ననువార్త

వచ్చినతోడనే పోయి తల్లిని బిడ్డనుచూడవలెనని ఆతురపడుచుం డెను. ఆసమయమున నే నీపద్యమును

> **అనుపమనిత్యసత్యవ్రత యంబుజలోచన కృష్ణవేణి ప్రా**
> గ్వనిత యుదీర్ణతేజు రవి గాంచినయట్టుల దాను పుత్రునిఁ
> గనె ననువార్త వీనుల కనంతము విందులుసేయుచుండగా
> మనమలరార జూచుటకు మాటికి కోరిక లీరికల్గొనెఁ.

వ్రాసి అతని యాతురత వర్ణనచేసితిని. ఇదియే నేను నాజీవితమున వ్రాసిన మొట్టమొదటి పద్యము. తప్పులతడకయే యగును గాని నాకు పద్యములందుగల యభిరుచి కొంత కన్పడుచున్నదని చెప్ప వచ్చును. ఆరోజులలో ముక్కుతిమ్మనగారి పారిజాతాపహరణమునం దెక్కువ యభిమానముండుటచేత దానియందలి కొన్ని పద్యములను కంఠస్థముచేసుకొని పాడుకొనుచుండెడివాడను. మరియు ఆకాలములో సంగీతమనిన నాకు ప్రేమ యధికముగ నుండెను. మావసతిగృహములో అరవదేశపువిద్యార్థులు పలువు రుండిరి. వారిలో కొందరు కృతులుమొదలగునవి పాడుచుండిరి. వానిని వినుచుండుటయేగాని వారివలె పాడవలెనను పట్టుదల యేమియు లేకుండెను. తుదకు అరవభాషమాట్లాడుటకైన ప్రయత్నముచేయలేదు. అది వినుటకు కొంత కటువుగానుండుట చేత దాన్నిపై బుద్ధిపోలేదు. ఆకాలమున దక్షిణదేశమున మిక్కలి ప్రసిద్ధిగాంచిన సంగీతవిద్వాంసు లొకరు అప్పుడపుడు చెన్నపట్టణమునందు ధనాధిపులయిండ్లలో పాడుచుండెడివారు. వారి గానము రెండుమూడుసారులు నేను వినుటకు బోయియుంటిని. వారిపాట వినుటకు వేలకొలదిజనులు మూగుచుండిరి. వారి కంఠధ్వని మిక్కలి మనోజ్ఞముగ నుండెను. హెచ్చుస్థాయిని

పాడుచుండు వారిపాట వీధులలో మూగియుండిన జనులకు సయితము వినవచ్చుచుండెను. చెన్నపట్టణమునకు వచ్చినపుడెల్ల వేలకొలది ద్రవ్యము ఆయన మూటగట్టుకొనిపోవుచుండెను. ఆయన కొంచెము పొట్టిగానున్నను సుస్వరరూపముగలిగి పవిత్ర చరిత్రముగలవాడని పేరుచెందెను. వారిపేరు జ్ఞాపకముచాలదు. ఏదో వాధ్యాయరు అని పిలిచెడివారు. మరియు ఏనాదిపిల్ల లను ఇరువురుస్త్రీలు పాటకచ్చేరీలలో మిక్కిలి హృద్యముగ పాడి పలువురచే మెప్పుగాంచుచుండిరి. వీరు పేరుకు పిల్లలుగాని వయ స్సున యువతులే. పిమ్మటికాలములో పట్టణము సుబ్రహ్మణ్యము అయ్యరుగారిపాట ప్రఖ్యాతముగ చెప్పుకొనుచుండిరి. వారిపాట నేను వినుట సంభవించలేదు.

జావళులను కొందరు సంగీతపాటకులు పాడుచుండెడివారు గాని అవి సాధారణముగ గొప్పపేరు పొందినవిద్వాంసులు పాడుట లేదు. జావళీలలో కొన్ని అశ్లీలములుగా నుండుటవలనగాని నానాట వానిప్రచారము దేశమున తగ్గిపోయినది. త్యాగరాజకృతులే విశేషముగా ఖ్యాతిగాంచినవి. త్యాగరాజు తెలుగువాడయ్యు అరవదేశమున బుట్టి అక్కడనే ఈకృతులను వ్రాసి ప్రచారము గావించియుండుటచేత మహావిద్వాంసులు వారికృతులనే ముఖ్య ముగ పాడుచుండిరి. తెలుగుదేశమున మువ్వగోపాలపదములు మొదలగువానిని భోగముమేళములలో పాడుచుండిరి. కాని త్యాగరాజకృతులుపాడుట మనవారికెవ్వరికిని ఆకాలమున అభ్యా సములేకుండెననిచెప్పవచ్చును. నేనెరిగినంతలో గోదావరి, కృష్ణా, గుంటూరుజిల్లాలలో ప్రథమమున కృతులుపాడినవారు జంగం

కోటయ్యగారు. హరిదాసులు కొందరు రామదాసుకీర్తనలు పాడు చుండిరి. ఉత్తరమున విజయనగర సంస్థానములో గొప్ప సంగీత పాటకు లుండిరని చెప్పుకొనుచుండిరి. అప్పటి విజయనగరసంస్థానాధీశుడు ఆనందగజపతిజమీందారుగారు చెన్నపట్టణమునకుపలుమారు వచ్చుచుండిరి. మరియు అక్కడ అప్పుడప్పుడు జరుగుమహాసభలకు వచ్చుచుండిరి. వారిస్వరూపము అత్యంత నిపుణుడగు శిల్పి చెక్కిన పచ్చనిబంగారుప్రతిమవలెనే యుండెను. వారి ముఖారవిందము ఎన్నిసార్లుచూచినను ఇంకను చూడవలెననియే కోర్కె పుట్టు చుండెను. తెల్లనిలాగును తెల్లని అంగరఖాను తొడిగి, దానిపైన నల్లనిపూసలుగల బంగారుతావళము మెడలో వేసుకొని, రవలు చెక్కిన తురాయిగల ఎఱ్ఱని టోపీ పెట్టుకొని సభలకు వచ్చుచు ప్రేక్షకుల కానందముగొల్పుచుండెను. ఆనందగజపతియను నామ ధేయము వారియెడ పూర్ణముగ సార్థకమయ్యెను. ఆకాలమున వారిరూపము చిత్రపటములలో వ్రాసి బజారులలో నమ్ముచుం డిరి. వారు పండితులు, విద్యాభిమానులగుటచేత గొప్ప విద్యా పోషకులై తమ యాస్థానమున సంస్కృతపండితులను, సంగీత పాటకులుమొదలగు కళానిధులను ఉంచుకొని వారిని పోషించి గౌరవించుచుండిరి. వీరికాలములోనే కాబోలు విజయనగరములో ఆంగ్లేయకళాశాల స్థాపింపబడినది. వీరు గొప్పరసికులని సయితము చెప్పుకొనుచుండిరి. గ్రాంటుడఫ్ అనునతడు మద్రాసుగవర్నరుగా నుండెను. ఆయనకు భార్యయు, వయస్సువచ్చిన కుమార్తెలు నుండిరి. ఆనంద గజపతి తరచు వారింటికి బోవుచు ఆడవారితో మిక్కిలి పరిచయముతో ప్రవర్తించుచుండెననియు గొప్పగా ద్రవ్యముగూడ నిచ్చుచుండెననియు చెప్పుకొనుచుండిరి.

# శ్రీ వీరేశలింగముపంతులు

అప్పటికి శ్రీ కందుకూరి వీరేశలింగముపంతులుగారు రచియించిన వచనగ్రంథము తెలుగుభాషయందు ప్రజలలో నూతనాభిమానమును కల్పించెను. తెలుగువచనశైలికి ప్రథమభిక్ష వీరేశలింగంపంతులుగారిదనియే చెప్పవచ్చును. చిన్నయ్యసూరి యనువారు నీతిచంద్రిక యనుపేర పంచతంత్రమునందలి సంధి విగ్రహములనే వివరించుచు నొక వచనగ్రంథమును వ్రాసిరి గాని అది సంస్కృతపదజటిలమగుటచే చదువరులకు కఠినముగ దోచు చుండెను. వీరేశలింగముగారు ఆవిషయమునే తమ పంచతంత్ర గ్రంథమునందు తేటయగు తెలుగుపదములను వాడుచు సులభముగ తెలియునట్లు వ్రాసిరి. వీరు ఆంగ్లేయమున షేక్స్పియరు రచించిననాటకములలోని కథలను పాత్రలపేర్లను కథాక్రమమును మనదేశమున కనురూపముగా మార్చి హృద్యముగ నుండునట్లు సులభశైలిని రచియించిరి. బాలురకు సుకరముగనుండుటకు తెలుగువ్యాకరణమును, శరీరశాస్త్రము, తర్కము, జ్యోతిశ్శాస్త్రము మొదలగు నవీనశాస్త్రగ్రంథములలోని విషయములను క్లుప్తపరచి లోకజ్ఞానము దేశమున వ్యాపించుటకై పుస్తకములు ప్రచురించిరి. ఇదిగాక వివేకవర్ధనియను నొక పత్రికయు, చింతామణియను మాసపత్రికయు ప్రకటించి, దేశమున తెలుగుభాషా పరిచయము పెంపొందించుటయేగాక రాజకీయపరిపాలనావిషయములు, సాంఘికవిషయములును దేశవార్తలును ప్రకటించుచుండిరి. అప్పుడు చెన్నపట్టణములో ప్రెసిడెన్సీ కళాశాలలో ఆంధ్రపండితులగు కొక్కొండ వెంకటరత్నముపంతులు, నెల్లూరులోని మానేపల్లి

పురుషోత్తము అను మరియొక ఆంధ్రవిద్వాంసులు నుండిరి. ఈపండితులకును వీరేశలింగముపంతులుగారికిని భాషావిషయిక మైన వాదప్రతివాదములు తీవ్రముగ జరుగుచుండెను. ఇవి పత్రికలలో ప్రకటితము లగుచుండెను. ప్రభుత్వోద్యోగులు చేయు అక్రమములు వివేకవర్థనిలో నిర్భయముగ విమర్శింపబడుచుండెను. సాంఘికదురాచారములును నైష్ఠికులమని పేరుపెట్టుకొన్నవారు కొందరు సమాజమున జరుపుచుండు దుశ్చేష్టలును బట్టబయలు చేయబడుచుండెను. బాల వితంతువుల వైధవ్యమువలన కలుగుచున్న యనర్థములు వివరింపబడుచుండెను. స్త్రీ పునర్వివాహములు వీరేశలింగముపంతులుగారు జరిపి, సంఘబహిష్కారమునకు పాత్రులై కష్టములపాలగుచుండుటచేత దేశమున ఈసంఘ సంస్కరణమునుగూర్చి గొప్పకలవరము సాగెను. ఆంగ్లేయవిద్యార్థులలో గొందరు సంఘసంస్కరణాభిమాను లేర్పడిరిగాని తక్కినవా రీ సంస్కరణపట్ల మిక్కిలి విముఖులై యుండిరి. మరియు ఆంగ్లేయవిద్యాధికులగు న్యాయవాదులకును ధనికులగు వైశ్యులు మొదలగువారికిని భోగముసానులతో బహిరంగసంబంధము లుండెను. పలువురు దానిని వారి గొప్పస్థితికి తగిననడవడిగ పరిగణించుచుండిరి. భోగముబాలికలు వ్యక్తురాండ్రగుటతోడనే కన్నెరికము పెట్టుట యొకగొప్పకార్యముగ ప్రజలు పరిగణించు దుస్థితి సంఘమున నేర్పడెను.

ఇట్లు దేశమున నడచుచున్న దుష్కార్యములును దురాచారములును బయటపెట్టుటకు వీరేశలింగముగారు మిక్కిలి వినోదములగు చిన్నకథలను కల్పించి, ప్రహసనములు వ్రాసి

ప్రకటించుచుండెడివారు. సంస్కరణలవిషయమై పూర్వాచార పరాయణులగు పండితులకు, వీరేశలింగముపంతులుగారికిని రాజమహేంద్రవర మహాసభలలో వాదప్రతివాదములు పలుమారు జరుగుచుండెను. ప్రభుత్వోద్యోగులు చేయు అన్యాయములను వెలిబుచ్చుటయందు పంతులుగారు మిక్కిలి శ్రద్ధయు పట్టుదలయు ప్రకటించుచుండిరి. రాజమహేంద్రవరములో ఒకడిస్ట్రిక్టుమునసబు లంచముపుచ్చుకొన్న కేసును పట్టియిచ్చుటకు వారు జరిపినచర్య పలువురు చాలకాలము ఆశ్చర్యముగ చెప్పుకొనుచుండిరి. ఆ మునసబు ఒకవ్యాజ్యములో పార్టీయొద్ద లంచముపుచ్చుకొని పక్షపాతము వహించి తీర్పు ఆపార్టీ కనుకూలముగ వ్రాసి ఆఫీసులో పెట్టెనట. ఆ కేసులో ఎదిరిపక్షము ఆవ్యాజ్యములో మునసబు లంచముపుచ్చుకొని న్యాయవిరుద్ధముగ తీర్పువ్రాసినట్లు తెలిపిన తోడనే పంతులుగారు జిల్లాజడ్జిగారికి పక్షపాతమును విన్నవించిరి. జిల్లాజడ్జి మునసబుకోర్టుకు వచ్చునప్పటికి మునసబు తీర్పును తన ఆఫీసుపెట్టెలో పెట్టి తాళమువేసి కోర్టునుండి వెడలిపోయెను. ఆ పెట్టెను కోర్టుజవాను మునసబుగారింటికి మామూలుప్రకారము తీసికొనివెళ్లుటకు సిద్ధముగా నుండెను. జిల్లాజడ్జి ఆపెట్టెను తాళముపై సీళ్లువేసి మరునాడు దానిని తెప్పించి చూడ వచ్చుననుకొని జవానుయొద్దనే యుంచి వెడలిపోయెను. జవాను మునసబుగారియింటికి పెట్టెను తీసికొనివెళ్లి జడ్జిగారు వేసినసీళ్లు చూపించెను. ఆపెట్టె కొయ్యదగుటచేత ఆరాత్రి దాని అడుగు చెక్కకు వేసినమరమేకులను మెల్లగ నూడదీసి, లోపల తాను వ్రాసిపెట్టిన తీర్పును చించిపారవైచి, రెండవపక్షమువారికే అనుకూలముగ తీర్పు మరియొకటి వ్రాసి ఆపెట్టెలో బెట్టి, ఊడదీసిన

అడుగుచెక్కను మరల మరమేకులతోనే బిగించి, జడ్జి వేసినసీళ్లు చెడకుండ భద్రముగ నుంచెను. మరునాడు జడ్జి ఆపెట్టెను తెప్పించి తాళముతెరిపించి చూడగా తీర్పు వీరేశలింగముగారు చెప్పినప్రకారముగా గాక ఎదిరిపక్షముగనే వ్రాయబడియుండెను. వీరేశలింగముగారు మునసబు లంచము పుచ్చుకొనెనని చెప్పుటయే అన్యాయమైనట్లు ఏర్పడినది. పెట్టె అడుగుచెక్కను విప్పి వ్రాత తీర్పు చించివేసి క్రొత్తతీర్పు వ్రాసిపెట్టె ననుమాట పంతులు గారికి తెలియవచ్చినది. కాని యిది రుజువుపఱచుట అసాధ్య ముగనేయుండెను. వారు నెమ్మదిగ యోచనచేసి, మునసబుగారి యింటిలో పనిచేయు పనికత్తెను పిలిపించి మునసబుగారి ఆఫీసు గది ప్రక్కను పారవేసియున్న కాగితపుముక్కల నన్నిటిని ప్రోవు చేసి తెప్పించిరి. వాని నన్నిటిని జాగ్రతగ చదివి అందలిఅక్షరము లను సందర్భోచితముగ పదములుగ కూర్చి పదములను వాక్య ములుగ జేర్చి మొత్తమున మొదటవ్రాసిన తీర్పు మరల రూప మొత్తించెను. ఈ ముక్కల నొకదానితో నొకటి అంటించి దానిని జడ్జిగారియొద్దకు గొనిపోయి చూపించెను. అది అంతయు మునసబు స్వహస్తముతో వ్రాసినదగుటచే మునసబుచేసిన దురంతమంతయు స్పష్టమయ్యెను. ఈవిషయమును విని, మునసబు ఆత్మహత్యచేసుకొని రాజదండన తప్పించుకొనెను. వీరేశలింగము గారి వాక్యముల సత్యము నిర్ధారణయగుటయేగాక అక్షరముల గూర్చువిద్యయందు వారికిగల ప్రావీణ్యము తేటపడెను. మరియు వారు దుర్మార్గులగు ప్రభుత్వోద్యోగులకు సింహస్వప్నముగ నుండిరి. వారి ప్రభావము దేశమున ఎల్లెడల వ్యాపించెను.

ఆదినములలోనే న్యాపతి సుబ్బారావుపంతులుగారు జిల్లా కోర్టులో న్యాయవాదిగానుండి ఖ్యాతిగాంచి ప్రధానపురుషుడుగా పరిగణింపబడుచుండెను. వివేకవర్థని ప్రకటన మొదలగు కార్యములందును పునర్వివాహసందర్భములలోను వీరేశలింగముగారికి చేయూతనొసంగుచు వారితో మిక్కిలి మైత్రితో ప్రవర్తించుచుండిరి. వారితమ్మునికి వితంతువుతో వివాహము, తనకు తెలుపకుండ వీరేశలింగముగారు జరిపినందుకు వారిపై కోపించి అప్పటి నుండియు భేదభావముతో ప్రవర్తించుచుండిరని పలువురు చెప్పుకొనుచుండిరి.

## రంగయ్యసెట్టి - మిల్లరుదొర

మేము బి. ఏ., క్లాసులో జేరునప్పటికి మామిత్రులగు వింజ్ఞచెరువు రామయ్య, పిడతల సీతాపతయ్య, నాగపూడి కుప్పుస్వామయ్యగార్లు బి. ఏ. పరీక్షలయందు కృతార్థులైరి. వింజ్ఞ చెరువు రామయ్యగారు గుంటూరులో హిందూఉన్నత పాఠశాలలో ఉపాధ్యాయులుగా జేరిరి. కుప్పుస్వామయ్యగారును, సీతాపతయ్యగారును సెకండుగ్రేడుప్లీడరీ నిమిత్తము చదువుచుండిరి. మరియు కుప్పుస్వామయ్యగారు కాళహస్తిలో జమీందారుగారి యింటిలో పిల్లలకు చదువుచెప్పు ఉద్యోగమును సంపాదించుకొనిరి. అదివరకు బి. ఏ., చదువుసమయముననే తండియారుపేటలో అబ్బయ్యనాయుడుగా రను నొక గొప్పవర్తకునియింటిలో ట్యూటరుగా నుండిరి. ఆయన అందువలన తండియారుపేటలో భార్యతో కాపురముచేయుచుండెను. ఒకప్పుడు ఏదో

పండుగనాడు వారియింటికి నన్ను బిలుచుకొనిపోయి భార్యచేసిన భక్ష్యభోజ్యములను మిక్కిలి ప్రేమతో కుడువబెట్టిరి. అరవవారి యింట నేను భోజనముచేయుట కదియే మొదలు. కుప్పుస్వామయ్యగారు నన్ను తనకు నెడమప్రక్కను గూర్చుండబెట్టుచు అది వారియిండ్లలో సాంప్రదాయముగ జెప్పిరి. కుప్పుస్వామయ్య అరవలైనను తెలుగుభాషయందువలెనే తెలుగువారి ఆచారముల పట్ల వారికి అభిమానము మెండు.

తాము అబ్బయ్యనాయుడుగారి పిల్లలకు ట్యూటరుపదవి మానుకొనిపోవునప్పుడు నన్ను ఆపనిలో ప్రవేశపెట్టుటకు తీసికొని పోయిరి. అప్పుడు ఇంగ్లీషుపాఠమును బాలురకు చెప్పుమని కోరిరి. నేను చెప్పి ముగించి యింటికివచ్చితిని. నేను (Pudding) 'పుడ్డింగ్'అను పదమును 'పుడ్డింగ'నుటకుబదులు 'పడ్డింగ'ని ఉచ్చరించితినట. అందువలన నన్ను ట్యూటరుగా నేర్పరచుకొనుట వారికి సమ్మతముగాకపోయెనని కుప్పుస్వామయ్యగారు నాతో నొచ్చుకొనుచు జెప్పిరి.

మేము ఎఫ్. ఎ. క్లాసులో చదువునపుడు 'మారన్'అను నొక ఉపాధ్యాయుడు ట్రిగ్నామెట్రీ బోధించుచుండెను. ఆయన చెప్పునదేదియు బోధపడకుండెను. ఆయనకు సహోపాధ్యాయుడొక యరవబ్రాహ్మణుడుకూడ ఆశాస్త్రమునే చెప్పుచుండెడివాడు గాని ఆయన చెప్పుచుండగా విద్యార్థులు మితిలేని అల్లరి చేయుచుండెడివారు. ఆయనయును బోధనాశక్తియందసమర్థుడే. కాబట్టి ఈశాస్త్రము బాగుగ బోధపడక మొదటిసారి ఎఫ్. ఏ.

పరీక్షలో తప్పిపోవుట కలిగినది. బి. ఏ. క్లాసులకు రంగయ్యచెట్టి గారను నొక దక్షిణాది వైశ్యుడు ఉపాధ్యాయుడుగా నుండెను. ఈయన గణితశాస్త్రమునందు మంచి ప్రవేశముకలవాడని చెప్పు కొనుచుండిరి. ఆయన తెలుగువా డగుటచేత కాలేజీలో తెలుగు క్లాసులపై తనిఖీకి అప్పుడప్పుడు వచ్చుచుండెడివారు. గురు మూర్తి శాస్త్రిలుగారు తెలుగుపాఠములు బోధించుచుండిరి. ఈయన వయోవృద్ధులు. వీరిమాట విద్యార్థులెవ్వరును లక్ష్య పెట్టుటలేదు. ఎప్పుడును క్లాసులో అల్లరి మిక్కుటముగా నుండె డిది. రంగయ్యచెట్టిగారు తనిఖీకివచ్చుసందడి తెలియగనే అందరు నిశ్శబ్దముగ నుండెడివారు. శాస్త్రిగారు ఏవేవో కథలుచెప్పి అం దరిని నవ్వించుచుండిరి. ఒకనాడు 'మారన్' మాక్లాసుకు రాలేదు. క్లాసులో అల్లరి ఎక్కువగా నడచుచున్నసమయమున రంగయ్యచెట్టిగారు వచ్చిరి. వీరి దేహచ్ఛాయ నల్లగానున్నను సుందరరూపులు. తెల్లనిధోవతిగట్టి తెల్లనిలాంగుకోటు తొడిగి, సరిగంచుతలగుడ్డ పెట్టుకొని కాళ్లకు తిరుచునాపల్లిముచ్చెలజోడు తొడుగుకొని ఏమియు చప్పుడుచేయకుండ నడచుచుండువాడు. ఈయన దుస్తు లేనాటి కానాడు ఇస్త్రీచేసిన మడతలే. వైష్ణవ నామములు దిద్దినముఖము, వంకరలుతీరిన నల్లనిమీసము ఆయన యాకృతికొకరీతి సొంపును గంభీరతను నొడగూర్చుచుండెను. ఈయన క్లాసునకు వచ్చి నేడు మీ పాఠ మేమి యని యడిగి, కుర్చీలో కూర్చుండి పాఠము చెప్పబోవుచుండగా బైనామినల్ థీరమ్ చెప్పవలసినదని విద్యార్థులు కోరిరి. అంతట ఆ థీయరీని చాల నెమ్మదిగ అందరికిని సులభముగ తెలియునట్లు బోధించెను. అంతకుముందు అగమ్యగోచరముగనున్న ఆథీరము అరటిపండ

లిచి చేతిలోపెట్టినట్లుండుటచే మిక్కిలిసంతోషముతో విని, వీరే మాకు బోధకులుగా నుండిన ఎంత బాగుండెడిదో గదా యని అనుకొంటిమి. ఉత్తరాది తెలుగువిద్యార్థులయందు వీరి కభిమానము మెండు.

మా కళాశాలాభవనమును పెంపుచేయవలెనను సంకల్ప ముతో మార్చి, కట్టుచుండగా, ఆకస్మికముగ నొకనాడు గొప్ప తుఫాను వీచుటచే క్రొత్తగాకట్టుచున్న టవరు కూలి హాలు మీద బడి క్రిందిగదులనుగూడ నష్టపరచెను. వర్షము వరుసగ కొన్నిరోజులు మిక్కుటముగ కురియుచుండెను. సమీపమున నున్న యాండర్సన్ హాలులోనికి మాక్లాసు మార్చబడెను. చరిత్రపాఠము చెప్పు ఉపాధ్యాయుడు ఒకనాడు కళాశాలకు రాలేదు. విద్యార్థులు ఆనాడు చేసినఅల్లరి మిన్నుముట్టిపోవు చుండెను. మా ప్రిన్సిపాల్ డాక్టరు మిల్లరుగారు క్రొత్తకట్టడ ములు పడిపోవుటచే కలిగిన నష్టమునకు మిక్కిలిచింతాక్రాంతులై కళాశాలాభవనమందున్నసమయమున మాక్లాసులో విద్యార్థులు చేయు అల్లరి వారికి మిక్కిలి దుస్సహముగతోచి కోపోద్దీపితులై వర్షములో తడియుచు యాండర్సన్హాలులోనికి వచ్చిరి. మిల్లరు దొరగారు పొడవును పొట్టియునుగాని నడితరముఎత్తుగలిగి లావును గాక సన్నమునుగాక తగినంత దృఢకాయముకలిగి గుండ్రని ముఖ మున, ముచ్చటగొలుపుమీసములతో శోభిల్లుచుండెను. ఆయన కనుబొమలపై వెండ్రుకలు ఇంచుక దట్టముగ పొడవు పెరిగి కోపమువచ్చినపుడు ముడిబడుచుండెను. గంభీరమగు వారి ముఖారవిందము చూచినంతనే గౌరవముకలుగుచుండును. ఆ నా

డాయన యొండర్సనుహాలు వాకిలి దాటి లోపల అడుగుపెట్టి, (My Boys) మై బాయిస్ అని యొక కేకవేయుటతోడనే అల్లరి యంతయు చల్లారెను. ఆయన కోపోద్దీపితమైన ముఖమును జూచి అందరును భయమునొందిరి. (Shame, my boys, shame) సిగ్గు, పిల్లలారా సిగ్గు అని నుడివి, శాంతించి నేడు మీ పాఠమేమి యని ప్రశ్నించగా గ్రీకులచరిత్రలో పిలపోనీషియన్ యుద్ధము అని చెప్పగా విని ఆయుద్ధమునకు కారణములను విపులముగ విశదీకరించి ఆయుద్ధమున గ్రీకుసేన లెట్లుపోరాడెనో తెలుపుచు యుద్ధప్రచారమును వర్ణించి అనన్యమగు వారి వాగమృతమును వర్షించుటయేగాక ఆ చరిత్రాంశముల పరిజ్ఞానమును ప్రకటించిరి. తలవనితలంపుగ క్లాసుకు వచ్చి, ఏప్రయత్నమును లేకయే పిలపోనిషియన్ యుద్ధమునుగూర్చి ఇన్ని వివరములు ఇంత విపులముగ తెలుపుట మాకు మిక్కిలి ఆశ్చర్యమును కల్పించెను. వా రెప్పుడును కళాశాలలో షేక్సుపియరుపాఠముతప్ప మరి యొకటి చెప్పెడి వాడుక లేదు. చరిత్రవిషయములో ఆయన కే జోక్యమును లేదు. వారు చెప్పిన దంతయు పూర్వ మెప్పుడో చదివినదై నను అంత బాగుగా చెప్పుట వారికిగల అసాధారణ మగు జ్ఞాపకశక్తిని ప్రకటించెను. అట్టి జ్ఞాపకశక్తిచేతనే తన విద్యాశాలలో చదువు సుమారు రెండువేలమంది విద్యార్థులలో ప్రతివానిని పేరుపెట్టి పిలువనేర్చిరి.



# పడవ ప్రయాణము

మేము బి. ఏ. మొదటితరగతిలో చదువుచుండగనో ఎఫ్. ఏ. చదువుకాలములోనో ఒక్కవేసవి సెలవలలో కళాశాల మూయుటతోడనే బకింగుహాముకాలవ అను చెన్నపట్టణపు కాలవపై పడవలమీాద చేబ్రోలు చేరి, అక్కడనుండి గుంటూరు చేరవచ్చునని యోచనచేసి పడవవారిని అడుగగా వారము రోజులలో వెళ్ళవచ్చునని వారు చెప్పినందున కొందరు విద్యార్థులము కలసి పడవనెక్కి ప్రయాణముచేసితిమి. (Lake Pulicut) ప్రళయకావేరి యని పిలువబడు ఉప్పునీటిమడుగును పడవదాటిపోయిన కొలది దినములనుండి మాకు ఈ ప్రయాణములో కష్టములు ప్రారంభమైనవి. వెంట తెచ్చుకొన్న లడ్లు, కారపుబూంది మొదలగునవి తినివేసితిమి. మాపడవలోనే యొక బ్రాహ్మణ వితంతువును ఆమెకుమారు డొకబాలుడును ప్రయాణము చేయుచుండిరి. ఆమె చాల బీదరాలు. ఆమె మాకు ప్రతిదినమును వండిపెట్టునట్లును మాకును ఆమెకును ఆమెనుమారునకును కావలసిన బియ్యముమొదలగు భోజనద్రవ్యము మేము తెచ్చియిచ్చునట్లును ఏర్పాటు చేసుకొంటిమి. మే మెక్కినపడవగాక మరికొన్ని పడవలుగూడ మాపడవతోడనే ప్రయాణముచేయుచుండెను. ప్రళయకావేరి దాటినతర్వాత నొక మధ్యాహ్నమున నొక సరుగుతోటయొద్ద పడవలు ఆపివేసి, సమీాపమున పల్లెలో కలాసులు వారివారి బసలకు భోజనమునకు బోయిరి. మేము తెచ్చుకొన్న బియ్యము మా కందరికి కావలసినవి కొలిచి ఆమెకిచ్చితిమి. సమీాపగ్రామములో ఉప్పు, కూరగాయలు, మజ్జిగ

దొరకునని ఆశతో ఒకరిద్దరు పోయిరి. మాకు వంటచేయుటకు ఒప్పుకొనిన ఆమె కాలువలో స్నానముచేసివచ్చునప్పటికి తోటలో నొకచోట స్థలము బాగుచేసి పొయ్యినమర్చి నిప్పు రాజబెట్టుడని ఆమె కోరినందున మేము రాళ్ళుతెచ్చి వానిని పొయిగా నమర్చి పుల్లలు వెతకికొనివచ్చి పొయిలో నుంచి నిప్పుపెట్టెలో పుల్లగీచి ముట్టించునప్పటికి పుల్లలు కాలుటయే గాక పొయిక్రిందను దానిచుట్టును నేలమీదనున్న సరుగుచెట్ల ఆకు మొదలగునవి భగ్గునమండి మంట నలుప్రక్కల ప్రాకనారం భించెను. అంతట చుట్టునున్న తుక్కును వెనుకకు నెట్టి మంట ప్రాకనీయకుండ చేసి మరల ఆ దుర్గేమియు లేకుండ తీసివేసిన నేలపై పొయి నమర్చితిమి. తోట అంతట సుమారు అరగజము ఎత్తున పడియున్న సరుగుచెట్లఆకు అలము సులభముగ రవులు కొనిపోవుననుమాట గుర్తించక ఆదుగ్గుమీదనే పొయిపెట్టుట వలన ఈ యుదంతము సంభవించెను. కాని దైవానుగ్రహము వలన ఆమంటలు ప్రాకకుండచేయగలిగితిమని సంతసించితిమి. కూరలు మొదలగునవి తేవలెనని దగ్గరిగ్రామమునకు బోయిన వారు ఉప్పుమాత్రము తెచ్చిరి. తక్కినవేమియు దొరకలేదు. కనుక ఏ మూడుగంటలకో పచ్చిపులుసుతో అన్నముతిని అంతట పడవనెక్కి ప్రయాణముచేసితిమి.

మాతోడ నొక వైష్ణవాచారిగూడ ప్రయాణము చేయుచుండెను. ఆయన ఆతోటలోనే చుట్టును గుడ్డలుకట్టి రహస్యస్థానము నేర్పరచుకొని కాలవలో స్నానముచేసి తిరునామ ములు దిద్ది, దడిలోపల సుఖముగ భుజించి మావంట ప్రారంభ

మూగుచుండగనే వెలుపలకు వచ్చెను. బందరుకాపురస్థులు కట్ట మూడి చిదంబరరావు అనువారు భార్యతోగూడ ప్రయాణము చేయుచుండిరి. వారికి కావలయువస్తువు లన్నియు జాగ్రత్తగ పట్నమునుండియే తెచ్చుకొనిరి గాన వారును త్వరలోనే వంట చేసుకొని భోజనముచేసిరి.

కాలువపొడవున పలుచోటుల సముద్రప్రవాటుతో ఇసుక కొట్టుకొనివచ్చి దిబ్బలుపెట్టియుండుటచేత పడవలు తేలుటయే కష్టముగానుండెను. దిబ్బలమీద పడవలవారును మే మందర మునుగూడ కలసి పడవలను నెట్టుచు దాటించవలసివచ్చుచుండెను. ఇందువలన ప్రయాణము సాగక దినములు గడచిపోవుచుండెను. నిత్యమును పచ్చిపులుసు మెతుకులే గతియయ్యెను. అవియేనియు ఒక్కపూటమాత్రమే. ఇట్లు మేము క్రొత్తపట్టణము నొద్దకు వచ్చునప్పటికి పదునైదురోజులుపట్టెను. ఆయూరు చేరుసరికి మట్టమధ్యాహ్న మాయెను. కాలువకును ఊరికిని చాల దూరము అయినను ఏపూటకూలిబసలోనో భోజనము చేయ వచ్చునను ఆశతో ఎండచే తల మాడుచున్నను కాళ్లు కాలుచున్నను ఊరికి చేరితిమి. ఆయెండకు తాళలేక పిట్టయొకటి చెట్టునుండి జారిపడెను. అటిమెండలో మేము ఊరుచేరినను ఒకఅమ్మ ఇంత అన్నముపెట్టి ఏదోపచ్చడివేసి నీళ్లమజ్జిగతో సరిపుచ్చెను. పడవప్రయాణమిక చాలునని బండిచేసుకొని చినగంజాము చేరి అక్కడనుండి మరియొకబండిమీద ఎట్లో గుంటూరు చేరునప్పటికి ప్రాణములు కల్యగతములై యుండుటచేత మాతండ్రిగార్లు మమ్ముజూచి మిక్కిలి భయపడిరి. ఎట్లో కొన్నివారములకు

నెమ్మదిగ మామూలుమనుష్యులము కాగలిగితిమి. ఆకాలములో రైళ్లులేని కారణమున బందరో, కాకినాడో చేరుస్టీమర్లు దొరికి నప్పుడే ప్రయాణముసాధ్యమగుటచేత అట్టిప్రయాణమును వ్యయ ప్రయాసలతో కూడియుండుటచేతను గుంటూరు చెన్నపట్టణ ములమధ్య రాకపోకలు మిక్కిలి కష్టసాధ్యముగనుండెను.

ఈచెన్నపట్నపు కాలువమీదనే నేను గుంటూరుమిషన్ హైస్కూలులో చదువుచున్నకాలమున మేడమ్బ్లావాట్స్కీ యును, కల్నల్ ఆల్కాట్ గారును చేబ్రోలుచేరి, చేబ్రోలునుండి గుంటూరువచ్చిరి. ఆదినములలో కాలువ దిబ్బలువేయక మంచి స్థితిలో నుండెనేమో. థియసాఫికల్ సొసైటీ అనగా దివ్యజ్ఞాన సమాజ మప్పుడే యాయూర స్థాపించబడెను. అప్పుడు గుంటూ రులో మాడభూషి వేదాంతం వెంకటాచార్యులుగారు అను గొప్పసంస్కృతపండితు లొక రుండిరి. వారు ఏకసంధాగ్రాహి యని పేరుపొందిరి. ఏవిషయమైనను ఒక్కసారి చదివినను విని నను దానిని ఏమియు మరచిపోక అంతయు పాఠముగ చెప్పగల బుద్ధి సామర్థ్యము వారి కుండెను. మాడమ బ్లావట్స్కీగారు రుష్యాదేశవాసి యగుటచే ఆమె దేశభాషలో నేదియో చెప్పిన దానిని ఆపండితుడు విని వెంటనే తప్పులేకుండ ఒప్పజెప్పెనట. ఈయన మరియొకసారి జిల్లాకోర్టులో నూజవీడు జమీందారీ కేసులో సాక్షిగ విచారించబడెను. అప్పుడు చాలదీర్ఘముగు వాఙ్మూలమునిచ్చియుండెను. దాని నంతయు తాను చెప్పినది చెప్పినట్లు మొదటినుండి తుదివరకు మరల ఏకరువుపెట్టెనను సాధారణముగ చెప్పుకొనుచుండిరి. వీరు ఇప్పుడు గుంటూరులో

వకీలుగానున్న శ్రీ మాడభూషి వేదాంతం నరసింహాచార్యులు గారి పెంపుడుతండ్రి. అట్టి మహాపండితులు ఈకాలములో కన బడుటలేదు.

## వివాహము

మేము బి. ఏ. చదువుట ప్రారంభించినపిమ్మట నాకు వివాహముచేయవలెనని మాతండ్రిగారు ఉద్దేశించుకొనిరి. మెట్రి క్యులేషనులో చేరకపూర్వమే సంబంధములు వచ్చుచుండెను గాని మాపిల్లవాడు చదువుకొనుచున్నాడు గనుక వివాహము చేయతలచలేదని పంపివేయుచుండిరి. కాని ఇప్పుడు ఇంటిలో మేనత్త అబ్బాయికి వివాహముచేయు మని చెప్పసాగినది. కనుక తగిన సంబంధమునిమిత్తము కొన్ని గ్రామములకు బోయి, తుదకు వంగోలు సమీపమున లింగముగుంట అనుగ్రామములో లింగము గుంటవారిపిల్లను జూచివచ్చిరి. కొలదిరోజులకు ఆపిల్లమేనమామ గారును మరియొకబంధువును మాయింటికి వచ్చి, సంబంధము నిశ్చయించుకొని పిల్లకు వివాహము తిరుపతిలో మ్రొక్కుబడి యుండుటచే అక్కడనే చేయవలసియుండునని చెప్పివెళ్ళిరి. ఆపిల్లకు తండ్రిగారు కొలదిసంవత్సరములక్రిందటనే గతించిరి. తల్లియును, ఎనిమిదేండ్లవాడొకతమ్ముడు నుండిరి. లింగము గుంటవారిది వంగవోలుతాలూకాలో పేరుపొందిన వంశము. ఈపిల్ల తండ్రిపేరు కోదండరామయ్యగారు. వారితండ్రి కోటయ్య గారు. ఆగ్రామకరిణీకమువారిదే. వారు భారీవ్యవసాయదారులు. స్వాంతముగాని, ఇతరులవలన కవుళ్లుపొందిన మాన్యములుగాని రెండువందల ఎకరములవరకు నుండెడిది. అన్నదానమునకు

ప్రసిద్ధికెక్కిన కుటుంబము. తండ్రికొడుకు లిరువ్వురును ఆకాలమున మంచి వ్యవహర్తలని పేరుగాంచిరి. కోటయ్యగారు కరిణీకము చేయవచ్చునప్పటికి లింగముగుంటగ్రామమునకును చుట్టు ప్రక్కల హద్దులు లేవు. కాబట్టి పొలిమేరత్రొక్కుటకు కోటయ్యగారినే గవర్నమెంటు ఉద్యోగులును గ్రామములోని ప్రజలును కోరిరి. పొలిమేరత్రొక్కుటకు సామాన్యముగ నందరును ఒప్పుకొనరు. ఏయూరి ఆసామీలు చేసుకొన్న పొలములు ఆయూరి వారికే యుండులాగున జ్ఞాపకము పెట్టుకొని న్యాయదృష్టితో జాగ్రత్తగా చేయవలసిన కార్య మది. అట్లు హద్దులుత్రొక్కుటలో అక్రమము జరిగినయెడల ఆ త్రొక్కినవారివంశము నాశనమగు నను విశ్వాసము కూడ ప్రజలలో వ్యాపించియుండెను. ప్రజలు కోటయ్యగారుతప్ప మరియొకరు సమర్థులుగారని పట్టు పట్టుటచేత సమ్మతించెను. పూర్వాచారప్రకారము ఆనాడు చెరువులో స్నానముచేసి, తడిగుడ్డలతోనే రామాయణము నెత్తిన బెట్టుకొని అనేకజనులు వెనుక నడచుచుండగా లింగముగుంటపొలములచుట్టును ప్రదక్షిణముగ తిరిగివచ్చెనట. అప్పుడొక నల్లనికుక్క ఆయనకు ముందు నడిచెననియు, ఆకుక్క నడిచిన త్రోవనే ఆయన నడిచెననియు చెప్పిరి. ఆప్రకారము చుట్టివచ్చిన త్రోవయే లింగముగుంటగ్రామమునకు పొలిమేరగా నేర్పడినది. ఆనాడు ఆయన యుపవాసముచేసి దీక్షతో నుండెను. వారియింటిలో ఏ చిన్నప్రాణి గతించినను ఆయన పొలిమేర త్రొక్కుటలో అన్యాయముచేసినట్లు ప్రజ లూహింతురుగాన కొన్నాళ్ళవరకు ఇంటిలో పశువులు, పిల్లి, కుక్క మొదలగు వానిని జాగ్రత్తగా కాపాడుచుండిరట.

వీరు విస్తారముగ భూమికలవారగుటచే వీరికిగల యెద్దులతో పనులు తూగకుండెనట. అమావాస్యనాడు ఆయూరి ఆసామీలుగాని దగ్గరపల్లెల ఆసామీలుగాని భూమి దున్నరు. కావున ఆనాడు వారి అరకలు వీరిభూములు దున్నిపోవుచుండెనట. ఇందువలన వీరికి పలుకుబడి విశేషముగా నుండెనని తెలియుచున్నది. వ్యవసాయంమాత్రమే గాక కొంతకాలము వీరు నీలిమందువ్యాపారము చేయుచుండెడివారు. ఆకాలమున చెన్నపట్టణములో గాజుల లక్ష్మీనరసింహచెట్టియను గొప్ప వర్తకుడు సీమకంపెనీతరఫున నీలిమందు ఖరీదుచేసి యోడమీాద సీమకు రవాణాచేయుచుండెను. లింగముగుంటవారు వంగోలు, అద్దంకిమధ్య నుండు గ్రామములలో తయారైన నీలిమందు లక్ష్మీనరసింహచెట్టిగారికి ఏజంట్లుగా కొనుగోలుచేయుచుండిరి. ఈవ్యాపారమునిమిత్తము పైకము చెన్నపట్టణమునుంచి లింగముగుంటకు కావిళ్ళమీాద మనుష్యులు తెచ్చుచుండెడివారని గ్రామములోని ముదుసళ్లు చెప్పుచుండెడివారు.

కోదండరామయ్యగారు ఆడంబరపురుషుడు. అప్పుడు వంగోలు నెల్లూరుజిల్లాలో చేరియుండెనుగాన నెల్లూరులోను వంగోలులో నుండు సర్కారుఉద్యోగులలో ముఖ్యులైన వారితో స్నేహము సల్పుచుండెను. వారిని తమగ్రామమునకు రప్పించి విందులుచేయించుచుండెను. తెల్లవా డొకడు వంగోలులో డాక్టరుగా నుండెను. ఆయనతో చాల స్నేహము సంపాదించెను. ఆయననిమిత్తము కావలసిన వస్తువులు తెచ్చి, కుడువబెట్టుచుండెను. కొన్నాళ్లు రోడ్డుకంట్రాక్టు పనులుగూడ

చేయించుచుండెను. ఎక్కి తిరుగుటకు తెల్లని పెద్దగుఱ్ఱమును, రెండెద్దులపెట్టెబండియు, ఇతరగ్రామములనుండి ఉద్యోగులు మొదలగువారు వచ్చినపుడు వారిసౌకర్యమునిమిత్తము డేరా యుచు సమకూర్చుకొనెను. ఈయన భోగపురుషు డగుటచే చెడిపోయిన ఒక బ్రాహ్మణస్త్రీని ఉంచుకొని దాని నిమిత్తము చిన్నమేడను కట్టించెను.

మరియును కోర్టులలో వ్యాజ్యములుండు కక్షిదారులకు సలహాలనిచ్చి వారివలన బహుమానములు పొందుచుండెను. ఇట్లు సలహాలు పొంది జయించిన కక్షిదారులు తొమ్మిదియకర ముల భూమి నిచ్చి తెల్లని పెద్దగుఱ్ఱము నిచ్చి దానిపై నెక్కించి ఆయనకు ఊరేగింపుటుత్సవము గావించిరట. మరియొకరు మంచి టేకుకలప కొనితెచ్చి, వీరిగ్రామములో నూరివెలుపల పండ్రెండుదూలముల పశువులశాలను కట్టియిచ్చిరి. మరియు ఈయన గరిడీనేర్చిన జవాను. ఎప్పుడును ఫైలువానువంటి ముసల్మానొకడువెంట తైనాతిగా నుండెను. భజనలుచేయుట యం దెక్కువ ప్రీతియగుటచే సమీపమున నున్న క్రొత్త పల్లినుండి హరిదాసులను బిలిపించి, శనివారమునాడు దేవాల యములో భజనలు, పూజలు గావించి భోజనములుపెట్టి బహూ కరించుచుండెడివాడు.

బాపట్లతాలూకా ఉప్పుటూరిలో బెండపూడివారిది గొప్ప భూవసతిగల ప్రసిద్ధవంశము. వారికిని ఉప్పుటూరిగ్రామమునకు కరిణీక మిరాసికలదు. వీరిపిల్లను కోదండరామయ్యగారి తమ్మునకు

ఇచ్చుటకు లింగముగుంట వచ్చి సంబంధము నిశ్చయించుకొని లగ్నముగూడ నిర్ణయించుకొని, పెండ్లికి తరలిరమ్మని చెప్పిపోయిరి. పిల్ల నిచ్చినవా రెంతవారైనను పిల్లను తీసికొనువారికి లొంగి ఉండవలసివచ్చుట అందరు ఎరిగినదే. కోదండరామయ్యగారు మిక్కిలి ఆడంబరప్రియుడగుటచేతను తండ్రి కోటయ్యగారికి ఆయన జరిగించుపనులు కొన్ని యిష్టములేకున్నను తనమాటకు చెల్లుబడి లేదని యూరకుండుటచేతను వియ్యాలవారికంటె తాము పై చెయ్యి అనిపించుకొనవలెనని తరలిపోవుటకు గొప్పప్రయత్నములు గావించెను. ఊరిలోని ఆసాములు బండ్ల నన్నింటిని చేర్చి, బండి కొక్కరిని కూర్చుండబెట్టి ప్రయాణముసాగించెను. ముందుగా తనక్రింద నున్న సాహెబులను పంపి గ్రామములలో ఫలానివారు పెండ్లికి తరలిపోవుచున్నారని దండోరావేయించి మధ్య నొకటిరెండు గ్రామములలో నూరివెలుపల బాగుచేయించి వీరు బండ్లతో వచ్చునప్పటికి ఎద్దులకుమేత, నీళ్లు సిద్ధముచేయించి డేరాను పాతించి, వంటలుచేసుకొనుటకు వసతులుమొదలగు నేర్పాట్లు గావించెను. కోదండరామయ్యగారు గుఱ్ఱమునెక్కి ముందు బోవుచుండ వెనుకనుండి మంగళవాద్యములతో పెండ్లి కొడుకు కెక్కిన మేనా, పిమ్మట ఆడవారెక్కిన పెట్టెబండి, దాని వెనుక ఊరివారివలన కట్టించిన రెండెద్దులబండ్లును వరుసగా గ్రామములగుండ మెల్లమెల్లగ ప్రయాణముచేయుచు మధ్య వసతు లమర్చిన గ్రామములలో బసచేయుచు ఉప్పుటూరు అట్టహాసములతో చేరిరి. బెండపూడివారు సంపన్నులైనను ఇంత ఆడంబరములు, అట్టహాసములకు నభ్యాసపడినవారు కారు. అయినను వీరికి ఏవిధమైన లోపము జరుగకుండ చక్కని యేర్పా

టులుగావించి సిద్ధముగా నుండిరిగాన వివాహము చక్కగనే జరిగిపోయెను.

ఇట్లు కొంతకాలము జరిగినపిమ్మట వీరికి కొన్ని వ్యవహారపు జిక్కులు సంభవించినవి. గాజుల లక్ష్మీనరసింహచెట్టిగారు వీరిమీద నలుబదివేలరూపాయలకు మదరాసు హైకోర్టులో దావా తెచ్చి డిక్రీపొందినారు. వీరు దానిని తప్పించుకొనుటకు కొన్ని అవకతవకపనులు గావించినారు. తండ్రికొడుకులు విడిపోయినట్లు ఏర్పరచి, కోదండరామయ్యగారివంతుకు వచ్చిన ఆస్తిలో కొన్నిభూము లితరులకు విక్రయాదులు జరిపించిరి. కొన్ని తనమామగారిపేరనే వ్రాసిరి. కొన్ని డిక్రీబాకీక్రింద అమ్మకమైపోయినవి. ఇట్లు భీభత్సమైనకాలముననే కోటయ్యగారు మృతినొందిరి. జప్తుతెచ్చిన కోర్టుజవానును కొట్టినట్లు కోదండరామయ్యగారిపై క్రిమినల్ ఛార్జి వచ్చి అందులో సుమారు నెలరోజులు శిక్షబడుట సంభవించినది. జైలునుండి విడుదలయై వచ్చినతోడనే పక్షవాతమునలన మంచమెక్కి, అట్లు కొలదిసంవత్సరములు జీవించి, కోదండరామయ్యగారు మరణము నొందిరి. అంతకుముందు చాలకాలమునుండియు ఆయన మామగారితండ్రిగారికుటుంబము వీరియింటిలోనే వీరిపోషణలోనే యుండిరి. ఆయనబావమరది సీతారామయ్య వ్యవహారదక్షుడై యింటి వ్యవహారముల బాధ్యత వహించి పనులు నడిపించుచుండెను. నా పెండ్లిసంబంధమును కుదుర్చుకొనుటకు మాయింటికి వచ్చినది యీ సీతారామయ్యగారే. నాపెండ్లినాటికి మా అత్తవారికి ఉన్న ఏడరకలవ్యవసాయమును ఈయనే నడిపించుచుండెను.

కాని ఋణములు కొన్ని యింకను బాధించుచుండెను. మీదు మిక్కిలి సీతారామయ్యగారి తల్లిదండ్రులును, అక్కచెల్లెండ్రును యీఆదాయమువలననే జీవించుచుండిరి. కావున భూములవల్ల వచ్చు ఆదాయముతో ఋణముతీర్చుమార్గము కనబడకుండెను. కుటుంబ మింకను కొంత అట్టహాసముతో కనబడినను నిజముగ నానాట క్షీణదశకు వచ్చుచుండెను. ఈసమయమునందే పిల్లకు వివాహమును పిల్లవానికి ఉపనయనమును జరిపిరి. మొట్టమొదట తిరుపతివెళ్లవలెనని అనుకొనిరిగాని ఏదియో యిబ్బందివలన ఆప్రయత్నము మాని, వివాహమునకు ముందురోజు కొండకు నడచినట్లు మంగళవాద్యములతో మమ్ము నిర్వురను ఊరివెలు పల కొంచెక దూరముననున్న మఱ్ఱిచెట్లవరకు నడిపించుకొనివెళ్లి యింటికివచ్చి, వేంకటేశ్వరపూజచేసి మరియొకప్పుడు కొండకు వచ్చెదమని మ్రొక్కుకొని సమారాధన గావించిరి. మరుసటినాడు పిల్లవాని ఉపనయనముచేసి ఆమరునాడు వివాహము జరిపిరి పెండ్లికార్యము సాధారణముగనే జరిగిపోయెను. పెండ్లిలో నాకు అయిదుయకరముల మెరకయీనాముభూమిని, రు 100/- ల రొక్కమును, ఒక ఆవుపెయ్యను కన్యాదానసమయమునందు ఇచ్చిరి. ఈదానము లేవియు మాతండ్రిగారు నిర్బంధించినందున ఇచ్చినవిగావు. వారు మనసోత్సాహముతో కుటుంబమర్యాద ననుసరించి యిచ్చినవే. ఈపెండ్లికి మాతండ్రిగారు మూడువందలు మాత్రమే వ్యయపఱచినారు. నావివాహము సర్వజిన్నామసంవ త్సర శ్రావణశుద్ధమునందు జరిగినది. వివాహానంతరము కొన్ని రోజులకు లింగముగుంటనుండియే చెన్నపట్టణము చేరి కళాశా లలో చదువనారంభించితిని. గృహప్రవేశము జరుపుటకు అవకా

శము లేకపోయినది. అప్పుడు లింగమగుంటనుంచి మరియొకరిని తోడుతీసికొని కొత్తపట్టణముదగ్గర చెన్నపట్టణముకాలువమీద పడవనెక్కి వారమురోజులలోపలనే చెన్నపట్టణము చేరితిని. నాభార్య కప్పుడు పండ్రెండవయేడు. చామనచాయరూపము. మిక్కిలి పలచగానుండెను. తెలుగు కొద్దిగా చదువను వ్రాయను మాత్రమే నేర్చియుండెను. నేను బి. ఏ. సీనియరులో చదువుచుండగానే వేసవి సెలవులలో నాకు కార్యముజరిపిరి. పిమ్మట చెన్నపట్టణముచేరి యథాప్రకారము చదువుసాగించుచుంటిని.

## పట్నవాసము

మేము చెన్నపట్నములో విద్యార్థివసతిగృహము ప్రారంభించినపిమ్మట కొన్నాళ్ళకు ఆగృహములోని విద్యార్థులము కొందరము కలసి డిబేటింగుసొసైటిని స్థాపించి, అందు ప్రతి ఆదివారమును ఏదో ఒకవిషయమును చర్చించుచుంటిమి. ఆచర్చలు ఆంగ్లేయభాషలోనే జరుపుచుంటిమి. ఒకప్పుడు ఇంగ్లీషులో వ్యాసములువ్రాసి చదువుటయు జరుగుచుండెను. ఆచర్చలలోను, ఉపన్యాసములలోను నాకు ఒకకొంచెము ప్రవీణత యున్నట్లు కొందరు విద్యార్థులు చెప్పుకొనుచుండిరి. ఇట్లు జరుగుచుండ నొకనాడు షేక్స్పియర్ వ్రాసిన "జూలియస్ సీజరు" నాటకములో నొకటి రెండు ప్రధానాంకములు ప్రదర్శింపవలెనని నిర్ణయించి బ్రూటసుపాత్ర హనుమంతిరావుకు, కాసియస్ పాత్ర నాకు నిచ్చిరి. ఆప్రదర్శనమున కాసియస్పాత్ర అందరికంటె బాగుగ నున్నదని చెప్పుకొనిరి. నన్ను సుశిక్షితుడగు

నటకుడని శ్లాఘించిరి. నా చిన్ననాటి నాటకముల అనుభవము ఆనా డుపయోగించెననుట స్పష్టమే. పిమ్మటి కాలములో న్యాయవాదవృత్తియందు న్యాయమూర్తియెదుట నా కక్షిదారునిపక్షమున సభాకంపములేక వాదించుటలో సయితము ఈ అనుభవము కొంత యుపకరించెను.

బి. ఏ. సీనియర్‌లో చదువుచుండగా నొక శనివారము నాటి సాయంకాలము తంబుచెట్టి, లింగిచెట్టివీధులలో విద్యార్థులు గుంపులుగూడి గొప్పయుపద్రవము సంప్రాప్తమైనట్లు కేకలు వేయుచు తిరుగనారంభించిరి. కారణము విచారించగా మా కళాశాలవిద్యార్థియగు ముట్నూరి సుబ్రహ్మణ్యము అనువానిని క్రైస్తవమతములో మరునాటి ఉదయముననే కలుపుకొనబోవుచున్నారు గావున దానిని ఆపివేయుటకే ఈసంరంభమని తెలిసినది. నేను హనుమంతరావును ఆగుంపులతో కలుసుకొని ఒకయింట సభగాజేరి కొంత చర్చించుకొన్నపిమ్మట ఆచిన్నవాడు రాయపురమున ప్రొఫెసర్ రే అను మిషనరీయింట ఉన్నట్లు తెలిసినది. అప్పుడు మాలో కొందరిని ఆ మిషనరీతో మాట్లాడుటకు, మతప్రవేశము నాపుటకు, ఆపి, బందరులో అతని బంధువుల కది తెలుపుటకు నియమించిరి. అందు హనుమంతరావును నేనుగూడ నియుక్తుల మైతిమి. మేము ఆరాత్రి రే దొర యింటికి బోయి ఆయనతో ముచ్చటించగా అతనిని మరునాడు మతములో కలుపుకొనవలెనను ఆలోచనయేమియు లేదనియు అతని బంధువులకు వర్తమానముచేసి పిలిపించవచ్చుననియు, వాగ్దానముచేసెను. అతనికి బ్రాహ్మణహోటలులో భోజనముపెట్టించు

శము లేకపోయినది. అప్పుడు లింగమగుంటనుంచి మరియొకరిని తోడుతీసికొని క్రొత్తపట్టణముదగ్గర చెన్నపట్టణముకాలువమీద పడవనెక్కి వారమురోజులలోపలనే చెన్నపట్టణము చేరితిని. నాభార్య కప్పుడు పండ్రెండవయేడు. చామనచాయరూపము. మిక్కిలి పలచగానుండెను. తెలుగు కొద్దిగా చదువను వ్రాయను మాత్రమే నేర్చియుండెను. నేను బి. ఏ. సీనియరులో చదువు చుండగానే వేసవి సెలవులలో నాకు కార్యముజరిపిరి. పిమ్మట చెన్నపట్టణముచేరి యథాప్రకారము చదువుసాగించుచుంటిని.

## పట్నవాసము

మేము చెన్నపట్నములో విద్యార్థివసతిగృహము ప్రారంభించినపిమ్మట కొన్నాళ్ళకు ఆగృహములోని విద్యార్థులము కొందరము కలసి డిబేటింగుసొసైటిని స్థాపించి, అందు ప్రతి ఆదివారమును ఏదో ఒకవిషయమును చర్చించుచుంటిమి. ఆచర్చలు ఆంగ్లేయభాషలోనే జరుపుచుంటిమి. ఒకప్పుడు ఇంగ్లీషులో వ్యాసములువ్రాసి చదువుటయు జరుగుచుండెను. ఆచర్చలలోను, ఉపన్యాసములలోను నాకు ఒకకొంచెము ప్రవీణత యున్నట్లు కొందరు విద్యార్థులు చెప్పుకొనుచుండిరి. ఇట్లు జరుగుచుండ నొకనాడు షేక్స్పియర్ వ్రాసిన "జూలియస్ సీజరు" నాటకములో నొకటి రెండు ప్రధానాంకములు ప్రదర్శింపవలె నని నిర్ణయించి బ్రూటసుపాత్ర హనుమంతరావుకు, కాసియస్ పాత్ర నాకు నిచ్చిరి. ఆప్రదర్శనమున కాసియస్పాత్ర అందరి కంటె బాగుగ నున్నదని చెప్పుకొనిరి. నన్ను సుశిక్షితుడగు

నటకుడని శ్లాఘించిరి. నా చిన్ననాటి నాటకముల అనుభవము ఆనా డుపయోగించెననుట స్పష్టమే. పిమ్మటి కాలములో న్యాయవాదవృత్తియందు న్యాయమూర్తియెదుట నా కక్షిదారునిపక్షమున సభాకంపములేక వాదించుటలో నయితము ఈ అనుభవము కొంత యుపకరించెను.

బి. ఏ. సీనియర్‌లో చదువుచుండగా నొక శనివారము నాటి సాయంకాలము తంబుచెట్టి, లింగిచెట్టివీధులలో విద్యార్థులు గుంపులుగూడి గొప్పయుపద్రవము సంప్రాప్తమైనట్లు కేకలు వేయుచు తిరుగనారంభించిరి. కారణము విచారించగా మా కళాశాలవిద్యార్థియగు ముట్నూరి సుబ్రహ్మణ్యము అనువానిని క్రైస్తవమతములో మరునాటి ఉదయముననే కలుపుకొనబోవుచున్నారు గావున దానిని ఆపివేయుటకే ఈసంరంభమని తెలిసినది. నేనును హనుమంతరావును ఆగుంపులతో కలుసుకొని ఒకయింట సభగాజేరి కొంత చర్చించుకొన్నపిమ్మట ఆచిన్నవాడు రాయపురమున ప్రొఫెసర్ రే అను మిషనరీయింట ఉన్నట్లు తెలిసినది. అప్పుడు మాలో కొందరిని ఆ మిషనరీతో మాట్లాడుటకు, మతప్రవేశము నాపుటకు, ఆపి, బందరులో అతని బంధువుల కది తెలుపుటకు నియమించిరి. అందు హనుమంతరావును నేనుగూడ నియుక్తుల మైతిమి. మేము ఆరాత్రి రే దొర యింటికి బోయి ఆయనతో ముచ్చటించగా అతనిని మరునాడు మతములో కలుపుకొనవలెనను ఆలోచనయేమియు లేదనియు అతని బంధువులకు వర్తమానముచేసి పిలిపించవచ్చుననియు, వాగ్దానముచేసెను. ఆతనికి బ్రాహ్మణహోటలులో భోజనముపెట్టించు

చున్నామని తమయింటిలో నన్నుము పెట్టుటలేదనికూడ స్పష్టముగ చెప్పెను.

రెండుమూడు రోజులకు సుబ్రహ్మణ్యముతల్లియును, భార్యయును అతనిని కలుసుకొనుటతో క్రైస్తవమతములో కలియుట మానుకొని బందరుకు వెడలిపోయెను. ఈ యాందోళన మింకను చల్లారకుండగనే ఒకనాటి మధ్యాహ్నము కళాశాలలో జూనియర్ ఎఫ్. ఏ. క్లాసులో ప్రొఫెసర్ రివరెండు లాయిడ్ అనునతడు బైబిల్ పాఠము చెప్పుసమయమున తనబూటుకాలెత్తి మీరు విగ్రహమును పూజించుటకన్న నాబూటును పూజించవచ్చునని మిక్కిలినీచముగ బల్కెనట. అంతట ఆక్లాసులోని ఇన్నూరువిద్యార్థులును మిక్కిలి కోపముతో కేకలు వేయుచు బల్లలను బిగ్గరగ కొట్టుచు కల్లోలముగావించుచుండిరి. ఇంతలో మధ్యాహ్నము టిఫిన్‌గంట కొట్టబడెను. ఆ ప్రొఫెసర్ లేచిపోయెను. విద్యార్థులును తొందరగగ పరుపులిడుచు అతని వెంట బడిరి. ఆయన తప్పించుకొని ఉపాధ్యాయులగదిలో ప్రవేశించెను. ఆసమయమున మా ఫిలాసఫీ లెక్చరరు రివరెండు డాక్టరు కూపర్‌గారు పాఠముచెప్పుచుండిరి. మేము ఆతురతతో లేచి, వెలుపలకు బోవుచున్న తక్కినవిద్యార్థులతో కలుసుకొంటిమి. ఇట్లే కాలేజీలోను హైస్కూలులో నుండు విద్యార్థులందరును చేరి, జరిగినవిషయమును విని, హిందూమతమునకు గావింపబడిన అవమానమునకు సంతాపమునొందుచు కళాశాల సమీపమున ఆవీధిలోని కపాలేశ్వరస్వామి కోవెలముందు స్వామివారి ఉత్సవములనిమిత్తము అప్పుడే క్రొత్తగా వేయబడిన పెద్ద

కొఠాయిలో జేరి సభగావించి, అందులో కొందరు ప్రొఫెసర్ లాయిడ్ అవినీతివాక్కులను అందువలన కలిగిన అవమానమును ఖండించుచు ఉపన్యాసము లిచ్చినపిమ్మట ప్రొఫెసర్‌లాయిడ్‌చేసిన దుర్భాషణనుగూర్చి తగినచర్య ఆయనపై చేయువరకును మేము కళాశాలకు రాకుండ సమ్మెకట్టుటకు నిర్ణయించుకొంటిమి అని తీర్మానించి ఆతీర్మానమును కళాశాలాధికారులకు అందచేసితిమి.

అందుపై కళాశాల సిండికేటు సమావేశమై విద్యార్థు లిట్టి తిరస్కారభావమును బూనియున్నందున వారి తీరుమానము విచారింపబడదని వ్రాతమూలకముగ మాకు తెలియజేసెను. ఇట్లు మాసమ్మె పదిదినములు సాగినది. క్రైస్తవవిద్యార్థులు తప్ప తక్కిన విద్యార్థులెవ్వరును కళాశాలకుగాని హైస్కూలుకుగాని పోలేదు. ప్రతిదినము ఉదయముమొదలు సాయంత్రము చీకటిబడువరకు సభ జరుగుచునేయుండెను. చెన్నపట్టణములోని కొందరు హిందూసంఘపుబెద్దలు సయితము మాసభకు వచ్చి క్రైస్తవకళాశాలవారును మిషనరీలును హిందూమతమును నాశనముచేయగోరుచున్నారనియు వారుచేయు అవమానములు భరింపరానివనియు విద్యార్థులు గావించిన సమ్మె క్రమమైన దనియు మమ్ము ప్రోత్సహించుచుండిరి. అప్పుడు చెన్నపట్టణములో ఎఫ్. ఏ. చదువుచున్న శ్రీ వల్లూరు సూర్యనారాయణ రావుగారు ఒకరోజున మాసభకు వచ్చి, మిక్కిలి ఆవేశపూరితులై కళాశాలాధికారులను ప్రొఫెసర్ లాయిడ్‌ను విమర్శించుచు దీర్ఘముగ ఉపన్యసించిరి. హిందూపత్రికా కార్యాలయములోని కొందరు ఉపసంపాదకులును అటులనే ఉపన్యసించుచుండిరి. మద్రాసు మెయిలుపత్రిక క్రైస్తవకళాశాలపై పూర్వమునుండి

తనకున్న వైషమ్యబుద్ధిని వెలిబుచ్చుచు సమ్మెజరిగినందుకు కళాశాలాధికారుల అసమర్థతను విమర్శించుచు ప్రతిదినమును ఏదో ఒకవ్యాసము వ్రాయుచు, మిషనరీ సంఘములవారు క్రైస్తవకళాశాలకు చేయుచున్న ద్రవ్యసహాయము వ్యర్థమని చాటింపసాగెను.

ఈసమయమున కళాశాలాప్రిన్సుపాల్ డాక్టరు మిల్లరుగారు వారి స్వదేశమగు స్కాట్లండునకు సెలవుమీద పోయియుండెను. రివరెండు డాక్టరు కూపరు అను అతిశాంతపురుషుడు కేవల ఋషితుల్యుడు ప్రిన్సిపాల్‌గా నుండిరి. వీరు ఆరోజులలో అప్పు డప్పుడు మావిద్యార్థివసతిగృహమునకు వచ్చి, ఈసమ్మె పనికిరా దని చెప్పుచుండిరి. లాయడ్‌గారి అవమానకరమగు దుర్భాషణను గురించి చెప్పగా "గోరంతలు కొండంతగా చేయుచున్నా" రని చెప్పి, మమ్ము సమాధానపరుప యత్నించుచుండెను.

ఇట్లు పదిరోజులు జరుగునప్పటికి మాకును త్రోవ యేదియు దొరకకుండెను. గా. ఆనందాచార్యులవారు, హైకోర్టు వకీలు కాంగ్రెస్‌మహాసభకు అధ్యక్షతవహించినవారు గలరు. క్రైస్తవకళాశాలలో పూర్వము వారు చదివికొనిరి. మరియును వారు గవర్నరుజనరల్‌గారి (Executive Council) కార్యాచరణ సలహాసంఘములో సభ్యులు. ఈయన మాసమ్మె పదియవనాడు మాసభకు వచ్చి, తాను కళాశాలాధికారులతో మాట్లాడితి మనియు, ఇక నెప్పుడును హిందూమతమునుగురించి యెట్టి దుర్భాషలుగాని ఆడకుండ కట్టుబాటుచేయుదుమని తమతో

వారు గట్టిగా చెప్పిరనియు, గావున నింతట సమ్మె చాలించి బడికి పోవుట మంచిదనియు లేకున్న చదువునకు భంగముకలుగునుగాన విద్యార్థులకే నష్టమనియు ఎంతవారైనను ఒకప్పుడు తప్పులు చేయుదురు గనుక వారిపై కాఠిన్యము వహించుట సరికాదనియు, ఎట్లయిన వారు విద్యాగురువులు మీరు విద్యార్థులను విషయము మరువవలదనియు శాంతముగా మాకు నచ్చజెప్పుటతో మేము సమ్మెమానుటకు నిశ్చయించుకొంటిమి.

ఆనాడు మా బి. ఏ. సీనియర్ క్లాసుకు ఏదో పరీక్ష ప్రారంభముకాబట్టి మేము పెద్దహాలులో కూరుచుండి పరీక్షా ప్రశ్నలను చదువుకొనుచుండగనే అప్పుడప్పుడె అచ్చువేసిన చిన్న కరపత్రమొకటి మాలో పదుగురకు అందిచ్చిరి అందు "నీవు సమ్మెకు ప్రధాననాయకులలో నొకడవుగా నున్నట్లు మాకు స్పష్టమైనది గనుక పదిరూపాయలు జరిమానావిధించబడినది. ఈ జరిమానా చెల్లించనియెడల నిన్నుగురించి విశ్వవిద్యాలయాధికారులకు తెలిపి పరీక్షలలో చేర్చుకొనకుండ నిషేధపుటుత్తరువు తెప్పించబడు"నని వ్రాయబడియుండెను. దీనినిబట్టి కష్టసుఖముల నాలోచించుకొంటిమి. అప్పుడు క్లాసులోజరుగు పరీక్షకు గూడ హాజరగుటకు అవకాశము లేదనిరి. మాలో గురుస్వామి, రామచంద్రన్ అనువారిర్వురుమాత్రము సంస్కృతవిద్యార్థులగుటచేత వారు కలకత్తాలో చదువ నిశ్చయించుకొని జరిమానా చెల్లించలేదు. నేను, హనుమంతరావును తెలుగువిద్యార్థులము. బి. ఏ. పరీక్షలో తెలుగు మాకు రెండవభాష, తెలుగులోనే పరీక్ష ఇయ్యవలసియున్నది. మరి యే యితరవిశ్వవిద్యాలయ

ములలోను తెలుగునకు స్థానములేదనియు బి. ఏ. పరీక్ష కొలది దినములలో జరుగనున్నదిగావున దీనిని వదలి, మరల సంస్కృతమును చదువుటకు మొదలుపెట్టి ఇన్నిసంవత్సరములు చదివినదంతయు వ్యర్థపరచుకొనుట దుర్భరమగు కాలహరణమునకు, దుస్సహమగు ద్రవ్యనష్టమునకును గారణమగుననియు తలంచి అవమానమునకు లోనై జరిమానాసొమ్ము పదిరూపాయలను చెల్లించితిమి. ఈసమ్మె చల్లారినపిమ్మట నన్ను, హనుమంతరావునుగూడ విద్యార్థివసతిగృహమును విడిచివెళ్ళవలసినదని ఉత్తరువుచేసిరి. అవి బి. ఏ. పరీక్ష సమీపించురోజులు. మేము ఉండుటకు తగినస్థలము దొరకుట దుస్తరముగానుండెను. కాని దైవానుగ్రహమువలన విద్యార్థివసతిగృహమునకు ప్రక్కనున్న తంబుచెట్టిగారియింటిలో నొకహాలు అద్దెకు గుదిరినది. హాలులో సోఫాలు, చలవరాళ్ళబల్లలు, పటములు ఛాండిలియరులు మొదలగు విలువగలిగినవస్తువులు రమణీయముగ నమర్చబడియుండెను. అవి యన్నియు నందుండగనే మాకు నెలకు రు 2/- లకు మాత్రమే అద్దెకిచ్చిరి. ఆయింటివారినిబట్టియే ఆవీథికి పేరు వచ్చినది. వారు ఒకప్పుడు ప్రసిద్ధులయ్యు అప్పటికి హీనస్థితి లోనికి వచ్చియుండిరి. కాని యిల్లు అద్దెకిచ్చినారని యితరులకు తెలియుట గౌరవహానిగా నెంచి, మాకు అతిరహస్యముగ అద్దెకిచ్చిరి. మరికొందరు ఆంధ్రవిద్యార్థులును మాతో చేరిరి. కొలది రోజులలో నామేడ అంతయు విద్యార్థులతో నిండిపోయెను. ఇట్లు చదువుకొనుటకును నివసించుటకును మంచివసతి దొరకినందున సంతసించితిమి. మిల్లరుగారి వసతిగృహమునుండి వెడలగొట్టబడినకొరత మా కేమియును లేకుండెను. భోజనమునకు

రామలింగయ్యయను తెలుగుబ్రాహ్మణుడు పెట్టిన హోటలులో ఏర్పరచుకొంటిమి గాన తెలుగు భోజనముగూడ సమకూడెను.

ఇంతలో డాక్టరు మిల్లరుగారు మరల చెన్నపట్టణము వచ్చి కళాశాలాధ్యక్షతను బూనెను. సమ్మెవిషయము ఆయ నకు మిక్కిలి పరితాపము కల్గించెను. అందుచే ఆసమ్మెలో పాల్గొనిన కొందరు ముఖ్యులను పిలిపించి జరిగిన వృత్తాంతమును సావధానముగ చెప్పవలసినదని కోరిరి. నేను జరిగినదంతయు చెప్పి తిని. "ఒకకంటితో మిమ్ముచూచుచున్నంతవరకు మీరు చక్కగనే ప్రవర్తించుచుందురు. చూచువారు లేనప్పుడు మీరు త్రోవ తప్పుదురు. అదిగాక స్వభావము,నడవడి(Character and Conduct) వీని రెంటికినిగల తారతమ్యమును ఎవ్వరును సాధారణముగ గ్రహించరు. మనుజునిస్వభావము మారునది గాదు. నడవడిని మాత్రము ముఖ్యముగ దిద్దుకొనుచుండవలెను. నడవడి అప్ప టప్పటికి మారుచుండును" అనుచు, లాయిడ్‌గారి ఆనాటి వర్తనముగూర్చి ఏమియు అనక మిక్కిలి ఆదరముతో ముచ్చ టించెను. తుదకు సంభాషణ ముగించుచు, ఇంతవరకును మిమ్ము నాబాలకులారా (my boys) యని పిలుచుచుంటిని. ఇకముందు నా బిడ్డలారా (my Children) అని పిలచెదనని వాక్రుచ్చి, నన్ను దగ్గరకు బిలిచి నాచెంపమీద తన యరచేతితో నెమ్మదిగ కొట్టి నవ్వుచు మమ్ము నందర వెళ్ళిపొమ్మని ఆనతిచ్చెను. మేము ఆయన ఔదార్యమును మెచ్చుకొని వారే ఆసమయమున నుండిన ఇంత జరిగియుండదని అనుకొంటిమి. పిమ్మట కొలది కాలమునకు బి. ఏ. పరీక్షలు గడచినవి. అందు నేనును హనుమంతరావును సెకండుక్లాసులో కృతార్థులమైతిమి.

అప్పుడు బి. ఎల్. మూడుసంవత్సరములు చదువవలసి యుండెను. బి. ఏ. చదువుచుండగనే బి. ఎల్. లోగూడ చేరి చదువుటకు అవకాశముండెను. గాన ఒకసంవత్సరము కలిసివచ్చు నను తాత్పర్యముతో బి. ఏ. సీనియరుచదువుచుండగనే బి. ఎల్. లో చేరితిని. అపుడు సముద్రపుటొడ్డున మెరీనాయెదుట ప్రెసి డెన్సికాలేజీలో బి. ఎల్. క్లాసులు పెట్టుచుండిరి. అందుకు హైకోర్టులాయర్లు ఉపన్యాసకర్తలుగనుండిరి. విద్యార్థులు హాజరై నట్లు క్లాసువెలుపల రిజిష్టరులో దస్కతుచేయుటమాత్రమే కాని మేము క్లాసుకు హాజరైనది లేనిది విచారించు వా రెవ్వరును లేకుండిరి. ఓపిక ఉన్నంతవరకు శ్రద్ధగలవారు వినుచుండెడివారు. లేనివారు క్లాసులోనికి రాకుండనే రిజిష్టరులో దస్కతుచేసి వెలు పల మెరీనాలో షికారుచేయుచుండెడివారు. సామాన్యముగ సాయంకాలము 5 గంటలకు పిమ్మటనే ఈక్లాసులు జరుగుచుం డుటచేత క్రైస్తవకళాశాలలో క్లాసులు ముగిసినతర్వాత అచ్చ టికి పోవుటకు అవకాశముండెను. సామాన్యముగ కాలినడకను బోవుచుండెడివారము. హనుమంతరావు బి. ఎల్. లో నావలె చేరలేదు. నేనైననూ బి. ఎల్. లో చేరితినన్న మాటయే కాని చదువు పూజ్యమే. బి. ఏ. చదివి అది పూర్తిచేయుటకే శ్రద్ధ వహించి, అందు తీర్ణుడనైతిని. కానిమొదటిసంవత్సరము బి. ఎల్. చదువనికారణమున బి. ఎల్. పరీక్షకు ముమ్మారు బోయి మూడవసారి కృతార్థుడనగుట సంభవించెను. హనుమంతరావు చదువుకాలమునకు బి. ఎల్. రెండుసంవత్సరములుమాత్రమే చదువవచ్చునని నిర్ణయమయ్యెను. అతడు రెండవయేట తప్పి పోయెను. కావున నాతోపాటుగనే కృతార్థుడయ్యెను.

హనుమంతరావు బి. ఎల్. మొదటిసారి తప్పినపిమ్మట గుంటూరు హైస్కూలులో ఉపాధ్యాయుడుగా ప్రవేశించి కాలముజరుపుచుండెను. నా కీమధ్యనే కార్యమైనందునను మా యత్తవారి కుటుంబవిషయములు నేను విచారించవలసివచ్చినందు నను లింగమగుంటలో ఎక్కువకాలము గడపుట సంభవించినది. ఇందువల్ల నా బి. ఎల్. చదువుగూడ కొంత భంగమైనదని చెప్పనచ్చును.

## కాంగ్రెసు - దివ్యజ్ఞానము

నేను బి. ఏ. జూనియర్ చదువుచుండగనే భారత దేశీయ మహాసభ (Indian National Congress) మూడవసమావేశము 1887 డిసెంబరులో చెన్నపట్టణములో జరిగినది. అప్పుడు నేనును, హనుమంతరావును ఐచ్ఛికభటులుగా పనిచేసితిమి. ఆసభకు డబ్లియు. సి. బెనర్జి యను వంగదేశీయుడు, బారిస్టరు అధ్యక్షుడుగా నుండెను. ఆజానుబాహువిగ్రహము; పెద్ద గడ్డము ఆయనవక్షస్థలమున వ్రేలాడుచుండెను. ఆయన కంఠధ్వని మేఘగర్జనమువలె నతిదూరము వినబడుచుండెను. ఆసభకు సురేంద్రనాథబెనర్జి యను ప్రసిద్ధవక్తగూడ వచ్చియుండెను. శ్రీ గోపాలకృష్ణగోఖలేగారును, మహాదేవ గోవిందరణడేగారును ఆసభకు హాజరైరి. వారు ప్రత్యేకముగ విషయములనుగూర్చి యోచనలుచేయుచుండిరి. తిలక్‌గారు రాలేదు. పండిత మదన మోహనమాలవీయ, బాబూ బిపినచంద్రపాలును యువకులుగా

నుండిరి. వీ రిద్దరు కాంగ్రెస్‌లో ప్రథమముగా నుపన్యాసముల నిచ్చి సభాసదుల మెప్పించిరి. దేశప్రభుత్వమునందు ప్రజాప్రాతినిధ్యముండవలెననియు, శాసనసభలలోను, మునిసిపాలిటీలు, జిల్లాబోర్డులు, తాలూకాబోర్డులలోను ప్రజలప్రతినిధులు చేరవలెననియు, వీరికి పరిపాలనాబాధ్యత నొసగవలెననియు దీర్ఘోపన్యాసములనొసంగిరి. జాతీయమహాసభాపతాకము విప్పారినదనియు దానిపై ప్రాతినిధ్య మను పదము స్వర్ణాక్షరములతో లిఖింపబడినదనియు గంభీరముగ వచింపుటతోడనే సభాసదులు పులకాంకితులైరి. కరతలధ్వానములు మిన్నుముట్టెను. అప్పటికి దేశపరిపాలనలో ప్రజాప్రాతినిధ్యము కోరుటయే గొప్పవిశేషము. ఆసభలో మరియొకవిషయము చర్చించబడెను. చెన్నపట్టణములో హైకోర్టులో న్యాయవాదిగా పనిచేయుచున్న ఎడల్జినార్టన్ అను సుప్రసిద్ధ ఆంగ్లేయు డొక ఆంగ్లేయస్త్రీతో అవినీతిగ ప్రవర్తించి ఆమెభర్తనుండి వివాహబంధవిచ్ఛేదమును హైకోర్టుద్వారా సంపాదించి, తాను, ఆమెను వివాహముచేసుకొనకయే ఆమెతో కలసి నివసించుచు ఈజాతీయమహాసభకు ఆమెతోహాజరయ్యెను. అట్టి అవినీతిపరులను జాతీయమహాసభలోపాల్గొననియ్యవచ్చునా యను చర్చ తలయెత్తెను. ఈమహాసభలో సభ్యుల సంసారిక జీవితములందలి నీతిధర్మములను విచారించుట తగదనియు, ఏది నీతియో, ఏది అవినీతియో విచారించి తేల్చుటకష్టమనియు, గాన అట్టి నిషేధమును ఈమహాసభ చేయజాలదనియు స్పష్టపరచబడెను. అంతట ఆసభకు వచ్చియుండిన తీవ్రనీతివాదులగు (Puritans), శ్రీ వెంకటరత్నంనాయుడు ఎం. ఏ. మొదలగువారు సభనుండి వెడలిపోయిరి.

గోక్లే మొదలగు ముఖ్యులుతప్ప సభ్యులలో పలువురు మహాసభాకార్యక్రమము వినోదముగ భావించుచు వక్తల యుపన్యాసముల పదగాంభీర్యము, భావౌన్నత్యము, తర్కశుద్ధి, తీవ్రత మొదలగు విశేషముల నెన్నుచుండిరి. కాంగ్రెసుకార్య భారముగాని బాధ్యతలుగాని వారికి పట్టలేదనియే చెప్పవచ్చును. ఒకరోజు మధ్యాహ్నము అట్టివా రందరును గూడి చెన్నపురిలో ప్రసిద్ధురాలగు కళ్యాణంతురాలిని పిలిపించి ఆమెచే పాటలు పాడించి, అభినయముజరిపించి తమ రసికత్వమును వెల్లడించిరి.

మూడురోజులు సభాకార్యములు నడచినవి. నాల్గవనా డుదయమున నిదురలేచునప్పటికి అందరును వెడలిపోయిరి. ఈ మహాసభాకార్యక్రమమును అందు పాల్గొనిన దేశభక్తుల స్వరూపములును మా హృదయములందు నూతనోత్సాహము గల్పించినవి. అట్టిసభలో మాచేతనైన సేవచేయుటకు అవకాశము కలిగెనుగదా యని ఆనందము నొందితిమి. ఇట్లు 1887 వ సంవత్సరములో మొట్టమొదట కాంగ్రెసుమహాసభతో నాకు సంబంధము చేకూరెను.

చెన్నపట్టణము పెద్దది యగుటవలన మా కళాశాలకు సమీపమున నున్న లింగిచెట్టితంబుచెట్టివీధులును, ఆర్మినియన్ చర్చివీధి ఘోషమ్ముబ్రాడ్ వే నైనాలంగళ్ళు పచియప్పకళాశాల చిల్లరసామానులు (Second hand) చౌకగా దొరకెడి ఈవినింగు బజారు సెంట్రల్ రైలుస్టేషనులు గాక తక్కిన తిరువళ్ళికేణి, మైలాపురము,అడయారు,ఎగ్మూరు,నుంగంబాకం, రాయపురము,

తిండియారుపేట మొదలగునవి మాకు అపరిచితములుగనే యుండెను. తిరువళ్ళిక్కేణిలో రెంటాల వెంకటసుబ్బారావుగారు హైకోర్టు వకీలుగానుండి వాసముచేయుచుండిరి. తాము ప్రకటించిన గ్రంథముల మూలకముగ ద్రవ్యసముపార్జన దండిగ జేయుచు పేరు ప్రతిష్ఠలు జెందుచుండెను. హైకోర్టు వకీలువృత్తి ఆయనకు నామమాత్రమే. వారిని చూచుటకు నే నప్పుడపుడు పోవుచుంటిని. ఒకటిరెండుసార్లు ఇంటియొద్దనుండి డబ్బు వచ్చుటకు ఆలస్యమైనప్పుడు వారి నడిగితెచ్చుకొని మరల వారికి చెల్లించితిని. ఆయనయందు గురుభావ ముండెను. వారును నాపై ప్రేమగలిగియుండిరి. వీరిస్థితి మిక్కిలి ఉచ్ఛదశలో నున్నపుడు వీరి చెల్లెలికుమార్తెకు సంబంధమునిమిత్తము మేము బసచేసియున్న తంబుచెట్టివీధిలో మాయింటికి వచ్చి, మమ్ము నందరిని కలుసుకొని, అప్పుడు మాతోడనే ఆయింట వాసము చేయుచున్న కాశీనాథుని నాగేశ్వరరావుగారికి ఆపిల్లను ఇచ్చుటకు నిశ్చయించుకొనిరి. అప్పుడు నాగేశ్వరరావు ఎఫ్. ఎ. సీనియర్‌లో చదువుచుండెనని జ్ఞాపకము. అచ్చట నున్న తెలుగు విద్యార్థులము పెండ్లిపెద్దల మైతిమి. వివాహమునకు తిరువళ్ళిక్కేణికి నాగేశ్వరరావును పిలుచుకొనిపోయిరి. మమ్ము నందరిని వివాహమునకు ఆహ్వానముచేసినందున మేము కళ్యాణమహోత్సవము జూచి, మాలో నొక్కడుగా నుండిన నాగేశ్వరరావుకు గొప్ప సంబంధము ఏర్పడినందుకు గర్వపడితిమి. నాగేశ్వరరావు అప్పటినుంచి రెంటాలవారి యింటనే నివసించుచుండెను. ముందు కాలములో నాగేశ్వరరావు ఇంత గొప్పవాడు కాగలడను మాట మా కపుడు తోచలేదు.

ఆదినములలో మేము క్రైస్తవకళాశాలలో చదువుచుండి నప్పుడు, దివాన్ బహద్దూర్ రఘునాథరావుగారు గొప్ప సర్కారు ఉద్యోగములుచేసి ఇందూరు సంస్థానములో దివానుగ కొంత కాలము పనిచేసి, న్యాయవర్తనచేతను, దైవభక్తి మొదలగు నున్నతగుణములచేతను పేరుపొందినవారుగా నుండిరి. ఇంచుక పొట్టిగా నున్నను పచ్చనిదేహకాంతి గలిగి, ధోవతికట్టుకొని పసుపుపచ్చ పట్టులాంగుకోటు తొడిగి, దేశస్థులు చుట్టుకొను తలపాగా చుట్టుకొని మనోజ్ఞమగు స్వరూపముతో దైవభక్తిని గూర్చియు, న్యాయవర్తనమునుగూర్చియు, అండర్సన్‌హాలులో ఉపన్యసించుచుండిరి. వీరియందు మా కెంతయో గౌరవభావము సమకూడెను. వారు ఉపన్యసించుసమయములలో చదివిన

ఓన్నమః పరస్మై పురుషాయ భూయసే, సదుద్భవ
స్థాన నిరోధలీలయా గృహీతశక్తిత్రితయాయ
దేహినామ్ అంతర్భవానుపలక్ష్యవర్త్మనే ॥

యీ శ్లోకము నేను మాటిమాటికి నుచ్చరించుచు, ఇప్పటికిని ప్రతిదినము నా సంధ్యావందనసమయమునందు పఠించుచుందును. వీరికి వీణావాద్యము ప్రియమనియు స్వయముగనే వీణ వాయించుకొని పాడుచు, ఆనందమునొందుచుందురనియు వింటిని. ఇట్టి సచ్చారిత్రులు చిరస్మరణీయులు.

చెన్నపట్టణములో దూరపుబేటలకు బోవలయునన్న సామాన్యజనులకు దేశవాళిపొట్టిగుఱ్ఱములు గట్టిన పెట్టెబండ్లే ఆధారము. ఈబండ్లు భోషాణములవలె నుండి, యిరుకుగా నుండెడివి. నలుగురిని ఒక్కసారి ఎక్కించుకొని పోవుచు, దూర

మును బట్టి బాడుగను తీసుకొనుచుండెడివారు. మేము ఉండెడి భాగమునకు బ్లాకుటౌను అని పేరు. (నల్లవారి బస్తీ యని) ఈపేరు బహుశః తెల్లవారు పెట్టియుందురు. ఈ బ్లాకుటౌను నుండి తిరువళ్ళిక్కేణి పోవుటకు ఒక్కొక్కరికి మూడుఅణాల బాడుగ అని జ్ఞాపకము. అప్పటికింకను ట్రాములు, బస్సులు లేవు. కొన్ని వీధులలో తిరుగునప్పుడు, కొన్ని ఇండ్లకు వెలుపల, ద్వారముదగ్గర, అన్నసత్రము అని వ్రాసినబల్లలు కట్టబడి యుండెను. ఇట్టివి అనేకములు కనబడినందున, అన్నదానము విశేషముగా చేయుదురుకాబోలు అనుకొంటిమి. విచారించగా, అన్నసత్రము లనునవి పూటకూళ్ళని తెలిసినది. మరియు, చెన్న పట్టణములో ఏవస్తువునైనను బేరముచేయుట మిక్కిలి కష్ట ముగానుండెను. వస్తువుధరకు నాలుగురెట్లు అయిదురెట్లు ఎక్కువ వర్తకుడు చెప్పుచుండును. మిక్కిలి తగ్గించి అడిగిన నత డేమనుకొనునో యనియు పట్టణమున ధరలు అతిశయముగా నుండునేమో అనియు దలంచి, అర్ధమో, పావలో తగ్గించి అడిగినప్పుడు "తీసుకొనుడు, మీకుగనుక ఇచ్చుచున్నా"నను ఇచ్చకములు పలికి వస్తువునకు హెచ్చుధర రాబట్టుకొనుచుం డెను. ఈపరిస్థితులు పరిచయమైనపిదప, సగమునకుసగము తగ్గించి ధరయడుగ నేర్చుకొంటిమి. కావుననే చెన్నపట్టణమున బురిడీ (మోసము) మోపని అంతటను వాడుక అయినది. ఇప్పుడు మన తెలుగుదేశమున బస్తీలలో బేరగాం డ్లిట్టిధరలే చెప్పి, తెలియనివారిని మోసగించి హెచ్చుధరలు గుంజుకొను చున్నారు. వర్తకమనిన మోసమే యనుభావము దేశమున వ్యాపించియుండుట శోచనీయము.

మేము చెన్నపట్టణము చదువునిమిత్తము పోవకముందే భారతదేశమున ఆసేతుహిమాచలము కూడ మదాంబ్లావట్స్కీ, కల్నల్ ఆల్ కాట్ గార్లు సంచారముచేసి, భారతీయసంస్కృతిని గూర్చియు, ఆర్యమతసాంప్రదాయములనుగూర్చియు మహోప న్యాసముల నిచ్చుచు ప్రముఖులతో సంభాషణలుగావించు చుండిరి. పాశ్చాత్యవిద్యలపైనను పాశ్చాత్యాచారసాంప్రదా యములందును వ్యామోహము ప్రబలి మన పూర్వపుఔన్నతిని గుర్తెరుంగని భారతీయులందు సంచలనము గల్పించి, భారతదేశ పూర్వచారిత్రమునందును సంస్కృతియందును, అభిమానము నంకురింపజేసిరి. ఒకప్పుడు చెన్నపట్టణములో. కల్నల్ ఆల్కాట్ ఇంగ్లీషులో గావించిన మహోపన్యాసము మహోన్నతహిమా లయశృంగాలనుండి అతివేగముగా దిగబారు గంగాప్రవాహము వలె వీనులవిందై ఆశ్చర్యముగూర్చెను. పదసౌష్ఠవమును ఉదార భావములు నటులుండ మనపూర్వశాస్త్రములు కళలులోనగు వానివివరణలు, యోగశాస్త్రాభ్యాసములవలన మహాపురుషులు పొందిన అద్భుతశక్తులు, మనపూర్వపుఔన్నత్యమును, ఇప్పటి పతనమును వర్ణించుటలో సభ్యులహృదయములు నూతనో త్సాహభరితములయ్యెను. మదామ్ బ్లావట్స్కీ రుషియా దేశపుస్త్రీ యగుటవలన ఆంగ్లేయభాషలో ఉపన్యసింపజాల కుండెను. ఆమె హిమాలయములలో నివాసముచేసి, అద్భుత మైన శక్తులు సమకూర్చుకొనెనని ప్రజలలో గాఢమగు విశ్వాస ముండెను. వారు అడయారులో నెలకొల్పిన దివ్యజ్ఞానసమాజ మను సంస్థ భారతదేశములోనే గాక, లోకమున అనేకదేశము లలో పిమ్మట స్థాపించబడిన దివ్యజ్ఞానసమాజములకు, కేంద్ర

సంస్థగా పరిణమిల్లినది. అడయారులోని కార్యస్థానమునుండి మేడమ్ బ్లావట్స్కీ, దూరదృష్టిదూరశ్రవణపరకాయప్రవేశములు మొదలగు అద్భుతకార్యముల ప్రదర్శించుచుండెననియు, అక్కడ నుండి హిమాలయములలోని కుటీ, హూమీ మొదలగు మహానుభావులతో సంభాషణలుజరుపుచుండెననియు, చెప్పుకొను చుండిరి. కొందరు ఈమె దగ్గర శుశ్రూషచేయనారంభించిరి. థియసాఫికల్ సొసైటీజర్నల్ అను పత్రికలో ఈఅద్భుతచర్యలు ప్రకటితములగుచుండెను. మరియు దివ్యజ్ఞానసమాజము కేవలము ఆర్యమతమునందేగాక ఇస్లాము, క్రైస్తవ, బౌద్ధమతము లలోగూడ ఉదారములు, ఉన్నతములునగు ధర్మములను, ఆశయములను గ్రహించి మన్నించుచుండెను. ఈసమాజము కులభేదములు, జాతిభేదములు పాటింపదు. ఈసమాజమున చేరినంతమాత్రమున వారివారిమతముల విడనాడిన ట్లెంచరాదు. ఇట్లు స్వేచ్ఛాస్వాతంత్ర్యము లున్నకారణమున హిందువులు, క్రైస్తవులు, ముసల్మానులు, బౌద్ధులు, జైనులు మొదలగు పలుమతములవారు ఆసమాజమున సభ్యులుగాచేరిరి. ప్రతి ముఖ్యపట్టణమందును దివ్యజ్ఞానసమాజశాఖలువెలసెను. అందు భాండాగారములు నెలకొల్పిరి. సర్కారుఉద్యోగులు పలువురు ఈసమాజములో జేరిరి. ఇందువలన ఆంగ్లేయవిద్యాధికులలో హిందూమతమునందు అభిమానము ప్రబలసాగినది. పురాణము లలో చెప్పినగాథ లన్నియు వాస్తవములైనట్లు సకారణ ముగా స్థాపించుచుండుటచేత, కొన్ని వెఱ్ఱివిశ్వాసములు వ్యాపింపనారంభించెను. ఇట్లు దివ్యజ్ఞానసమాజప్రభావము పలు దేసల వ్యాపించుచుండగా "కుట్ హూమ్యామ్ కూలిపోవుట"

అను వ్యాసములు వరుసగ క్రైస్తవకళాశాల మాసపత్రికలో ప్రకటింపబడెను. అందులో అడయారులో ప్రదర్శితములైన అద్భుతములెల్ల మాయోపాయములచే చేయబడినవని వివరించుటచేత, దివ్యజ్ఞానసమాజముపైన విశ్వాసము ప్రజలలో తగ్గిపోవ నారంభించెను. కాని అద్భుతములమాట ఎట్లున్నను, మనపూర్వశాస్త్రములందలి యభిమానము నానాటికి హెచ్చుచునే వచ్చినది. ఆధునిక భౌతికశాస్త్రము కంటె మన మహర్షుల ఆధ్యాత్మికవిద్య ఉత్తమమని ప్రజలు గుర్తించసాగిరి. ఈ దివ్యజ్ఞానసమాజము మొత్తమున మన భారతజాతిని మేలుకొలిపెననుట స్పష్టము. పిమ్మట దేశములో ఉద్భవమొందిన రాజకీయాందోళనమునకు ఈసమాజప్రబోధములు కొంత తోడ్పడినవనుటకు సందియములేదు. మరికొన్ని సంవత్సరములకు అనిబిసెంటు అనునామె దివ్యజ్ఞానసమాజమునకు అధ్యక్షురాలుగా నున్నకాలములో అనన్యమగు విజ్ఞానసంపత్తి, అసమానమగు స్వానుభవమును సంపాదించి లోకమునకు అన్నివేళలయందును సేవచేసి, ప్రాగల్భ్యము నందినది.

"గోవిందరెనడే" అనువారు పూనాపట్టణవాస్తవ్యులు, మహారాష్ట్రబ్రాహ్మణులు, దేశస్థ లనుశాఖకు చెందినవారు. వీరు బొంబాయిహైకోర్టులో న్యాయమూర్తిగానుండిన కాలములోనే చెన్నపట్టణములోని మూడవ కాంగ్రెసుసమావేశమునకు వచ్చినట్లు పైనచెప్పబడినది. ఆరోజులలోనైనను ప్రభుత్వోద్యోగులు కాంగ్రెసుకు బోవుటకు ఆక్షేపణగాని ఆటంకముగాని లేదు. పిమ్మట మరియొకసారి వారు చెన్నపట్టణము వచ్చి,

పచ్చయప్పకళాశాలలో ఆంగ్లేయమున ఉపన్యసించిరి. మన దేశపు బరిస్థితులనుగూర్చి చెప్పుచు "బైబిలులో పాలస్తైన్ దేవుని కభిమానదేశమని చెప్పబడినది. కాని నాయూహాలో భారతదేశమే అట్టిదనితోచుచున్న" దనిరి. ఏలననగా, ఈదేశము నందు లోకమునందలి సర్వజాతులయొక్కయు, సర్వమతముల యొక్కయు ప్రతినిధులు నివసించుచున్నారుగాన, మానవసంఘ పరమావధి, ఈదేశమునందే నిర్ణయముకానున్నదని వక్కాణించిరి. ఆనాడు వారు చెప్పిన వచనములను పరమసత్యములుగా పరిగణించవచ్చును. ఈనాడు మనకు లభించిన స్వాతంత్ర్యమును, నిజముగా రామరాజ్యము చేయగలిగితిమేని భారతదేశము లోకమున కంతకును మార్గదర్శకము కాగలపరిస్థితులు ఏర్పడును. రెనడీగారు అప్పటికి ఏండ్లుచెల్లిన ముదుసలిగానుండి, కనుచూపు సయితము లోపించి యుండెను. ఆయన పొడగరి. గండు మొగము, విశాలఫాలభాగము పెద్దశిరస్సు గలిగి వారు శాంత స్వరూపులుగానుండిరి. ధోవతియు, బొందుల తెల్లని అంగరఖా మహారాష్ట్ర పగిడి, ఉత్తరీయమునుధరించి, నెమ్మదిగా సులభము లగు పదములతో భావములను దొరలించుచుండెను. ఆధోరణి వినుటకు ఇంపును, మనస్సునకు ఆనందమును గల్గించి, జ్ఞానబోధ గావించుచుండెను. వీరు ఆనాటి పెద్దలలోకెల్ల పెద్దలు. దేశసేవా తత్పరులు, విద్యాప్రవీణులు, రాజకీయములందును, ఆర్థిక విషయములందును ఆరితేరినవారు. దైవభక్తిచే న్యాయవర్తనముచే ప్రసిద్ధికెక్కినవారు. ఆర్థికశాస్త్రముగూర్చి యొకగ్రంథమును వ్రాసి ప్రకటించిరి. మిక్కిలిపెద్దవారై మరికదలలేని కాలములో

యింటిలోనే సాయంకాలమున పురాణముచదివి వినుపించుచుం డెడివారని వినియున్నాను. వీరిపత్నిగూడ పూనాలో స్త్రీవిద్యను గురించి శ్రద్ధగా పనిచేసియుండెను.

నేను రెండుసార్లు బి. యల్. తప్పిపోయి, మూడవసారి పరీక్షనిమిత్తము చదువుచున్నకాలములో ఏదయినా ఉద్యోగమునిప్పించుటకు, రిజిస్ట్రార్ జనరల్‌గారికి దరఖాస్తుపంపి, అందుతో నాకు డాక్టరు మిల్లరుగారిచ్చిన యోగ్యతాపత్రమునుగూడ పంపితిని. దానిఫలితము తేలకముందే బి. యల్. పరీక్షలో గెలిచితిని. ఆనాటి సాయంకాలమే బాపట్ల ప్రొబేషనరీ సబ్‌రిజిస్ట్రారుగా నియమించి, బందరులోనున్న హెడ్‌రిజిస్ట్రారుగారి యొద్దకు హాజరుకావలెనని, రిజిస్ట్రారుజనరల్‌గారి కార్యాలయమునుండి ఉత్తరువచ్చెను. హెడ్‌రిజిస్ట్రారుగారు గుంటూరులో సబ్‌రిజిస్ట్రార్‌గా నున్నప్పుడు నన్ను ఎరిగినవారగుటచే "నీవిప్పుడు బి.యల్. లో కృతార్థుడవైనావు గనుక ఈ ఉద్యోగము నకు రావని తలంచుచున్నా"నని యుత్తరముగూడ వ్రాసినారు. నేను ఆఉద్యోగములో ప్రవేశించుటలేదని ప్రత్యుత్తరము వ్రాసి పంపినాను.

చాలకాలమునుండి న్యాయవాదిగా పనిచేయవలెనని నామిత్రుడు హనుమంతరావునూ నేనును కోరుచుంటిమి. కావున మే మిరువురమును బందరుజిల్లాకోర్టులో న్యాయవాదులుగా ప్రవేశింప నిశ్చయించుకొంటిమి. మాకు ఉభయులకును మిత్రుడగు కలపటపు లక్ష్మీనరసింహము సెకండరీగ్రేడు ప్లీడరుగా

బందరులో పనిచేయుచున్నందున, గుంటూరులో కలసికొని, మనముగ్గురము కలసి జాయింటుఫరముగా వకాల్తాలు పుచ్చు కొని పనిచేయవచ్చుననియు, బందరులో తనకు తెలిసినవారు పలువురు కలరుగావున మనకు పని ప్రోత్సాహకరముగా నుండుననియు చెప్పగా అంగీకరించి ముగ్గురము కలసి బందరు గొడుగుపేటలో ఇల్లు అద్దెకుతీసుకొని ఆఫీసు పెట్టితిమి. గుమాస్తాల నిరువురను నియమించితిమి. 1894 సంవత్సరము ఆగస్టులో 21వ తేదీనో లేక 24వ తేదీనో నేనూ హనుమంతరావును న్యాయవాదులముగా జేరితిమి. ఈమధ్యనే హైకోర్టువారివలన ఫస్టుగ్రేడు ప్లీడరీపట్టాలను పొందితిమి. శ్రీ దేవమ్మగారు అనునామెతండ్రి నాయుడుగారు మామిత్రుడు లక్ష్మీనరసింహముగారిపై ఎక్కువ అభిమానము కలవాడుగానుండుటచేత, శ్రీ దేవమ్మగారికి సంబంధించిన చిన్న రివెన్యూ సివిల్ వ్యాజ్యములలో వకాల్తాలు మేము మువ్వురము కలసి దాఖలుచేసితిమి. ఆప్రథమదినములలో బందరుకు సమీపమున గూడూరులో జరిగిన ఖూనీకేసులో ముద్దాయిలపక్షమున నేను, హనుమంతరావును వకాల్తాలు పుచ్చుకొంటిమి. లక్ష్మీనరసింహంగారి బంధువులు ఆగ్రామంలో కొందరు ఉండుటచేత మమ్ములను ముద్దాయిలపక్షమున ఏర్పరచుట జరిగినది. ముద్దాయి బ్రాహ్మణుడు. అతడు చంపినట్లు చెప్పబడినస్త్రీ వయస్సుచెల్లిన శూద్రురాలు. ఈబ్రాహ్మణునకును, ఆస్త్రీకిని వ్యభిచారసంబంధము ఉండి వీరిమధ్య గల్గిన ద్వేషములనుబట్టి ఆమెను అతడు చంపివేసెనని ప్రాసిక్యూషను వాదము. అప్పుడు ఎల్విన్ అనువారు న్యాయమూర్తిగా నుండిరి. నేను ఆకేసును నడిపించుటలో ఎక్కువబాధ్యత వహిం

చితిని. సాక్షులను విచారణచేయుటంలో ప్రశ్నలు, అడ్డుసవాళ్ళు మొదలగునవి అప్పటికి నేర్చినరీతిని వేసి, చివర ప్రాసిక్యూషన్ తరఫున గవర్నమెంటువకీలు వాదన ముగించిన పిదప, నేను వారికి ప్రత్యుత్తరమిచ్చుచు, ముద్దాయి నేరస్థుడు కాడనియు, నేరము రుజువుచేయుటకు విచారించినసాక్షులు విశ్వాసపాత్రులు గారనియు, సందర్భములుగూడ ముద్దాయి నిరపరాధియైనట్లే నిరూపించుచున్నవనియు చెప్పి ముగించితిని. ఆరోజులలో ఆకోర్టులో ప్రముఖుడగు న్యాయవాదిగానున్న శ్రీ వావిలాల శివావధానులు బి.ఎ.బి.యల్. ఆ కేసులో వారి కేమియుసంబంధము లేకపోయినను, కోర్టులోనుండి నేను చెప్పినదంతయు విని నేను (Pedantic) వాగాడంబరము చూపుటచే కాబోలు కన్నులు చేతితో మూసుకొనుచుండిరి. కోర్టులలో వ్యవహారోచితమైన భాషయే యుచితముకాని, నాకు కోర్టులో భాషించుట క్రొత్త యగుటచేత, కొన్ని యూతపదములు క్రొత్తక్రొత్తవి పెద్దపెద్దవి పడినవి. న్యాయమూర్తి నేను క్రొత్తవాడనని గ్రహించి శాంతముగా నేను చెప్పినదంతయు వినెను. న్యాయమూర్తి అసెసర్లకు చెప్పుటలో సాక్షులు విశ్వాసపాత్రులుకారని వివరించి అభిప్రాయమును అడుగగా ముద్దాయి నిర్దోషియని చెప్పిరి. న్యాయమూర్తియు సమ్మతించి, ముద్దాయిని విడుదలచేసిరి. ఇట్లు ఒక ఖూనీకేసులో మేము జయముగాంచుటచేత, న్యాయవాదులు కొందరు మమ్ములను ప్రశంసించుటచేత, కొంతవరకు మంచి అవకాశము కలిగెను. ఆ కేసు నడిపించుటలో, పట్టిన కేసు గెలుచు టెట్లు అనే యోచన ప్రధానముగా నుండెనేకాని సత్య మెట్లున్నదను విషయము మా కంతగా పట్టలేదని చెప్పుట

తప్పదు. నిర్దోషిని రక్షించితి ననుభావము నాకు లేదు. పిమ్మట చిన్న క్రిమినల్ కేసులో ముద్దాయితరఫున పనిచేయుట తటస్థించి నది. చాలావరకు జయప్రదముగానే ఆ కేసు నడిచినది. కాని యోచనచేసినకొలది మనస్సునకు ధర్మసందేహములు కలుగుచు, కొంతబాధ కలుగుచు వచ్చినది. సాక్షులు చెప్పుమాటలు కేసు గెలుచుటకు తగినట్లుండుటకు కొంత ప్రయత్నము చేయవలసి వచ్చినది. కేవలము సాక్షులకు పాఠము నేర్పించకపోయినను, సాక్ష్యమట్లుండిననేగాని కేసు మనకు అనుకూలము గానేరదని సూచనలు చేయవలసివచ్చెను. ఇట్లు కొంతకాలము మనః క్లేశమును పొందుచుండగనే, మామిత్రుడు లక్ష్మీనరసింహంగారు మాలోనుంచి విడిపోయి తాను వేరుగా వ్యవహరించుకొనెదనని చెప్పుటచే మే మందుకు సమ్మతించితిమి. నేను, హనుమంత రావును మాత్రమే కలసిపనిచేయుచుంటిమి.

లక్ష్మీనరసింహముతో కలసిపనిచేయుచున్న కాలములోనే శ్రీదేవమ్మతండ్రి తాయి సుబ్బారావునాయుడుగారిపై దావా దాఖలుచేయుటకు ఎవరో పూనుకొని,ముందుగనే ఆస్తికి ఫైలు జప్తు పెట్టుదురని తెలిసి, ఆయన, నాకు, హనుమంతరావుకు వకాల్తాలిచ్చి అట్టి పిటీషన్ న్యాయవాది ఎవరైన పెట్టినపుడు ఫైలుజప్తుకు ఉత్తరువు చేయ నవసరములేదనియు తగినఆస్తి జామీా నిచ్చుటకు సిద్ధముగా నున్నాడనియు, ఆస్తి అన్యా క్రాంతముచేయు నుద్దేశ్యము లేదనియు అఫిడవిట్ దాఖలుచేయ వలసినదని నన్ను కోరియుండిరి. నేను ఆప్రకారమే కోర్టులో కనిపెట్టియేయుంటినిగాని వావిలాల శివావధానులుగారు న్యాయ

మూర్తి కూర్చున్న పీఠముదగ్గరకు బోయి వారితో నేమియో ఎవ్వరికిని వినపడకుండ నచ్చచెప్పి, ఉత్తరువు వేయించుకొనుట చూచుచుండియు,అది పిటీషన్ అనిగాని దానిమీాద నుత్తరువు పొందుచున్నారనిగాని నేను తలచలేదు. ఏదైన పిటీషన్ పెట్టిన యెడల తక్కిన అన్ని వ్యవహారములలోవలెనే బహిరంగముగనే పిటీషన్ పెట్టబడుననియు నేను వకాల్తును అఫిడవిట్ను దాఖలు చేసి చెప్పవలసిన అంశములు చెప్పవచ్చు ననుకొంటిని. తాయి సుబ్బారావునాయుడుగారుకూడ ఆ ఫైలుజప్తు ఉత్తరువు పడి నప్పుడు కోర్టువెలుపల వరండాలో నుండెను. ఈఉత్తరువు పడి నట్లు విని, నాయొద్దకు వచ్చి "ఏమి చేసితివయ్యా"అని నాపైన గొప్ప అయిష్టముతో పలుకుచు ఇంతగా నమ్మితే ఇంత మాన భంగము మీావలన గావలసివచ్చెనని నన్ను చురచురచూడ సాగెను. అప్పటికి జరిగినమోసము గ్రహించితినేకాని అప్పటికైన వెంటనే న్యాయమూర్తియొద్దకు బోయి తగినంత ఆస్తి జామీా నిచ్చుటకు కక్షిదారుడు సిద్ధముగానున్నాడని చెప్పవచ్చునను ఆలోచన నాకు తోచక పోయెను. ఫైలుజప్తుకు ఉత్తరువు పడినదన్నతోడనే ఇక నేమియు చేయశక్యముగా దనుమాట యొక్కటె తలచుకొని మిక్కిలి తెలివితక్కువగ ప్రవర్తించి, మనల నమ్ముకొన్న కక్షిదారున కవమానము గూర్చితినేఅని మిక్కిలి చింతించితిని. నా యవజ్ఞత నామిత్రులగు లక్ష్మీనరసింహము, హనుమంతరావుగార్లకు ఖేదము కలిగించెను. ముఖ్యముగ కక్షిదారునకు ఏవిధమయిన అవమానము జరుగకుండ వ్యవహారము నడుపబడునని అభయహస్తమిచ్చినకారణమున ఆయనకు మరింత మనఃక్లేశము కల్గెను. ఈఉత్తరువు కోర్టులో పడి

నప్పుడు హనుమంతరావును, లక్ష్మీనరసింహమును ఇతర కోర్టు లలోనుండిరి. అప్పటినుండి శ్రీదేవమ్మగారి పనులతోను, తాయి సుబ్బారావునాయుడు పనులతోను సంబంధము విడిపోయెను.

నేను బందరుకు మొదట నొంటరిగనే వెళ్ళితిని. హనుమంతరావు తన తలిదండ్రులను, చెల్లెండ్రను భార్యనుగూడ తీసికొనివచ్చి గొడుగుపేటలో నొకయింట కాపురముండెను.

నే నొంటరిగనే యుండి లక్ష్మీనరసింహముగారి ఇంటిలో భోజనముచేయుచుంటిని, తర్వాత కొన్నాళ్ళకు మా ఆఫీసు పెట్టిన ఇంటిలో నొక వంటయామె వంటచేసి పెట్టుచుండెను.. నాతమ్ముడు సూర్యనారాయణ చెన్నపట్టణములోనే చదువు కొనుచుండెను. నేను బి.యల్ చదువుచుండగనే 12-11-1892 న నాకు ప్రథమసంతానము ఆడశిశువు కలిగెను. బందరుచేరిన పిమ్మట నాభార్యపుట్టినింటనే మరల కుమార్తెను గనెను. ఇట్లుండగా నాతమ్మునికి పిల్లనిచ్చెదమని కృష్ణాజిల్లా తిరువూరు తాలూకా కనుమూరి గ్రామవాస్తవ్యులు జమీందారులు గాడిచర్ల కృష్ణమూర్తిగారు. నాకు వర్తమానమంపిరి. మాతండ్రి గారిని అడగవలసినదిగా కబురంపితిని. కొన్నిరోజులకు మనుము నిశ్చయమయ్యెను. నేను బందరులో నుండగనే నాభార్యను పిల్లలను గుంటూరునకు తీసికొనివచ్చిరి. అంతకుముం దొకసారి నాచిన్న [illegible]మ్ముని ఉ[illegible]యనమునకు ముందు పెద్దపిల్లను కడుపుతోనుండగా నాభార్యను తీసుకొనివచ్చిరి. మరల కాన్పు నిమిత్త[illegible] [illegible]లలోనే లింగమగుంటకు వెళ్ళవలసి

వచ్చెను. కనుక నాభార్య అత్తవారింటి కొత్తకాపురమునకు అదియే మొదలని చెప్పవచ్చును. కొలది రోజులలో తమ్ముని వివాహమునకు లగ్నము నిశ్చయమయ్యెను. అప్పుడు మండు వేసగి. నాభార్యను పిల్లలను గుంటూరుకు తీసుకొనివచ్చినారని విని వారిని చూచుటకు వచ్చి, రెండుపూట లుండి మరల బందరు వెళ్ళితిని. పెద్దపిల్లది పచ్చని దేహచ్ఛాయ, కనుముక్కు తీరు మంచిది. నా కెంతో ఆనందముగ నుండెను. రెండవపిల్ల అంతకంటెను అందముగ నుండుటచే మిక్కిలి సంతసించితిని. కాని నేను బందరుచేరిన కొలదిరోజులకే రెండవపిల్ల మృతినొందినట్లు ఉత్తరము వచ్చినందున నాలో నేను చింతించితిని. మరల ఒక్కసారి భార్యనుచూచి ఓదార్చుటకు పోతిని. భరింపరాని కడుపుదుఃఖ మంతయు తనలో తాను మ్రింగుచున్నదేగాని అంతగా వెలిబుచ్చనందుకు కొంత సంతుష్టి చెందితిని. ఒక్కరోజు ఉండి, ఓదార్చి మరల బందరుచేరితిని. గుంటూరునకు ఎండలలో తీసుకొనివచ్చినందున పిల్ల చనిపోయెనని నాభార్య మనస్సున పరితపించుచుండెను. నేను విధివశము తప్పదుగదా యని ఊరడిల్లితిని. వేసవిసెలవలకు కోర్టులు మూసివేసినతర్వాత నేను గుంటూరు చేరినాను. అప్పుడు మా మేనత్తగారు పెద్దది యొక్కతెయే ఆడదిక్కు. ఆమెయే నాభార్యను ఓదార్చుచు ఆమెను పిల్లనుగూడ ప్రేమతో చూచుచుండెను. ఇంతలో కొలదిదినములలో వివాహమునకు బయలుదేరి వెళ్ళితిమి. కనుమూరు అడవిపట్టున నున్న చిన్నపల్లె. అందు గాడిచర్లవారు రెండుకుటుంబములవా రుండిరి. అందు పెద్దవారికి కనుమూరులో రెండువంతులును, మాతమ్మునకు పిల్లనిచ్చిన కృష్ణమూర్తిగారికి

ఒక్కవంతును, మరియొక గ్రామములో నొకవంతును మరికొన్ని గ్రామములలో ఈనాములు, ఇండ్లుమొదలగునవి యుండెను. కృష్ణమూర్తిగారే వారికుటుంబము కలసియున్నపుడు వారి జమీను ఎనిమిదిగ్రామముల వ్యవహారములను నడుపుచు వ్యవహార్తయు, కార్యదక్షుడును, పలుకుబడికలవాడుగా నుండెను. వారితో పోల్చినచో మాస్థితి చాలచిన్నది. మేము ముందు ముందు హెచ్చుస్థితికి రాగలమని వారిఆశ. అసమానమైన వియ్యమైనను, వివాహము మొత్తమునకు మర్యాదతోనడిచినది.

వేసవిసెలవలు ముగిసి, కోర్టులు తిరుగ తెరచుసమయమున నేను నాకుటుంబమును తీసుకొని బందరు వెళ్ళవలెనని యుద్దేశించుకొని, అంతకుముందే బందరులో హనుమంతరావున్న ఇంటిప్రక్కనే యొకభాగము తీసికొంటిని. ఆ ఇంటివారే నాకు వండిపెట్టుటకు ఏర్పాటుచేసుకొని కొన్నిమాసములు గడిపితిని. ఇప్పుడు ఆయింటనే కాపురము పెట్టితిమి. మొట్టమొదట బందరులో న్యాయవాదిగా జేరుటకు వచ్చునపుడు ఖర్చుల నిమిత్తము మాతండ్రిగారు ముప్పదిరూపాయలు మాత్రమిచ్చిరి. పిమ్మట నేను వారియొద్దనుండి ఏమియు తీసికొనలేదు. ఇప్పుడు నాభార్యను పిల్లను తీసికొని బందరులో కాపురముచేయుటకు బయలుదేరుచు నొకబిందెయు, అన్నమువండుకొనుట కొకగిన్నెయు, కూరగిన్నె, రెండుచెంబులు మొదలగునవి మాచిన్నకాపురమునకు మిక్కిలి అవసరమైన పాత్రలుమాత్రమే తెచ్చుకొంటిమి. మాతండ్రిగారు, మేనత్తగారు, నాతమ్ములును గుంటూరులోనే భూముల అజమాయిషీతో కాలక్షేపము

చేయుచుండిరి. కొన్నిరోజులకు నాతమ్ముడు బందరులో మెట్రికు్యలేషన్ చదువుటకు వచ్చి నాదగ్గరనే యుండెను.

మా మేనత్తగారికుమారుడు రాపూరి కృష్ణయ్య, అతని చెల్లెలు మాయింటనే యుంటూయుండిరి. ఆచిన్నదానికి వివాహమై కాపురమునకు వెళ్ళినది. ఆపిల్లలకు తలిదండ్రులు గతించిరి. కనుక కృష్ణయ్యకు మాఅత్తగారే ఆధారము. ఇట్లుండగా మానాన్నగారికిని ఆమెకును ఏదోమనస్పర్థ లేర్పడినందునను, ఆమె మనుమడు కోమట్లవద్ద గుమాస్తాగా చేరి కొంచెము జీతము తెచ్చుకొనుచుండుటచేతను ఆమెయు, అతడును మా యింటినుండి లేచిపోయి వేరొకచోట కాపురముండిరి. అప్పుడు నాభార్యయే ఇంటిపను లన్నియు చేసి వంటవండి, తక్కినవారికి భోజనములుపెట్టి తాను భోజనముచేయుచు, భార మంతయు వహించుచుండెను. చిన్నతనమునుండి పుట్టినింట పనిపాటలు చేసియుండకపోయినను దురభిమానముంచుకొనక అన్నిపనులు తానే చేయుచుండెను. అందువలన మానాన్నగారు, కడుపున బుట్టిన కుమార్తెవలె కోడలిని ప్రేమతో చూచుచుండిరి. ఇట్లు కొలదికాలము జరిగెను. ఇంతలో మామేనత్తగారిమనుమడు కృష్ణయ్య జబ్బుచేసి దైవవశమున చనిపోయెను. కాన ఆమెను మాతండ్రిగారు మరల మాఇంటికి తీసుకొనివచ్చిరి. కనుక నేను నాభార్యను బందరు తీసుకొనివచ్చినను పూర్వమువలెనే మా మేనత్తగారు వండిపెట్టుటమొదలగు ఇంటిపనులు చేయుచుండిరి.

నేనిట్లు బందరులో నావ్యవహారములు చూచుకొనుకాలములోనే బాపట్ల చెరువులోతట్టుభూములు పల్లపుసాగునిమిత్తము

వేలము వేయబడునని కృష్ణాజిల్లాగెజిట్‌లో ప్రకటనగావించిరి. నేను గుంటూరు వెళ్ళి మానాయనగారితో సంప్రదింపగా వారు మనకు అక్కరలేదని చెప్పిరి, నేను గట్టిపట్టు పట్టినమీాదట నాకు రు 300/- లు మాత్రమిచ్చి భూమికొనుటకు నన్నే పొమ్మనిరి. ఆసొమ్ము చాలదని తెలిసియు ఏదియో మొండి ధైర్యముతో వెళ్ళి పాటపెట్టితిని. జాగర్లమూడి నాయుడు అను నొక పెద్ద ఆసామీాతో పోటీగా పాడవలసివచ్చెను. ఆయన పట్టుదలతో పాటపాడుటచే ధర హెచ్చిపోయెను. మొత్తము 21 యకరములభూమి 1800 రూపాయలకు నాపేరనే కొట్టివేయ బడెను. 300 ల రూపాయలుమాత్రమే భూమినిమిత్తము ఖర్చు పెట్టదలచిన మాతండ్రిగారి అభిప్రాయమునకు భిన్నముగా స్వతంత్రించి ముందువెనుక లాలోచించక భూమియందలి ఆశతో హెచ్చుపాటను పాడితిని. ఆవేలము ఖాయపడుటను ఆరోజుననే 500 ల రూపాయలు చెల్లించవలసివచ్చినది. నావద్దనున్న 300లు గాక తక్కిన 200 ల నిమిత్తము ఆయూరిలో బ్రహ్మాండం బాపయ్య గారను ధనికుడగు ప్లీడరును చేబదులడిగితిని. ఆయన నిర్మొగమాటముగ తనదగ్గర పైకము లేదని తప్పించుకొనెను. అంతట మాకు దూరపుబంధువులు కాజ సుబ్బారావుగారు బాపట్లతాలూకా హెడ్ అకౌంటెంటుగా నుండిరి. వారు మరియొకరివలన 200 లు ఇప్పించుటచేత 500 ల రూపాయలు సర్కారుకుచెల్లించి గుంటూరుచేరితిని. మానాయనగారికి సవిస్తర ముగా అన్నివిషయములును చెప్పితిని. 1800 లకు 21 యకరముల భూమి కొనుగోలువిషయమై సమ్మతించిరిగాని తనయొద్ద పైకము హాజరులేమిగనుక ఎక్కడనైన నోటువ్రాసి ఋణముతేవలసినదిగ

చెప్పిరి. వారివద్ద హాజరులో సొమ్ము లేనిసంగతి వాస్తవమే. కనుకనే భూములుకొనుటయనిన ఇష్టములేకపోయెను. ఇతరులయొద్ద రుణము తెచ్చుట వారికి బొత్తుగా సమ్మతములేదని. కాన నేనే ఏదో యుక్తమైన ఆలోచన చేయవలసివచ్చినది. కొంతవిచారించగా మిషన్ కాలేజీ అధ్యక్షుడుగా నున్న రివరెండు ఉల్ఫుదొర గారు రహస్యముగా రుణములిచ్చుచున్నారని తెలిసినందునను డాక్టరుకుగ్గరుదొరసానిద్వారా వారితో నాకు పరిచయమేర్పడి నందునను నేను బందరులో ప్లీడరుగా నున్నవిషయము వారెఱిగినదే గనుకను నా అవసరము తెలిపి 1500 ల రూపాయలు రుణముకావలెననియు అందుకు నేనును నాతండ్రిగారును కలిసి ప్రామిసరీనోటు వ్రాసిఇచ్చెదమనియు త్వరలోనే తీర్చెదమనియు చెప్పగా ఆయన సమ్మతించి రుణమిచ్చిరి. బాపట్లలో స్నేహితునకు పంపవలసిన 200 లును మామాయనగారే సరుబాటుచేసిరి. ఈ 1500లు వాయిదాలోపల సర్కారుకు కట్టివేసితిమి. ఈ భూములకు నేను పాటదారుడ నగుటచే నాపేరటనే పట్టా జారీ చేసిరి. మా తండ్రిగారిపేరనే పెట్టించవలెనని ఆలోచన నాకు తోచలేదు. నాపేర నున్నను జాయింటుకుటుంబముదే నను భావముతో నేను వ్యవహరించితిని. పిమ్మట ఆభూములున్న జమ్ములపాలెము పోయి, ఆసామీలను కుదిర్చి, వాటిని సాగుకు తెచ్చుట మొదలగు పనులన్నియు నేనే చేసితినిగాని మాతండ్రి గారు ఆపని పెట్టుకొనలేదు. ఉల్ఫుదొరగారి కియ్యవలసిన సొమ్ము పెద్దమొత్తముగానుండుటచేతను మామాయనగారు సంపాదించిన మెట్టభూమి కొంత ధర పలుకుచున్నందునను దానిపై సాలుకు సుమారు నలుబదికంటె ఆదాయము లేదుగాన

తొమ్మిదియకరముల మెట్టభూమిని రు 900 లకు అమ్మి ఆసొమ్మును ఉల్ఫుదొరగారికి కట్టితిమి. ఇంకను రు 600 లు, వడ్డీయును ఇవ్వ తేలితిమి. ఆమొత్తమును పిమ్మట నెమ్మదిగా చెల్లుబెట్టితిమి. ఒక్కసారి యివ్విక జాగుచేసినందుకు దొరగారికి, డాక్టరు కుగ్గరుదొరసానికి కొంత అయిష్టము నాపై కలిగెను. కొలదికాలములోనే అంతయు చక్కబడెను. ఇది యంతయు నేను బందరు వెళ్ళిన రెండుమూడు సంవత్సరములలో జరిగిన వ్యవహారమే.

మేము మావృత్తిలో ప్రవేశించిన మొదటిరోజులలో అక్కడి న్యాయవాదు లెవ్వరును మమ్ము నభిమానించలేదు. జూనియరులుగా నుంచుకొని కొన్ని అప్పీళ్లు వాదించుట కిచ్చిన యెడల మావిషయము ఇతరుల కెరుకబడుట కవకాశ ముండెడిది. కాని అట్టి పీలు పర్పడదాయెను. గుంటూరునుండి సెకండు గ్రేడు ప్లీడరుగా పనిచేయుచుండిన న్యాపతి హనుమంతరావు గారును, గండవరపు సుబ్రహ్మణ్యముగారును అప్పుడప్పుడు కొందరు కక్షిదారులను అప్పీళ్ళు దాఖలుచేయునిమిత్తము పంపుచుండెడివారు. వారిమూలమున కొంచెముపని మాకు లభ్యమగుచుండెను. కాని మా ఇరువురకు సరిపడునంతపని లేకపోయెను.

ఇట్లుండగనే కొలచలమల అప్పయ్యదీక్షితులు అనగా నీటిలో బడి బ్రదికిన చిన్నవాడు బి. ఏ. పరీక్ష నిచ్చి, రాజమహేంద్రవరమున గవర్నమెంటుకళాశాలలో నుపాధ్యాయు

డుగా నుండి, పిమ్మట ఫస్టుగ్రేడు పరీక్షయందు కృతార్థుడై బందరు జిల్లాకోర్టులో న్యాయవాదిగా జేరెను. ఈయన మంచి తెలివిగలవాడు. వావిలాల శివావధానులుగారికి బంధువునగుట చేత వారు కొన్ని అప్పీళ్ళు మొదలగునవి ఇచ్చి, ఈయన సామర్థ్యమును ప్రకటించుటకు అవకాశము కల్పించుచు, శ్రద్ధవహించు చుండెను. మాకును ఆయన మిత్రుడగుటచేత సంతసించు చుంటిమి. ఇట్లుండగా ఆయనకు భార్యావియోగము సంభవించినది. మరల వివాహము చేసుకొనెను. కొలదికాలములోనే కొన్ని భూములు సంపాదించి, ఆభూములనిమిత్తము వేసవి సెలవులలో గుంటూరుజిల్లా నారుమూరు పోయి, అక్కడ జబ్బు చేసి గుంటూరుకు వచ్చుచుండగా అకస్మాత్తుగా చనిపోయెను. ఎంతయో వృద్ధికి రాదగిన వ్యక్తి ఇట్లు కొలదికాలములోనే ప్రొద్దున పువ్వు వికసించి, సాయంకాలమునకు నశించినట్లు లోకమును విడిచిపోయెను. వీరి అకాలమరణమునకు పలువురు చింతించిరి. ఆయనకు ప్రథమభార్యావియోగము కలిగినపిమ్మట మరల వివాహముచేసుకొనకముందు మిక్కిలి విరాగముతో నున్నకాలములో నేనును ఆయనయు కలిసి కొన్నిసాయంకాలములు ఊరివెలుపలకు షికారుగా పోవుచుండినపుడు సంభాషణలో ఎందరో ఆప్తులు మరణించియుందురుగాని యొక్కరైనను మరణానంతరము తమస్థితి యీప్రకారము ఉన్నదని చెప్పినవారు లేరుగదా, దేహము నశించినను జీవుడు నశించడని చెప్పెడిమాట యెంతవరకు విశ్వాసార్హము మొదలగుసమస్యలు చర్చించు చుండువారము. మరల వివాహముచేసుకొని కొన్నిమాసముల లోనే మృతినొందెను. ఇంతశ్రద్ధతో చర్చించిన ఆయనయైనను

నాతో తన జీవితానంతరస్థితి యెట్లున్నదో తెలుపలేదుగదా యని నేను పలుమార్లు అనుకొనుచుంటిని. లండన్ (Psychical Research Society) సైకికల్ రిసెర్చి సొసైటీ అనుపేరుతో సర్ ఆలివర్ లాడ్జి మొదలగు శాస్త్రప్రవీణులు నడుపుచుండిన మానసికసంశోధనాసంఘమునకు కార్యదర్శిగానుండిన సభ్యుడును గొప్పశాస్త్రజ్ఞుడు నగునతడు చనిపోవుచు తాను మరణించిన తోడనే తనస్థితిగతు లెట్లుండునో సోదిలో చెప్పెదనని చెప్పి మరణించెనట. కాని ఆయన చెప్పినట్లు సోదిలో రాలేదు. పండ్రెండేం డ్లయినతర్వాత తలవనితలంపుగ ఆయన సోదిలో గనుపడి తాను ఫలానాఅని చెప్పినప్పుడు, పరిశోధకులు విశ్వసింపక, దృష్టాంతములు అడుగగా దానికి మిక్కిలి నిరుపమములును తృప్తికరములునగు దృష్టాంతములను చూపించుటచే వారు తృప్తి పొంది నీస్థితిగతు లెట్లున్నవని యడుగగా అవి మీకు వివరించుటకు సాధ్యము కావనియు, మరణానంతరపరిస్థితులు మిక్కిలి విపరీతములనియు మాత్రము చెప్పి ముగించెనట. ఈవిషయము ఆ సంశోధనసంఘము ప్రకటించినగ్రంధములో చదివితిని. మొత్తముమీద ఈ విషయము గొప్ప మాయగనే యున్నది.

---

# కృష్ణాజిల్లా కాంగ్రెస్ సంఘము.

బందరులో న్యాయవాదవృత్తి ప్రారంభించిన రెండు మూడుసంవత్సరములకు పిమ్మట అక్కడ అప్పటికే స్థాపించబడి వ్యవహరించుచున్న కృష్ణాజిల్లాకాంగ్రెసుసంఘములో సభ్యుడనుగా జేరితిని. ఇప్పటి గుంటూరుజిల్లాలో వంగోలుతాలూకాతప్ప తక్కినదంతయు కృష్ణాజిల్లాలోనిదే. కాంగ్రెస్ కార్యమునందు మిక్కిలి శ్రద్ధావేశములు గల పెనగపల్లి రామస్వామిగుప్త యను నొక వైశ్యయువకుడు గుంటూరు వాస్తవ్యుడు, నాకంటె పెద్ద వయస్సుకలవాడు, గుంటూరు మిషన్ కాలేజీలో గుమాస్తాగా ఉన్నను దర్పముగలవ్యక్తిగా ప్రవర్తించుచుండెను. ఈతడు కృష్ణాజిల్లాకాంగ్రెస్ మహాసభ గుంటూరులో నడిపించుటకు గొప్పప్రయత్నము చేసి సొమ్ము వసూలుపరచి, మహాసభాసమావేశము గావించెను. వావిలాల శివావధానులుగారు అధ్యక్షత వహించిరి. నే నప్పుడు బి. ఎల్ చదువుచున్న విద్యార్థి నగుటచేత ఆసభకు గుంటూరులో నుండియు హాజరు కాలేదు. సభ జయప్రదముగ నడచినది. అదియే ప్రప్రథమమున కృష్ణాజిల్లాలో జరిగిన జిల్లాకాంగ్రెస్ మహాసభ. అప్పటికి దక్షిణదేశమున నెక్కడను జిల్లామహాసభలు జరిగినట్లు గానుపించదు. ఈసభాసమావేశమునకు పిమ్మటనే బందరులో జిల్లాకాంగ్రెసుసభ స్థాపితమైనదని తలచెదను. ఆకాలములో కాంగ్రెసువిషయములలో పెనగపల్లి రామస్వామిగుప్తవంటి ఉత్సాహపురుషులు మరియొకరు లేరనియే చెప్పవచ్చును. ఆయన నిర్భయముగ ఆవేశపూరితుడై ఉపన్యసించుచుండెను. కాని ఆయన గుంటూరులో నుండువా

డగుటచేత బందరులో నున్న జిల్లాసంఘముతో ఆయనకు సంబంధము లేదయ్యెను. నేను త్వరలోనే జిల్లాసంఘమునకు కార్యదర్శిగా నెన్నుకొనబడితిని. 1896 సంవత్సరమున కాబోలును కృష్ణ వరదలవలన అవనిగడ్డతాలూకా గ్రామములు నీళ్ళలో మునిగిపోయి ప్రజలు కృష్ణానదిపొడుగున కట్టలమీదను చెట్లమీదను, దిబ్బలమీద నెక్కి ప్రాణములు రక్షించుకొనిరి, పశువులు మొదలగు ఆస్తి చాలవరకు వరదలో కొట్టుకొనిపోయెను. ప్రజలు తినుటకు తిండిలేక పసిపిల్లలతోను, ముసలివారితోను, రోగులతోను పడరానిపాట్లు పడిరి. అప్పుడు నేను బందరులో చందాల నిమిత్తము తిరిగినను రు 130 ల కంటె ఎక్కువ వసూలు చేయలేకపోతిని. బస్తీవాసులకు కష్టపడుప్రజలపై సానుభూతి మృగ్యముగ నుండెను. అట్టి వసూలునిమిత్తము ఎవరైన సర్కారుఉద్యోగి పూనినయెడ గొప్పగా ద్రవ్యసహాయము చేసియుందురు. అంతియే కాని సామాన్యు లెంత యత్నించినను బస్తీవాసుల హృదయములు చలింపవని తేలినది.

ఆ వచ్చినసొమ్ముతో బియ్యము, ఉప్పు, మిరపకాయ, చింతపండు కొని పడవమీద వేసుకొని, నాగుమాస్తాను తోడు దీసికొని, బందరువరకు వరదనీరు నిలచియుండుటవలన ఆనీటిమీదనే పడవ సాగించుకొనిపోయి కొందరికి ఆవస్తువులను పంచిపెట్టి ఏదో కొలదిసహాయము చేయగలిగితిని. నిజమైన సంతుష్టి లేకపోయెను. స్వయముగ శరీరకష్టము చేయగలిగితినేగాని ద్రవ్యము వెచ్చించు అవకాశము లేకపోయెను. ఆసంవత్సరమే మద్రాసుగవర్నరు వచ్చినపుడు కాంగ్రెసుకమిటీతరఫున సన్మాన

పత్రము సమర్పించుచు రు 130 లు చందా వసూలుచేసి వరద బాధ పడినవారికి బియ్యము మొదలగునవి కాంగ్రెసుకమిటీతరఫున పంచిపెట్టబడినదని వ్రాయగా గవర్నరుగారు కాంగ్రెసువారు నూటముప్పదిరూపాయలు ఖర్చుపెట్టిరా అని హేళనచేసిరి.

మరికొంతకాలమునకు బాబూ బిపినచంద్రపాలు అను బంగాళాదేశస్థుడు, కాంగ్రెసునాయకుడు గొప్పవక్త బందరుకు వచ్చెను. ఆయన బ్రాహ్మసమాజముతరఫున ఉపన్యాసము లిచ్చుపనిమీద వచ్చినను కాంగ్రెసునాయకుడగుటచే ఆయనను సన్మానించుటకు కాంగ్రెసుకమిటీ తీర్మానించెను. నేను కార్య దర్శిని. వారిని తీసుకొనివచ్చి బస ఏర్పాటు గావించితిని. ఆయన హిందూహైస్కూలులో నని జ్ఞాపకము-లేక టౌనుహాలు లోనో-ప్రస్థానత్రయమునుగూర్చి మహత్తరమగు నుపన్యాసము నొసంగెను.

మరునాడు మా న్యాయవాదులును తక్కిన పురప్రముఖులు పౌరులనిమిత్తము ఏర్పడిన క్లబ్బులో వారికి విందు నేర్పాటుచేసితిమి. గోపాలరత్నంగా రనున్యాయవాది, వైశ్యులు క్లబ్బులో సభ్యులుగా నుండిరి. వారియింటిలో చక్కెరపొంగలి తయారుచేయించి ఆవిందులో వినియోగించిరి. అప్పటి నామన స్థితినిబట్టి వైశ్యులు చేసిన ఫలహారమును పుచ్చుకొనుట ఇష్టము లేకుండెను, కాన నేను తినలేదు. నేను తినలేదని తక్కినవారికి తెలియదు. ఇందుకు ఆయూరిలోని బ్రాహ్మణసభవారు ఆవిందులో పాల్గొన్నవారి నందరిని బహిష్కారముచేయవలె

నను ఉద్దేశ్యముతో నెవ్వరో స్వాములవారు ఆసమయముననే వచ్చిఉన్నందున - వారిసభకు మమ్ముల నందరిని హాజరుకావలసి నదిగా నోటీసులిచ్చిరి. మేము చాలమందిమి నిర్భయముగనే హాజరయితిమి. ఆ బ్రాహ్మణసభాపతులలో నెవ్వరో లేచి, మేము వైశ్యులయింటి ఫలహారమును భుజించితిమికాబట్టి మమ్ము బ్రాహ్మణసంఘమునుండి బహిష్కరించవలసినదని చెప్పుచు, "మీరు ఫలహారమును భుజించిరా, లేదా" యని ప్రశ్న వేయగా మమ్మ న్నాప్రశ్న వేయుటకు మీ రెవ్వరికిని అధికారము లేదనియు, బ్రాహ్మణసభలో సభ్యులుగా నున్నవారు చేసిన, ఇప్పటికిని చేయుచున్న దుష్కార్యములు అనగా భ్రూణహత్యలు చేసిన వారియొద్ద, వ్యభిచారులై కులముచెడిపోయిన వితంతువుల యొద్దను రహస్యముగ డబ్బు తీసికొని వారితప్పులను కప్పి పుచ్చుచు స్వాములవారికి వారిచే దక్షిణ లిప్పించి బహిష్కారమునుండి తొలగించుటయు మొదలగుపాపకార్యము లెన్నియో చేసినారుగనుక వారిని ముందు విచారణచేసి తగినశిక్ష విధించిన పిమ్మట మామీద ఆరోపించబడిన నేరములను విచారించవలసిన దని నేనే లేచి ఘంటాపథముగ వాదించునప్పటికి ఔనౌ నని మా మిత్రు లందరు కేకవేసిరి. సభకువచ్చిన పెద్దలు అక్కడ నుండి మెలమెల్లగ లేచిపోయిరి. వారు వెడలిపోయినపిమ్మట మేమును మాయిండ్లకు చేరితిమి. అట్లు నేను తీవ్రముగ మాట్లా డుటలో ఆసభకు వచ్చిన జంధ్యాల గౌరీనాథశాస్త్రిగారిని గూడ అట్టి దుర్మార్గులను వెనుకవేసుకొని ఏముఖముతో ఇక్కడికి వచ్చితిరని కొంచెము పరుషముగనే మాట్లాడితిని. వారును ఏమియు మారుపలుకక సభనుండి లేచిపోయిరి. నామిత్రులు

నన్ను శ్లాఘించిరి. కాని గౌరీనాథశాస్త్రిగారినిగూర్చి పరుష వాక్యములు పల్కినందుకు నామనస్సు మిక్కిలి వ్యథజెందెను. ఆయన పూర్వాచారపరాయణు లైనను నీతిధర్మముల పాటించు చుండిరి. వేదాంతగ్రంథపఠనమునందు సంప్రీతిగల పండితుడాయన. పండితులను పూజించుచుండెను. ఆయనయందు నాకును గౌరవ ముండెను. కాని ఆనాడు ఆసభలో ఆయన పాల్గొనవచ్చినందుకు ఆశ్చర్యమునొంది కొంచెము కఠినముగనే పలికినందుకు పరితపించి, నేను పరుషములు పలికినందుకు క్షమింపుడని ఆయన పేర జాబువ్రాసి పంపితిని. అందుకు వారు మీమాటలవలన తమమనస్సు ఆయాసముచెందలేదనియు తాము క్షమింపవలసిన నేరము నే నేమియు చేసియుండలేదనియు శాంతప్రియవచనముతో జవాబువ్రాసిరి.

## బందరు న్యాయవాదులు

బందరులో న్యాయవాదులుగా నున్నవారిలో ప్రముఖులు అయిదారుగురుమాత్ర ముండిరి. కక్షిదారులు పలువురు వారియొద్దకే పోవుచుండిరి. తక్కినవా రందరము జూనియర్లమే. మేము అనగా హనుమంతరావును, నేనును జూనియరులుగా పనిచేయుచుంటిమిగనుక ఒకరిక్రింద నున్నట్లే లెక్క. మాకు వచ్చెడి కేసులనుబట్టి మేము బొత్తిగా హీనముగాను లేము. ప్రాముఖ్యముగాను ఉండలేదు. మాకు వచ్చెడి కేసులు తక్కువ యైనను జాగ్రత్తగా చేయువారమేయని పేరుమాత్రము పొందితిమి. మొత్తమున సివిల్ వ్యాజ్యముల అపీళ్ళలో ప్రముఖులు

పురాణము వెంకటప్పయ్యగారు, అన్నవరపు పుండరీకాక్షుడు గారు, వావిలాల శివావధానులుగారు. వీరు ముప్వురు పైన వ్రాసినక్రమముననే పేరుపొంది యుండిరి. ఇందు అన్నవరపు పుండరీకాక్షుడుగారు కొన్నిసంవత్సరములు బాపట్ల మునసబు కోర్టులో నుండి, పిమ్మట ఫస్టుగ్రేడు ప్లీడరీపరీక్ష నిచ్చి జిల్లా కోర్టులో న్యాయవాదిగా జేరిరి. ఈయన ఎక్కువ పట్టుదలతో పనిచేయుచుండెనుగాని వెంకటప్పయ్యగారికంటె తక్కువ శ్రేణి లోనే పరిగణింపబడుచుండెను. వీ రిరువురును చాలవరకు తమ వృత్తికార్యములందు శ్రద్ధజూపుటతప్ప సంఘవిషయములుగాని దేశవిషయములుగాని వారికి పట్టకుండెను. తక్కిన న్యాయ వాదులలోనైనను పలువురు అట్టివారే. వావిలాల శివావధా నులుగారు తమవృత్తియందే గాక, సంస్కృతజ్ఞానము కలవా రగుటచేతను, దివ్యజ్ఞానసమాజసభ్యుడగుటచేతను మతవిషయము లందు శ్రద్ధజూపుచుండిరి. జంధ్యాల గౌరీనాధశాస్త్రిగారు పండితసన్మానముచేయు పండితుడు, నైష్ఠికుడు. శ్రీ వెంకటరెడ్డి నాయుడు, జె. డి. శామ్యుయల్ అనువా రిరువురు క్రిమినల్ కేసులలోనే ఎక్కువగా పనిచేయుచుండువారు. వారైనను స్వకార్యములుతప్ప ఇతరవిషయము లెవ్వియు పయిబెట్టుకొనక దూరముగ నుండువారే.

రెండవతరగతి న్యాయవాదులు వయసులో చిన్న వారును, కొంత ఉత్సాహము కలిగి దేశహితైకకార్యములందు అభిమానము గలిగి యుండిరి. వేమూరి వెంకటసుబ్బారావను నొక సెకండుగ్రేడుప్లీడరు బందరులో పేరుబడ్డ కుటుంబములోని

వాడు. ఈయన జిల్లాకాంగ్రెసుసంఘమునకు కొంతకాలను అధ్యక్షుడుగ నుండెను. కట్టమూడి చిదంబరరావు మరి యొక సెకండుగ్రేడుప్లీడరు కల్లకపట మెరుగని సత్స్వభావుడు, దయార్ద్రహృదయుడు; కాంగ్రెస్‌సంఘవిషయములందును, ఇతర సాంఘికవిషయములందును ఉత్సాహముతో పాల్గొనుచుండెను. న్యాయవాదులలోనేగాక ఉపాధ్యాయులును కొందరు కాంగ్రెస్ అభిమానులు సాంఘికసంస్కరణాభిలాషులు నుండిరి. బందరులో నోబిల్‌కళాశాలయను ఆంగ్లేయవిద్యాశాల యొకటి యుండెను. దానిలో శ్రీ వేంకటరత్నంనాయుడు ఎమ్. ఏ. గారు ప్రసిద్ధి కెక్కిన ఉపాధ్యాయులు. వీరు మతమున బ్రాహ్మసమా జికులు. మిక్కిలి నీతిధర్మదీక్షాపరతులై తనయొద్ద చదివెడి విద్యార్థులకు నట్టి నీతిమార్గము పట్టుపడునట్లుచేయవలెనని ప్రయత్నము చేయుచుండిరి. ఆరోజులలో భోగముమేళములు వివాహములు మొదలగు శుభసమయములందు రప్పించి సానుల చేత అభినయముతో ఆటలాడించి పాటలుపాడించుట సామాన్యముగ జరుగుచుండెను. భోగముమేళము లేనిపెండ్లి పెండ్లి యేగా దనుచుండిరి. దేవాలయములలోను దేవునిఊరేగింపు లందును భోగముమేళములు తప్పక నడచుచుండెను. ఈ ఉత్సవ ములకు వచ్చువా రనేకులు భోగముమేళమునందలి ప్రీతిచేతనే వచ్చుచుండిరి. గొప్పవారును, కొద్దివారునుగూడ తమయింట కార్యములలో భోగముమేళము లేకపోయినయెడల గొప్పలోప ముగ తలంచుచుండిరి. కాని వాటియందలి అవినీతి గ్రహింప జాలకుండిరి. కాని శ్రీ వేంకటరత్నమునాయుడుగారు తమ విద్యార్థులచే అట్టిమేళము లున్నచోటికి ఎప్పుడును పోమని

దీక్షపట్టించిరి. ఈ దీక్ష మాతరగతిన్యాయవాదులలోను ఉపాధ్యాయులలోను అంగీకృతమై అనుష్టింపబడుచు వచ్చెను. మొత్తమున భోగముమేళములు కొలదికాలములో బందరులో మాత్రమే గాక తక్కినగ్రామములందును ఆగిపోయెను. ఈమధ్య భోగముకులమువారిలోనే ఒక నూతనాందోళన సాగి పడపువృత్తి నీచమని గ్రహించి ఆడపిల్లలకు సక్రమముగ వివాహములు చేయనారంభించుటతో నానాట వారిలో కన్యలుగా నుండువా రరిదియై, వివాహముచేసుకొను ఆచారము ప్రబలినందున భోగముమేళములు దేశములో తరిగిపోయెను. ఇంకొక ముఖ్యకారణము దీనికి తోడ్పడెను. దేవాలయములలో దేవదాసీలుగా నుండువారి కేర్పడిన ఈనాముభూములు నౌకరీ చేయవలసిన నిర్బంధము లేకుండగనే వారికి సంపూర్ణ హక్కు కలుగజేయుచు నొక శాసనము చెన్నరాజ్యములోని శాసన సభలో అంగీకరింపబడి అమలుపెట్టబడినది. అందువలన భోగముసానులు పూర్వమువలె దేవాలయములో ఆటలకు పాటలకు బోవుట మాని, ఈనాముభూములను అనుభవింపజొచ్చిరి.

ఈ మహోయత్నమునకు అంకురము శ్రీ వేంకటరత్నం నాయుడుగారి ప్రబోధమేయని చెప్పవచ్చును. ఆయనకు పిన్న వయసునందే భార్యావియోగము కలిగెను. మరల వివాహము చేసుకొనక, బ్రహ్మచర్యమునేతాల్చి, మార్గదర్శకముగ లోకమున సంచరించెను. వీరు ఆంగ్లేయభాషలో ప్రవీణులు. గొప్ప వక్తలు. ఎల్లపుడు స్వచ్ఛమగు తెల్లని దుస్తులనుధరించుచుండెడివారు. వీరి ప్రభావముననే పిఠాపురముజమీందారుగారు అనాధ

శరణాలయమును కాకినాడలో గట్టించిరి. అందు బాలబాలిక లకు కులభేదములు లేకుండ భోజనాదివసతులు, విద్యావకాశ ములు గల్పించిరి. శ్రీ నాయుడుగారు చెన్నపట్టణమున కాంగ్రెస్ మహాసభనుండి నార్టన్ చర్య నాక్షేపించుచు తమ సహచరులతో లేచివచ్చినప్పటినుండి కాంగ్రెస్ వ్యవహారములలో పాల్గొనుటలేదు. నాయుడుగారు హరిజనబాలికలను పెంచి పెండ్లిండ్లుచేసిన జగదేకకుటుంబకులు.

బందరులో ఉపాధ్యాయులుగా నున్నపుడు కోపల్లి హనుమంతరావుగారు, భోగిరాజు పట్టాభిసీతారామయ్యగారు, ముట్నూరు కృష్ణరావుగారు వీరి శిష్యులుగా నుండిరి. వీరు మువ్వురు ఆంధ్రదేశమున ప్రఖ్యాతపురుషులై గావించిన మహ త్కార్యములు ముందు వివరించబడును. నేను బందరులో న్యాయవాదిగా నున్నకాలములో వీరు విద్యార్థులలో గణ్యత కెక్కుచుండిరి. ఆరోజులలో బందరులో కళాశాలోపాధ్యా యులుగా నుండిన చెన్నాప్రగడ భానుమూర్తిగారు నాకు రాజమహేంద్రవరములో సహపాఠి. వీరుబుద్ధికుశలురు, నిరాడం బరులు, నీతిపరులు. తెలుగునందు కవిత్వము చెప్పుచుండెడి వారు. కాంగ్రెస్ కార్యములందు పాల్గొనువారికి ఉత్సాహము కల్గించుటకు రసవంతములైన పద్యములు వ్రాసి ప్రకటించు చుండిరి. వీరివలెనే కళాశాలలో ఉపాధ్యాయులుగానుండిన శ్రీ దుగ్గిరాల రామమూర్తిగారు గొప్ప సంఘసంస్కరణాభి మాని. బ్రాహ్మసమాజసభ్యులు.

ఈసందర్భమున మరియొక ప్రధానపురుషునిగూర్చి చెప్ప వలసి యున్నది. వల్లూరి సూర్యనారాయణరావు అనువారు హైకోర్టుపట్టా పుచ్చుకొని బందరు జిల్లాకోర్టులో న్యాయ వాదిగా ప్రవేశించిరి. వయస్సున కొంచెము పెద్దలైనను నాకు సమకాలికులే. వీరు కాంగ్రెస్‌వ్యవహారములందును, సంఘ సంస్కరణవిషయములలోను ఉత్సాహముతో పాల్గొనుచుండిరి.

కాంగ్రెస్‌కమిటీసభలు పట్టణములో అప్పుడప్పుడు జరుగు టయేగాక వార్షికసభలు వానితోపాటు సంఘసంస్కరణసభలు కూడ జరుగుచుండెను. నెల్లటూరు, ఉయ్యూరు, నూజవీడు, నరసరావుపేట, గుంటూరు, బెజవాడమొదలగుచోట్ల ఈసమా వేశములు జరిగెను. నే నప్పుడు చాల వర్షములు జిల్లాకాంగ్రెస్ సంఘకార్యదర్శిగ నుండుటచే ఈమహాసభలలో పాల్గొనుట తప్పనిసరి యయ్యెను. ఈ సభలలో తెలుగుభాషలో నుపన్య సించుట నాకు బాగుగ నభ్యాసమైనది. ఒక్కొకప్పుడు నేను చేసిన ఉపన్యాసములను పలువురు మెచ్చుకొనుచుండిరి. అప్పుడు సామాన్యముగ ఆంగ్లేయవిద్య నేర్చినవారొకచో చేరినపుడు ఆంగ్లేయభాషలో సంభాషించుకొనుటయు, మహాసభలలో ఆంగ్లేయభాషలో నుపన్యసించుటయు గౌరవకారణముగ నుండెను. కాంగ్రెస్‌సభలలో తప్ప తక్కిన సభలలో నేనును ఆంగ్లేయములోనే మాట్లాడుచుంటిని. కోర్టులోను, పాఠశాల లోను ఆంగ్ల మెట్లును తప్పదు. క్లబ్బులలోగూడ సంభాషణల కాంగ్లమే పరిపాటియాయెను.

ఆంధ్రదేశములో నప్పుడు స్త్రీపునర్వివాహసమస్య బలముగా చర్చింపబడుచుండెను. వితంతువులైన యువతులను తలిదండ్రుల సమ్మతిగాని పోషణకర్తల సమ్మతిగాని లేకుండ రహస్యముగ గొనివచ్చి, వివాహముసేయుట ఆక్షేపణార్హముగ నెంచుచుండిరి. పూర్వాచారపరాయణత్వముచేతనో, సంఘబహిష్కారభయముచేతనో తలిదండ్రులీ యుద్వాహము లంగీకరింపకపోవుటచే ఈ రహస్యమార్గము లవలంబించక తప్పినదిగాదు. ఇట్లుండగా బందరుతాలూకాలో నొకగ్రామమునుండి పదిసంవత్సరముల బ్రాహ్మణవితంతుబాలికను ఆమె యన్న బందరు తీసికొనివచ్చి తగినవరుడు దొరకినచో వివాహము చేయుటకు పూనుకొనెను. నోబిల్ కళాశాలలో బి. ఏ లోనో ఎఫ్. ఏ లోనో చదువుకొను నొకవిద్యార్థి ఆపిల్లను వివాహమాడ సమ్మతించెను. అతడు మైనరు కాడుగాని బందరులో వారికి తోడ్పడువారు లేకపోయిరి. వివాహమునకు కొంత సొమ్ము కావలసియుండెను. ఇల్లు కావలసియుండెను. పురోహితుడును అవసరమే. బందరులోనే ఈయవకాశములు దొరకనపుడు మరియొకచో బొత్తుగనే దొరకవు. ఒకనాటి రాత్రి వేమూరి సుబ్బారావుగారు, చిదంబరరావుగారు మొదలగున్యాయవాదులము, కొందరుపాధ్యాయులును ఒక మిత్రునియింట విందునకేగి, లోకాభిరామాయణము మాట్లాడుచుంటిమి. అప్పుడు ఈబాలవితంతువివాహమునుగూర్చి ముచ్చట బయలుదేరినది. ఆబాలిక దురవస్థ కందరును పరితపించుచుండిరి. నే నంతట "మనముమాత్రము ఈ సంఘస్థితికి బాధ్యులముకాదా, మనమేల భారము పైనవేసుకొని వివాహము జరిపించకూడదా?" దని

ప్రశ్నించితిని. వట్టిమాటలు చెప్పువారేగాని కార్యముఖమునకు వచ్చునప్పటికి నిలుచువా రుండరని సుబ్బారావుగారు నన్ను హెచ్చరించిరి. "మీ రీ యూరిలో పేరుప్రతిష్ఠలు పొందిన వారు, మీరు చేబట్టినయడల వివాహము సుకరముగ జరగు" నని నేను మొదటిబాధ్యత వారిమీదనే పెట్టితిని. "నిలువు నిలువు మనువారేగాని తోడు నిలుచుండువా రెవ్వరు నుండ" రని మరల ఇంచుక కోపముతో వా రనిరి. వెంటనే నేను "రేపటి ఉదయం 8 గంటలకు నలుబదిమందిని మీకు తోడుగ నిల్చు వారిని సమకూర్చెదను. మీరు వివాహము జరుపు భారము వహించెదరా" యని పందెమువేసినట్లు మాట్లాడితిని. "నీవు నలుబది మందిని అంగీకరింపచేసినయెడల నేను వెనుదీయ" నని ఆయన వాగ్దానముచేసెను. కాని నే నంతమందిని సమకూర్చలే నను దృఢవిశ్వాసముతోడనే వా రట్లు చెప్పిరని తలచి, నామాటనిలుపుకొన నెంచి, అపుడే అచ్చట నున్న మిత్రులతో సంప్రదించి, వారి ఆమోదమును పొందితిని. మరునా డుదయముననే బయలుదేరి ఈ వివాహము జరుపుటకై సుబ్బారావు గారితో నిలిచి నిర్వహింతు మని నలుబదిమందిచే సంతకములు చేయించి, తొమ్మిదవ గంట కొట్టుచుండగనే సుబ్బారావుగారి కా కాగితము నందిచ్చితిని. వారు "ఇదియంతయు గాదు; నాఆప్తబంధువుల దస్కతులు కావలె"నని ఇంచుక కోపముతో వాక్రుచ్చిరి. "ఆప్తబంధువు లెవ్వ" రని ప్రశ్నించితిని. వడ్లమన్నాటి నరసింహారావు, కట్టమూడి చిదంబరరావు గార్ల పేర్లు చెప్పిరి. "ఇవిగో వారిసంతకములుగూడ ఇం దున్న" వని కాగితము చూపితిని. వా రంతట మంచిదని అంగీకరించి,

మరునాడు కాబోలును, సంతకములు చేసినవారి నందరిని భోజనమునకు బిలచి, వివాహమునకు వలయు సొమ్ము, ఇల్లు, పురోహితుడు మొదలగువిషయములు నిర్ణయించిరి. సుబ్బారావు గారు దక్షిణవల్లూరుసంస్థానమువారికి దివాన్‌జీగా నుండుటవలన వల్లూరివారి దివాణము వారిస్వాధీనములోనే యుండెను. అందు వివాహము నడుపుటకును, అవనిగడ్డనుండి పురోహితుని పిలిపించుటకును, తక్కినఏర్పాటులు చేయుటకును సుబ్బారావుగారే యొప్పుకొనిరి. వివాహము శాస్త్రప్రకారము మంత్రములతో జరిగెను. సంతకములు చేసినవా రందరు హాజరైరి. నేనును కొంతమంది మిత్రులు భార్యలతోగూడ హాజరైతిమి. ఆడువాం డ్రందరు పెండ్లికూతును మధ్య నిడుకొని ఛాయాపటము తీయించుకొనిరి. ఇంతచేసితిమిగాని ఆవధూవరులతో భోజనము చేయ సాహసింపలేకపోతిమి. ఏనుగుపై అంబారీలో వధూవరుల గూర్చుండబెట్టి మేళతాళములతో ఊరేగింపు జరిపితిమి.

ఇంత బాహాటముగ నిర్లక్ష్యముగ వివాహముచేసినం దుకు బ్రాహ్మణసంఘము మమ్ము సంఘబహిష్కృతు లని తీర్మానించెను. మేమును దానిని లక్ష్యపెట్టక తగిన పురోహితునివలన మాయిండ్లలో కార్యములు నడుపుకొనుచు ఒకరితో నొకరము సఖ్యముగ నుండి కొంకక జంకక వర్తించితిమి. ఆరునెలలలో మెలమెల్లగ బహిష్కారము సడలిపోయెను.

1900 సంవత్సరముననో లేక మరుసటిఏడో మిత్రులము ముచ్చటించుచుండగా తెలుగున వార్తాపత్రికలు మనజిల్లాలో

లేకుండుట శోచనీయమని తలచి, ఒకపత్రిక ప్రకటించుటకు ప్రయత్నములు జరుపుట యుక్తముగదా యనుకొంటిమి. దానికి తగిన ప్రయత్నము లెవ్వరును పైన బెట్టుకొనరైరి. అంతట నేమను న్యాయవాదులలో నొకరగు దాసు నారాయణ రావుగారును తుదకు ఒక తెలుగువారపత్రిక ప్రకటించవలెనని నిశ్చయించుకొంటిమి. నేను ముందు కావలసిన సొమ్ము విహితుల వలన వసూలుపరచియు, కొంత స్వంతమున పెట్టుకొనియు మా యిరువురిపేరను కృష్ణాపత్రిక యను పత్రికను ప్రచురించసాగితిమి. నారాయణరావుగారు తెలుగులో నాకంటె ఎక్కువ ప్రవేశము కలవారు, సరసమైన కవిత్వముచెప్పుటకు సమర్థులు. మొదటి రోజులలోనున్న శ్రద్ధ వారికి క్రమముగా సన్నగిలెను. మొదటి నుండియు వ్యాసములు, వార్తలు సమకూర్చి, పత్రిక వారము నాటికి అచ్చుబడి, వెలువడు భారమంతయు నేనే వహించితిని. పత్రికాకార్యాలయమున అవటపల్లి నారాయణరా వనునొకరు గుమాస్తాగా నేర్పడిరి. ఆయన ఉత్సాహశీలి గావున సంపాద కత్వనిర్వహణమున తోడ్పడుచుండెను. పత్రికపై నభిమానము నానాట హెచ్చుచుండెనుగాని తగినంత ధనసహాయములేక, సహకారములేక విశేషవ్యాప్తి కలిగింపలేకపోయితిమి. ఇంతలో నారాయణరావుగారు అకాలమరణముపొందుట సంభవించెను. పత్రికాప్రకటన మానక సాగించుచునేవచ్చితిని. ఆయూరిలో నొక్కటే ముద్రణాయంత్రము కలదు. అందు పనులు చురుకుగ జరగక పత్రిక సకాలములో చందాదారుల కందింపలేకపోతిమి. ప్రభుత్వోద్యోగులచర్యలు తీవ్రముగ విమర్శించినందుకును, సంఘమందలి దురాచారములను ఖండించినందుకును పురజనులు

మమ్ము తీవ్రవాదులని యెంచుచుండిరి. ఎన్ని లోపము లున్నను పత్రికాప్రకటనమాత్రము జరుపుచునేయుంటిమి.

ఈ సంవత్సరములలో నాకుటుంబమున కొన్ని యవాంతరములు నడచినవి. బందరునకు కాపురమునకు వచ్చునప్పటికి నాకు నాలుగేండ్ల కుమార్తె యొకతె యుండెను. పిమ్మట నిరువురు మగపిల్లలు గలిగిరి. అందొకనికి నాస్నేహితుడు చంద్రశేఖరుని పేరిడితిని. ఆ చిన్నవాడు రెండుసంవత్సరములు పెరిగి ప్లీహావ్యాధివలన చనిపోయెను. పిమ్మట కొలదిదినములకే నాభార్య ఇంకొక మగశిశువును ప్రసవించెను. స్ఫురద్రూపియగు పిల్లవానిని చూచుకొని, తల్లి పూర్వదుఃఖమును కొంత మరచిపోయెను. ఈ చిన్నవాడు మూడేండ్లలోపల మాటలన్నియు నేర్చి ఆమోదముగొల్పు సంభాషణలు చేయుచుండెను. చూచిన ప్రతివస్తువునుగూర్చి ప్రశ్నించి, తెలుసుకొనుచుండెను. రాత్రి వేళల ఆకసమువంక జూచి, నక్షత్రముల వివరము లడుగసాగెను. కాని వీడును అయిదేండ్లు వచ్చునప్పటికి వ్యాధిగ్రస్తుడై 1902 లో మృతుడయ్యెను. రెండుమూడు నిముషములలో జీవములు విడువబోవుచు ఎదుటనున్న తల్లికి రెండుచేతులు మోడ్చి నమస్కరించెను. పిమ్మట తలప్రక్కనున్న నావైపునకు ప్రయత్నపూర్వకముగ తిరిగి నమస్కరించెను. ఎన్నియో ఆశలు గొల్పిన ఈపిల్లవాడు పోవుటచే తల్లి మరింత దుఃఖసముద్రమున మునిగిపోయెను. నాకును హృదయవేదన అతిశయముగ నుండెను.

---

# ఢిల్లీ దర్బారు

ఆసంవత్సరము డిశెంబరులో అహమ్మదాబాదులో కాంగ్రెస్‌మహాసభ సమావేశమయ్యెను. ఆసమయముననే ఢిల్లీలో ఎడ్వర్డు పట్టాభిషేకసందర్భమున ఉత్సవమునకు స్వతంత్రసంస్థాన ప్రభువుల నందరిని రప్పించి గొప్పవేడుకలు సలిపి ఆంగ్లేయ సామ్రాజ్య ప్రాబల్యమును ప్రకటింపవలెనని కర్జనుప్రభువు ప్రకటించి, రాష్ట్రశాసనసభాసభ్యులు మొదలగువారికి ఆహ్వానములు పంపించెను. బందరునుండి కాంగ్రెసుసభకును, ఢిల్లీఉత్సవము జూచుటకును వెళ్ళవలెనని చాలమందిమి కుతూహల పడుచుంటిమి. మా కెవ్వరికి ఆహ్వానములు రాలేదు. ప్రయాణ సమయమునకు అందరును వెనుతగ్గిరి. నరసరావుపేటలో ప్లీడరుగా నుండిన వంకాయల శేషావతారముగారు మాత్రము ఒకసారి నాకు గనుపడి, తాను తప్పక వచ్చెదననియు బెజవాడ స్టేషనులో కలుసుకొందుననియు తారీఖుగూడ నిర్ణయించి చెప్పెను. నేను బయలుదేరి నిర్ణయించిన వేళకు బెజవాడ చేరితినిగాని నా కాయన కనపడలేదు. ఒక్కడనే రైలెక్కి చక్కగ అహమ్మదాబాదు చేరితిని. అక్కడికి హిందూపత్రికాధిపతిగా నుండిన కస్తూరి రంగయ్యంగారు, రంగస్వామయ్యంగారు అను హైకోర్టువకీలు, గౌరవనీయులగు పేరరాజుగారు మొదలగు దక్షిణప్రాంతీయు లెందరో సభకు వచ్చిరి. దక్షిణాదిప్రతినిధులకు ప్రత్యేకముగ బస ఏర్పరచిరి. చలి ఎక్కువగా నుండెను. స్నానమునకు బాగుగ మసలుచుండిన వేడినీళ్ళుగూడ పైన పోసుకొనునప్పటికి చల్లబడి శీతబిందువులు ఉష్ణబిందువులు కలియబోసిన

ట్లుండెను. పండిత అయోధ్యనాథ్‌గారు మహాసభ కధ్యక్షులుగ నుండిరి. వ్రాసి అచ్చొత్తించి ప్రకటించిన ప్రారంభోపన్యాసమును చేతబట్టకనే అందులో నున్న పదములతోడనే ఎచ్చటను మార్పు లేకుండ మిక్కిలి నిపుణత్వముతో సహజసంభాషణవలె ప్రసంగించిరి. సురేంద్రనాథబెనర్జీగారి ఉపన్యాసము అద్భుతముగ నుండెను. ఇతరులు వ్రాసిన విషయములు విడికాగితములమీద వ్రాసి, ఆయన భాషించుసమయములో సందర్భమునుబట్టి జ్ఞాపకార్థము వారి కార్యదర్శి కంటిఎదుట పెట్టిపెట్టకముందే గ్రహించి, ప్రసంగములో వాని నిమిడ్చిచెప్పు వైఖరియు వారి జ్ఞాపకశక్తియు ఆశ్చర్యముకల్పించెను.

ఢిల్లీమహోత్సవము చూడవలె నను కోర్కె యున్నది గాని నా కాహ్వానము రాలేదు. ముందుగా బసనిమిత్తము ప్రయత్నము చేయలేదు. ఇంతగా వ్యయప్రయాసల కోర్చి ఢిల్లీకి చేరినను అచట వసతి లేనియెడల ప్రయోజనముండదు. బసలు దొరకవని బయలుదేరినప్పుడు తెలియదు. ఢిల్లీకి రాను పోను రెండవతరగతిటికెట్టు ముందుగానే కొంటిని. వేరరాజుగారు నడుగగా తన బసలో మరియొకరికి వీలుండునో యుండదో తెలియదని చెప్పిరి. కాంగ్రెసుకు వచ్చిన ప్రముఖు లెందరో ఢిల్లీలో ముందే బసలేర్పరచుకొనిరి. వారందరును ఢిల్లీకి ప్రయాణమయి పోవుచుండిరి. నేనును కానీ, చూతమని వారితోగూడ పయనమై పోతిని. రైలుస్టేషనులో నిలువగనే ఎవరికివారు వెడలిపోయిరి. నేను నాసామానులతో స్టేషనులో నిలచిపోతిని. కూలీలు మాటిమాటికి వచ్చి సామాన్లు తెచ్చెద

మని వేధింపసాగిరి. తుద కొక చిన్న కూలివా డుండగా వానిని బిలిచి నా కప్పటికి వచ్చిన హిందూస్థానీభాషలో సమీపమున ఏదైనా బస కలదా యని ప్రశ్నించగా సత్రము కలదని జవాబు చెప్పెను. అంతట వానిచే సామాను పట్టించుకొని కాలినడకనే ఒక పెద్ద మేడయింటివాకిటికి పోతిమి. ద్వారములో ప్రవేశించగనే రెండువైపుల నెత్తగు గచ్చుటరుగు లున్నవి. అం దొకదానిపై నిరువురు నల్లనిగడ్డాలవారు తలపాగలు పెట్టుకొని చొక్కాలు తొడుగుకొని మనప్రాంతముల మహమ్మదీయులవలె హుక్కా పీల్చుచుండిరి. వ్రాతబల్లమీద రిజిష్టరు పెట్టుకొని లోపలికి పోవువారిపేర్లు వ్రాసుకొనుచుండిరి. ఆమేడ ఎవ్వరిదో స్వంత గృహము. నేను హిందూస్థానీలో నాకు ఆయింట బస దొరకునాయని వారిని అడిగితిని. దక్షిణపుమూల ఖాళీగాయున్నదని రోజు 1 కి రు 6/- లు అద్దెఅనియు, ప్రత్యుత్తరమిచ్చిరి. నే నందుకు సంతసించి ఆరోజుకు రు 6/- లు నిచ్చి రసీదు తీసికొని మేడమీదికి సామానుతో పోతిని. తలదాచుకొనుటకిట్లు స్థలము దొరికినందుకు సంతసించుచు భోజనమునకై సమీపమున పూటకూలిబస కలదాయని విచారించితిని. కాని క్రిందనున్న నల్లగడ్డములవారు హిందువు లని తెలుసుకొనినపిమ్మట హిందువు లెవ్వరో, ముసల్మాను లెవ్వరో, హిందువులలో బ్రాహ్మణు లెవ్వరో, బ్రాహ్మణేతరు లెవ్వరో, బ్రాహ్మణు లైనను మాంస భక్షకు లెవ్వరో, కానివా రెవ్వరో నిర్ణయింపలేక, ఆకలితీరుటకు పాలును పండ్లును రొట్టెయును దిని కాలము గడపనెంచితిని. వీధివెంట బయలుదేరి కొంతదూరము పోవునప్పటికి ప్రతి అంగడి లోను పెద్ద కళాయిలవంటి పాత్రలలో పాలు పొయిలమీద

ప్రాగుచుండెను. ఒక అంగడిలో పాలును, అప్పుడప్పుడు చేసిన రొట్టెయును కొని గదికి తెచ్చుకొని భుజించి, మంచినీరు త్రావి నిదురించి, కొంతసేపటికి మేల్కొని, పట్టణము చూడవలెనని గది తాళమువేసి బయలుదేరితిని. డిశంబరునెలలో నచట మిక్కిలి చలిగాన ఉన్నిలాగును, ఉన్నిషర్టును దట్టమైన ట్వీడ్ లాంగు కోటును, సరిగతలపాగయు, మెడకు ఉన్నికంఫర్టరును ధరించి, కాళ్ళకు ఉన్నిమేజోళ్ళును బూటులును తొడిగికొనియుంటిని. చేతిలో అందమగు చేతికర్ర యుండెనని జ్ఞాపకము. మరియు బంగారుగొలుసుగల వెండి జేబుగడియారమును కోటుజేబులో వేసుకొనియుంటిని. నాకు అప్పటి వయస్సు ముప్పదియారు సంవత్సరములు గాన దార్ఢ్యముతో కాలినడకనే మెల్లమెల్లగ పోవుచుంటిని. పట్టణములో హస్తినాపురము అని యొకభాగ మున, ఇంకొక భాగమున వీధులలో ఇంద్రప్రస్థ మని బల్లలపై వ్రాయబడి యుండెను. చాందినీచౌకు, జుమ్మామసీదు చుట్టు ప్రక్కల దర్శనీయముగ నుండెను. పెద్ద మైదానములో ఇప్పుడు క్రొత్తఢిల్లీ కట్టిన స్థానముననే ఉత్సవము నిమిత్తము ఢిల్లీకి వచ్చెడి సంస్థానాధీశు లుండుటకు ప్రత్యేకస్థలము లేర్పరుపబడెను. బరోడామహారాజు కొయ్యపలకలతో రాజమందిరమువలె నొక కట్టడమును నిర్మాణము చేయించుకొనిరి. దానిని మరల ఊడ దీసి మడతపెట్టి రైలుమీద వారి సంస్థానమునకు గొనిపోవుటకు వీలుగ నిర్మించిరి. రాకపోకలకు ఎఱ్ఱమట్టితో బాటలను వేయించి, ఇంగిలీకమువలె నెఱ్ఱగ గన్పడు దానిపైన అభ్రకపు బొడి చల్లించుటచే తళతళ మెరయుచుండెను. మహారాజులు, నవాబులు చతురంగసమేతముగా దర్బారుకై వచ్చి విడిసియుండిరి.

దర్బారు స్థలమునకు చుట్టును ప్రహారీగోడ కట్టించి, దాని కొక ప్రక్క కొంచె మెత్తుగ పెద్ద అరుగును కట్టించి దానిపై సంస్థానాధీశుల కలంకృతములగు పీఠము లమర్చిరి. మధ్యభాగమున మిక్కిలి సుందరమగు ఉన్నతాసనము నేర్పరచి, దిగువ వివిధ రాష్ట్రముల గవర్నరులు, నుద్యోగులు, శాసనసభ్యులును ప్రఖ్యాతి పురుషులు మున్నగువారికి ఉచితాసనము లమర్చిరి. ఇవి గాక ప్రేక్షకులకుగూడ అవకాశములు సమకూర్చిరి. ఒక నాడు పురవీధులలో గొప్ప ఊరేగింపు, ఇంకొకదినము కాల్బలములు, అశ్వదళములుగల అరువదివేలసేన ఒక్కసారిగ ప్రదర్శింపబడుట, మున్నగు కార్యక్రమములు ప్రకటితములైనవి. సభాస్థలమునకు చుట్టును పహారాలుబెట్టి అడ్డములు గట్టినందున వెలుపలివారలకు లోపల నేమియు కనుపడదు. అందు ప్రవేశమునకు ప్రేక్షకులకు టికెట్లు ఇవ్వబడునని తెలియవచ్చినది. కాని ఈ టికెట్లు ఎప్పు డెవ్వ రిచ్చెదరో తెలియదు. పంజాబు దేశస్థుడగు ఒక డిస్ట్రిక్టుమునసబుతో పరిచయము కలిగెను. ఆయనయు స్నేహపాత్రుడుగ నుండెను. టికెట్టునిమిత్తము ఆయన ప్రయత్నము చేయుచున్నాడు గాన నాకు నొకటి సంపాదింతునని వాగ్దానముచేసెను. కాని తుద కాయనకు లభించుటే దుష్కరమైనది. ఇట్లుండగా నే నుండిన బసలో క్రింద నున్న కొళాయి యొద్ద ముఖము కడుగుకొనుచుండగా "వీరే వెంకటప్పయ్య" అని యెవరో అనిరి. నే నాశ్చర్యముతో తిరిగి చూచునప్పటికి నా చిరకాలమిత్రుడు నంబూరి తిరునారాయణస్వామి కనబడెను. నే నున్న మేడక్రింది కొట్లలో ఏలూరినుండి వచ్చిన మిత్రులతోగూడ మూడుదినములుగా వంటలుచేసికొనుచుంటి

మని ఆయన తెలిపెను. దర్బారునకు టికెట్లనిమిత్తము మరల ప్రయత్నముచేయ నారంభించితిమి. దర్బారునాటి ఉదయమున టికెట్లు ఇచ్చెడి స్థానము తెలుసుకొని మేము పోవునప్పటికి టికెట్లు అయిపోయిన వని తేలిపోయెను. రాజదర్శనము లే కున్నను తీర్థసేవయైనను చేయుదమని యమునానదిలో స్నానము చేసితిమి. పట్టణమునకు మరలివచ్చు సమయమున అడవిగడ్డి మోపులు దాల్చి వచ్చు ఒంటెలమంద కనబడెను. ఒక్కసారిగ అన్ని యొంటెల నెన్నడును చూచియుండలేదు. పిల్లపనుగులవలె నుండు గవనిబఱ్ఱెలుగూడ మందలై కన్పించినవి. ఇవి నిత్యము బిందెడుపా లిచ్చునని చెప్పుచుండిరి. వీని పెరుగు రాయివలె గడ్డకట్టియుండును. ఒకరాత్రి నేను వీధివెంట బోవుచుండ విశాలమగు పెద్దతొట్టిలో పాలు బిందెలతో తెచ్చి కుమ్మరించు చుండుట కననయ్యెను. ఆ పాల నేమిచేయుదురని యడుగగా ఒక సంస్థానాధీశుని గుఱ్ఱములు త్రాగుటకై తొట్టిలో బోయు చున్నారని చెప్పిరి.

దర్బాను చూడకున్న మానె, ఊరేగింపు టుత్సవమైన చూత మనుకొంటిమి. దానిని చూచుటకై వీధులలో తగిన ప్రదేశములను ప్రజలు ముందుగా వెదకుకొనుచుండిరి. జుమ్మా మసీదు వాకిలిమెట్లు ఒకదానిపై నొకటిగ పొడవున వరుస వరుసగ పైకి బోవుచుండుటచే పెద్ద నాటకశాలలో గాలరీవలె నుండెను. కొన్ని వేల జనులు ఆమెట్లపై కూర్చుండవచ్చును. ఆమసీదు అధికారులు ఇదే సమయమని మెట్లకు టికెట్ల నేర్పరచి వసూలుచేయ నారంభించిరి. టికెట్లఖరీదు క్రమమున కొన్ని

వందలరూపాయలవరకు బెరిగెను. మసీదుబురుజులమీాద సహి తము స్థానము లేర్పరచి కొన్నివందలరూపాయలు వసూలు చేసిరి. ఇక రాజవీధులప్రక్క ఇండ్ల మేడలమీాదను, డాబాల మీాదను గోడలమీాదనుగూడ ప్రేక్షకులు తావులేర్పరచుకొనిరి. నేను మసీదుమెట్లమీాద తొమ్మిదిరూపాయలకు టికెట్టు కొంటిని. ఉత్సవము మధ్యాహ్నము పండ్రెండుగంటలకు ఆగ్రాద్వారము గుండ బయలుదేరెను. అందుకు సూచనగ పెద్దఫిరంగులమ్రోత వినబడెను. పిమ్మట నశ్వరాజము నెక్కిన భారతీయనాయక ప్రముఖుడొకడు పొడసూపెను. ఈతడు సర్ ప్రతాపసింగు అని కొందరు ప్రేక్షకులు చెప్పుచుండిరి. ఆయనవెంట గుఱ్ఱములపై బ్యాండువాయిద్యము బయలుదేరెను. వారివెనుక పదాతివర్గము నడువసాగెను. ఆ పదాతుల వెన్నుదన్ని మరియొక బ్యాండు వాయిద్యమును వారి వెన్నంటి అశ్వములపై రాజకుమార దళమును నడువసాగెను. సమానవయస్కులు, సుందరగాత్రులు నగు రాకుమారులు తెల్లనిషేర్వాణీలును, లేతనీలవర్ణపుదలపా గలును, రత్నఖచితములై మెరయుచున్న కల్కితురాయిలు ధరించి, మణులుచెక్కిన కంఠహారములతో తేజోవంతములగు ముఖారవిందములతో చూచువారల కన్నులకు ఆనందము గొల్పుచుండిరి. నక్షత్రములు ఆకసమునుండి దిగివచ్చి ఈ మహోత్సవమున పాల్గొనుచున్నవా యన్నట్లు ఇరువదియేడు గురు రాకుమారులు ఆ శ్రేణిలో నుండిరి. వీ రెక్కిన గుఱ్ఱము లును చిరుతపులిచర్మపుజీనులతో నొక్కరూపున నొప్పారు (Pony) పోనీలు. ఈదళము వెనుక ఆఫ్గన్‌పటానుయువకులు వదులుగానుండు తెల్లని చొక్కాలు తొడిగి, తోకలు విడిచిన

ఆకుపచ్చతలగుడ్డలు పెట్టుకొని పొట్టి టెంగణాలపై సాగిపోయిరి. వారివెంట పెద్దగుఱ్ఱములపై నందమగు దుస్తులు ధరించిన బ్యాండువాయిద్యమువారు హృద్యముగ వాయించుచు వెడలిరి. పిమ్మట నొక వృద్ధగజరాజముపై బంగారునీరుపోసిన హౌదాయందు కర్జనుప్రభువును ఆయనసతీమణియును వెడలి వచ్చిరి. సరిగపట్టెలుగల చిత్రవస్త్రములతో ఆభరణములతో నలంకరించిన ఈగజమున కిరుప్రక్కలను వెండికఱ్ఱలు బట్టుకొని వేత్రహస్తులు నడచుచుండిరి. ఈ ఏనుగు కాశీమహారాజుల వారిది. 1857 సంవత్సరమున విక్టోరియారాణీగారికి భారత చక్రవర్తిత్వము సిద్ధించినపుడు ఢిల్లీలో గావించబడిన మహోత్సవమునాడు ఊరేగిన మహాగౌరవము గాంచినదిగాన దానిని మరల ఆమె కుమారుని పట్టాభిషేకకాలమున ఊరేగింపులో రాజప్రతినిధిగ తానెక్కవలెనని కర్జనుప్రభువు పట్టుబట్టి రప్పించెనట. ఆ యుత్సవమునకు ఎడ్వర్డురాజుగారిసోదరుడు కానాట్ డ్యూకు భార్యాసమేతుడై మనదేశమునకు వచ్చెనుగాని రాజప్రతినిధియగు తానే ముందుబోవలెనని కర్జను శాసించెనట. అందువలన కానాట్ సతీమణితోగూడ గజారూఢుడై వెనుక వచ్చుచుండ కర్జను తాను ముందు నడిచెను. కానాటు వెనుక గజములనెక్కిన మహారాజులు ఏబదిమంది జంటజంటలుగ వారి వారి చోప్దారీలతో మెలమెల్లగ బోవసాగిరి. వారెక్కిన గజములును చిత్రాలంకృతములు గావింపబడియుండెను. వారును వంకరతలపాగల రత్నములుపొదిగిన కలికితురాయిల నమర్చి; పట్టుచొక్కాయిలను తొడిగి మణిమయములగు కంఠహారములను, కంకణములను, భుజదండములను ధరించియుండిరి. ఆదృశ్యము

భారతదేశపు రత్నములన్నిటి నొక్కచో రాశిబోసినట్లు చూప ట్టెను. కాని ఈమహారాజు లందరు విదేశరాజప్రతినిధివెంట దాసులై పోవుట భారతదేశపుబానిసత్వముగూడ ఇచట రూపెత్తి నట్లు కనుపించెను. ఈసంస్థానాధిపతులలో ముందుజంటలో నెవ్వరి నేర్పరచవలెనను ప్రశ్న వచ్చినపుడు మైసూరు, ట్రావె న్కూరుప్రభువులను మొదటిజంటగా నిర్ణయించిరట. ఈవార్త నైజామునకు తెలిసి తాను మొదటివరుసలోనే ఉండవలెననియు అట్లు గానిచో ఉత్సవమున పాల్గొనననియు పంతముబూని స్వంత రైలుమీదనే ఢిల్లీకి వచ్చి రైలుస్టేషనులో తన బండిలోనేయుండి రాజప్రతినిధితో ఉత్తరప్రత్యుత్తరములు నడిపి, తుదకు ట్రావె న్కూరుమహారాజును రెండవవరుసకు దించి, తన్ను మొదటి వరుసలో చేర్చినపిమ్మట బండిదిగి పట్టణములో తనబసకు చేరె నని చెప్పుకొనుచుండిరి.

దర్బారుసమయమున ఈమహారాజు లొక్కొక్కరు లేచి మధ్యపీఠాసీనులై యున్న రాజప్రతినిధియగు కర్జనుప్రభువు నొద్దకు జని, కానాట్ ప్రభువు పరిచయము నొంది, ఆంగ్లప్రభు త్వముపట్ల తమభక్తిని ప్రకటించు ప్రమాణముసల్పుటకు నిర్ణయ మయ్యెనట. అట్లు వారిస్థానములనుండి లేచి కర్జనుప్రభువు నొద్దకు మరలివచ్చుటలో వీపులు కర్జనుప్రభువువైపునకు త్రిప్ప కుండ వెనుకవెనుకకు నడచిపోవలెనను నియమము నవలంబింప వలసియుండెనట. మహారాజు లందరును ఆప్రకారమే వారివారి స్థానములకు మెలమెల్లగ వెనుకవెనుకకే నడిచిరటగాని బరోడా మహారాజుగారు వీపు కర్జనుప్రభువువైపునకు త్రిప్పియే తన

స్థానమునకు బోయినందుకు కర్జనుప్రభువు కోపించి మహారాజు మీాద కొంత చర్యజరిపి, వారిపై నేదియో అపరాధము విధించి నట్లు తెలియవచ్చినది.

ఈ మహోత్సవమున భారతజాతిపతనము నైతికముగ శోచనీయమైనను ఆ దృశ్యము అపూర్వము ననన్యమగు వైభవముతో నిలసిల్లినదని చెప్పవచ్చును. ఈ ఊరేగింపు జరిగిన మరునాడు అరువదివేలసేన ఒక్కచో ప్రదర్శింపబడెనుగాని దానిని మేము చాలదూరమునుండి మాత్రమే చూడగల్గితిమి.

పురాతనమగు ఈమహానగరమున లాల్ ఖిల్లా కుతుబ్ మినారు మున్నగు అపురూపములగు దృశ్యములు తిలకించి పిమ్మట ఆగ్రాకు చేరి, అచట నొక హిందూగృహస్థు ఇంట బసచేసితిని. టాజమహల్ అక్కడికి సమీాపముననే యుండుట చేత మిక్కిలి ఆతురతతో ఆభవనముచెంతకు బోయి కొంచెము సేపు దానిని ఆశ్చర్యముతో పరికించి, పిమ్మట సావధానముగ చూడవచ్చునని మరల బసకు వచ్చితిని. దుకాణమునుండి పాలును, పండ్లు తెమ్చుకొని భుజించి కొంత విశ్రమించి మరల టాజమహల్‌ను దర్శించితిని. ఈదివ్యభవనమునకు బట్టిన పాల ఱాయి యంతయు జయపూరునుండియు, ఎఱ్ఱయినుకరాయి ఫట్టిపూరుసిక్రీనుండియు తెప్పించిరట. దాని నిర్మాణకౌశలము గాని శిల్పవైచిత్ర్యమునుగాని వర్ణింపశక్యముగాదు. ఇది చంద్రశిలామయమైన అపురూపచిత్రనిలయము. దీనిని దర్శించునపుడు కలలో జూచుచున్న మయసభ యని తోచును. 'పాలరాతితో

గట్టిన కవితాకల్పన' యని ఆంగ్లేయగ్రంథకర్త వర్ణించియున్నాడు. పచ్చలతివాచితో కప్పబడినట్లు పచ్చికతోడను వృక్షములతోడను శృంగారముగనుండు ఉద్యానవనమధ్యమున కట్టబడియున్నది. దీని చుట్టును ఎఱ్ఱరాతితో గట్టిన ప్రాకారము గలదు. ముఖద్వారము మహోన్నతమై, విశాలమై, సుందరముగానున్నది. ఈ ద్వారమునుండి తోటలోనికి బోయి నిడుపగు పాలరాతితిన్నెమీదుగ భవనమునకు బోవుటకు బాట ఏర్పరుపబడినది. ఈ బాట కిరుప్రక్కల వృక్షములు గలవు. బాటగానున్న ఈతిన్నె మధ్య శుభ్రజలములతో నిండి విలాసార్థముగ కట్టిన పాలరాతికాలువ గలదు. ఇందు కలువమొదలగు పుష్పములు వికసించుచుండును. ఈ విలాసకుల్యాల కిరుప్రక్కల చిన్న తోట్లలో గుమ్మటములుగ పెరుగుచున్న వన్నెవన్నెల మొక్కలు కనుపండువొనర్చుచుండును. ఈ తిన్నెమీదుగ బోయి కొంచె మెత్తుగను, విశాలముగ నున్న చలువరాతి వేదిక నెక్కియుంచుక ముందు నడిచి దివ్యభవనమును ప్రవేశించవచ్చును. ఈవేదికకు నాలుగుమూలలను నాలుగు - ఎత్తును, ఎత్తునకుదగిన లావును గల చలువరాతిస్తంభములును, వానిపై అందమునైన బురుజులును పొంకము లీనుచుండును. ఈ వేదికపై నిలచి ఆ దివ్యభవనమును దర్శించినప్పుడు హృదయము మహదానందమున మునిగిపోవును. ముఖద్వారమున్న కుడ్యమున కిరుప్రక్కల గోడలు తలుపురెక్కలవలె నించుక లోపలికి వంపుదీర్చి కట్టబడినవి. వానిపై చిన్నబురుజులు ముద్దులొలుకుచున్నవి.

గోడలమీదినుండి పై వరకు నొక్కరాతితో కట్టబడిన ట్లున్న ఆభవనము నునుపుదేరె అద్దమువలె నీడ లీనుచుండును. ఈ నిర్మాణమునందు కలప వినియోగించక రాళ్ళతోడనే పై కప్పు అమర్చబడినది. భవనములోపల ప్రవేశింపగనే వెలుపలి గోడలకు కొంత యెడము వదలి, లోపలిభాగమున వెలుపలి రూపమునకు ప్రతిరూపముగ గట్టబడిన గర్భగృహము గలదు. ఈ రెండుగోడల మధ్యస్థలము గదులుగా నేర్పరుపబడినది. ఒక గదినుండి మరియొక గదికి పోవుటకు మధ్య గోడలు లేకపోవుటచే కోణములుదీర్చిన ఒకవలయమ్ముగుండ గర్భగృహమునకు చుట్టు ప్రదక్షిణముచేయుటకు వీలుగా నున్నది. ఇందు రెండు లేక మూడు గదులు దాటి మరియొక కోణమునకు జేరులోపల వెలుపలినుండి యొక పెద్దద్వారమును, దానికి నెదురుగ గర్భ గృహమునకు బోవుటకు మరియొక ద్వారమును గలదు. ఈ గదులలో గోడలమీద ఆకులు పువ్వులతీగలు అందముగ చెక్కబడి పచ్చలు, గోమేధికములు, పుష్యరాగములులోనగు విలువ గలరాళ్ళు పొదగబడి, ఎప్పుడును వాడకుండ జీవముతో పెరుగు చున్న పూదీగవలెనే గన్పడుచుండును. అక్కడక్కడ ఈ పుష్ప లతలప్రక్క అందములగు చిలుకలు, గోరువంకలు మొదలగు పక్షులును మణివికారములై, జీవకళ యుట్టిపడుచుండును. ఈ గర్భగృహము గోళాకారమగు పెద్ద చంద్రశిలాగోపురము. దాని శిఖరము నర్ధచంద్రాలంకార నిర్మితము. ఈ గోపురము ఇనూ్నరడుగుల యెత్తు. గోపురముక్రింద గర్భగృహమధ్యమున రెండు సమాధు లున్నవి. అం దొకటి షాజహానుభార్యదనియు, రెండవది షాజహానుదనియు చెప్పుదురు. ఈ సమాధులకు చుట్టును

అనన్యమగు శిల్పవిద్యాకౌశల్యమును ప్రకటించు చలువరాతి యలవ యొకటి కోణములుదీర్చి, మణిమయపుష్పలతాలృకంతమై, యొప్పారుచున్నది.

మహాప్రసిద్ధమగు ఈ నిర్మాణమువెనుక దాని నానుకొనియే యమునానది ప్రవహించుచున్నది. వెన్నెల రాత్రులందు చంద్రికాప్రవాహమున తేలియాడు ఈ చంద్రశిలాభవనసౌందర్యము కన్నులార జూచియానందించవలసినదేగాని వర్ణింప దరము గాదు. మరియొకమారు దీరికచేసుకొని రాత్రివేళ అట్టి తరుణమున ఆసుందరభవనమును దర్శించితిని. అమందానందము నొందితిని.

ఢిల్లీనుండి నాకంటె ఒకపూట ముందు బయలుదేరి ఆగ్రాలో నన్ను కలిసికొందు ననిచెప్పిన మిత్రుడు తిరునారాయణస్వామి కనుబడకపోయినందున, నతనియొద్ద దమ్మిడీయైన లేకుండ నేను తీసికొనియుండుటచే అత డెక్కడ నెంత నిస్సహాయుడుగ నుండెనో, ఏమైపోయెనో యను చింత హృదయశల్యమై బాధించుచుండెను. కాబట్టి మరునాడు రైలుస్టేషనుకుబోయి రైలునిమిత్తము వంతెనపై నిలచి చూచుచుంటిని. కొంతవడికి రైలు వచ్చినది. మిత్రుడు కనుపింపడాయెను. ఇంతలో నెవ్వరో వెనుకనుండి నాభుజములను పట్టుకొని నేను వెనుకకు తిరుగకుండ నిలిపిరి. తిరునారాయణే యైయుండునని తలచి, ఇంతలో పట్టు కొంచెము సడలుటచే దిరిగిచూచునప్పటికి వంకాయలపాటి శేషావతారమును, మరియొకమిత్రుడును గనుపించిరి. ఢిల్లీ

ప్రయాణమునకు నన్ను బెజవాడలో కలిసికొందుమనని చెప్పిన ఈ మిత్రుడు ఇప్పటికి మరల తలవనితలంపుగ నిట్లు కంటబడెను. ఆయన మరికొందరు బెంగుళూరువారితో కలసివచ్చెను. వారితో గలసి, పట్టణములోనికి బోయి వారి స్వహస్తపాకమున చేరితిని. వంకాయబజ్జితో స్వయంపాకము చేసుకొని భుజించితిని. అప్పటికి అన్నము దిని పంద్రెండుఘడియలయినందున ఆవంకాయబజ్జి అమృతప్రాయమై తోచెను. పిమ్మట వారు మధుర, బృందావనము మొదలగు తీర్థయాత్రల కరిగిరి. నేను కాశీ, ప్రయాగ, కలకత్తా జగన్నాథముల సేవింప క్రొత్తమిత్రులతో కలసి పయనమైతిని. కాశిలో గంగాస్నానముచేసి విశ్వనాథుని దర్శనము చేసితిమి. విశ్వనాథాలయము చిన్నదియైనను సుందరముగనే కట్టబడినది. విశ్వనాథుని లింగము ఒక సావడిలో వెండిరేకు పొదిగిన నేలతొట్టికి మధ్య నున్నది. ఈ లింగము దగ్గర పూజారియొకడు దుప్పటికప్పుకొని, తలగుడ్డతో కూర్చుండెను. మడిమొదలగు మర్యాదలుగాని మంత్రములుగాని లేనందున విపరీతముగ గానుపించెను. యాత్రికులు కులవివక్షలేక, మంత్రసహితముగ అభిషేకముచేయగలవారు క్లప్తముగ మంత్రముచెప్పి, స్వయముగ లింగమును తాకి, అభిషేకముచేసి, పత్రములు పూవులు లింగముపై బెట్టి, తొట్టిలో దక్షిణలు వేసి పోవుచుండిరి. ఇతరులు లింగముమీద నీళ్ళుపోసి చేతులతో లింగమును ముట్టుకొని కండ్లకద్దుకొని పూలు సమర్పించి పోవుచుండిరి. ఇట్లు కులభేదములు పాటింపక లింగమును స్వయముగ ముట్టుకొని ఆరాధించు నాచారము అసాధారణమైనను గొప్ప సంతుష్టి కల్పించినది. శంభోశివ యని నామోచ్చారణచేయుచు

ఆరాధనచేయు మహాభక్తుల సందడిచే ఆస్థలము మహాపవిత్ర ముగ గన్పట్టినది. దేవాలయపు క్రిందిభాగము మసీదు పోలికగా నుండుటచే మసీదునే దేవాలయముగా మార్చినట్లు తలచితిని. ఔరంగజేబు కాలములో ఆలయము మసీదు కాగా, ఆ మసీదును మరల దేవాలయముగ మార్చిరేమో యనుకొంటిని. పిమ్మట ప్రయాగలో గంగాయమునాసంగమున స్నానముచేసి ఆవెనుక గయకు బోయి, గయలో విష్ణుదేవుని ఆలయమున నా తల్లిగారికిని పితరులకును పిండములువేసితిని. తండ్రి బ్రతికి యుండగా పిండమువేయవచ్చునా, లేదా యను సంశయము కలిగినదిగాని మాతల్లికి నేను కర్మచేసితిని. పిమ్మట ప్రతిసంవత్స రము ఆబ్దికముపెట్టి పిండదానము చేయుచుంటిని. కనుక ఇట్టి పుణ్యస్థలమున పిండ మేల వేయకూడ దని నమ్మి నా ధర్మమును తీర్చితి ననుకొంటిని. హిందూస్థానములో తీర్థవిధులు పెట్టించు గయావళులు మొదలగువారు ధనోన్మత్తులును ధనార్జనాసక్తులు మాత్రమేగాని నిజముగ భక్తిపరులు గారు. స్మార్తవిద్యాజ్ఞాన మైనను పూజ్యమే. గయలో నాకు లభించిన బ్రాహ్మణుడు తీర్థవాసియైనను గయావళిగాడు. మంత్రవిధానము తెలిసినవాడు. వారియింటనే నాకు భోజన మమర్చెను. సజ్జనుడుగ గన్పడి నాడు. ప్రయాగలో అంగళ్ళవీధిని పోవుచు నొక యున్నిదుప్పటి నాలుగు రూపాయలకు తీసికొంటిని. అది దట్టముగా ఇరువది మూళ్ళ పొడవుండెను.

అటనుండి కలకత్తానగరము ప్రవేశించితిమి. ఒక్కరోజు మాత్ర మక్కడ నుంటిమిగాని చూచిన విశేషము లేమియు

జ్ఞాపకములేవు. కలకత్తానుండి జగన్నాథమునకు రాత్రి పండ్రెండుగంటలకు చేరితిమి. అచట దేవాలయములోపల జగన్నాథసుభద్రాబలభద్రుల విగ్రహములు మూడును వరుసగ ఎత్తగు వేదికపై నిలువబెట్టియున్నవి. ఆ వేదికచుట్టును భక్తులందరు ప్రదక్షిణమొనర్తురు. బంగాళీయులును, ఉత్కళులును భక్తిపరవశులై పాటలుపాడుచు ప్రదక్షిణముచేయుదురు. ఈస్వామికి జాముజామునకు వంటకములు నివేదింతురు. ఈ వంటకములు కుమ్మరులు వండి, కావళ్లమీద దేవాలయము లోపలికి గొనిపోవుదురు. ఇవి స్వామికి నివేదనమైన పిమ్మట భక్తులకు అమ్ముదురు. ఈ ప్రసాదమును అన్ని కులముల వారును సేవింతురు. మేమును ఆప్రసాదమును కొని కొద్దిగా సేవించితిమి. కాని మాతోడి బ్రాహ్మణకుఱ్ఱవాడు కండ్ల నీళ్ళు బెట్టుకొని అతికష్టముతో ఆప్రసాదమును స్వీకరించెను.

ఇంటికి జేరినపిమ్మట తిరునారాయణస్వామినిగూర్చి విచారణసేయగా ఏలూరుకాపురస్థులు మోతేగంగరాజుగారు మొదలగువారు తోడైనందున వారితో బనారసు కలకత్తాల మీదుగా ఇల్లుచేరినట్లు తెలిసినది. ప్రయాణములో నెన్ని విశేషములు చూచినను, ఎన్ని అనుభవములు కలిగినను-స్వేచ్ఛగా ఆకాశమున ఎంతో దూరము విహారముచేసిన పక్షి మరల గూటికి చేరినట్లు-నేను ఇంటికిచేరి, మామూలు వృత్తికార్యములు నడుప జొచ్చితిని. యాత్రలలోని నూతనానుభవముల జ్ఞానము కొంత విశాలదృష్టి కల్పించుటకు కారణమయ్యెనని తలంచుచున్నాను.

# లాయరే ముద్దాయి ఆయెను

పిమ్మటిదినములలో ముఖ్యాంశ మొక్కటి వివరింపదగి యున్నది. బందరు సమీపమున అవనిగడ్డలో నొక డిప్యూటీ తహశ్శీలుదారుడు మాజస్ట్రేటుగా సహితము వ్యవహరించు చుండెను. ఇతడు చాల లంచగొండియనియు, ప్రజలను పీడించు చున్నాడనియు చెప్పుకొనుచుండిరి. తనపశువులు మరియొకరి పొలములో బడి పైరు నష్టపరచిన వనుకారణమున వాని నా రైతు బందెలదొడ్డికి తోలుకొనిపోవుచుండగా నడ్డగించి ఒక రైతు తనయింటికి తోలుకొని వెళ్ళి కట్టివేసుకొనెను. అవనిగడ్డ మాజస్ట్రేటుదగ్గర ఛార్జిదాఖలుచేయబడినది. ఇది అవకాశముచేసు కొని పశువులఖామందైన రహితును జయిలులో బెట్టి నూరురూపా యల లంచము తీసికొని విడుదలచేసి, పిమ్మట కేసు విచారణచేసి దొంగనేరముక్రింద రు 10/-లు జరిమానా విధించెను. ఇట్టి వియే అనేకులవలన లంచములు పుచ్చుకొనినట్లు జిల్లాకలెక్టరుకు మహాజరులు వచ్చినందున డిపార్టుమెంటల్ విచారణ చేయుటకు కలెక్టరు నిర్ణయించి, అందుకు తనకు సహోద్యోగియగు బోసు అనువారిని నియమించెను. ఆయన సాకల్యముగా విచా రించి, మాజిస్ట్రేటు లంచములు పుచ్చుకొనినట్లు రుజువైనదని జిల్లాకలెక్టరుకు నివేదిక నంపెను. ఆకాలమున శ్రీ పండిత నాగేశ్వరరావుగారు హెడ్ క్వార్టర్సు డిప్యూటీమాజిస్ట్రేటుగా నుండి, జిల్లాకలెక్టరుకు మిక్కిలి యిష్టులుగా నుండిరి. బోసుగారి నివేదికను కలెక్టరు నాగేశ్వరరావుగారి కిచ్చి, దానిని చదివి అభిప్రాయమును తెలుపుమనెను. నాగేశ్వరరావుగా రా నివేది

కను పరికించి సాక్షులు ప్రమాణముచేసి సాక్ష్యమీయలేదు గనుక అది విచారణలో గొప్ప లోపమని తెలిపిరి. అంతట కలెక్టరు నాగేశ్వరరావుగారినే సాక్షులను క్రమముగా విచారించి నివేదిక పంపవలసినదని ఆర్డరువేసెను. ఇంతలోనే అవనిగడ్డ మాజిస్ట్రేటు నాగేశ్వరరావుగారిని దర్శించి, వారి అభిమానమును సంపాదించుకొనగల్గెనని ప్రజలు బాహాటముగ చెప్పుకొనసాగిరి.

నాగేశ్వరరావుగారు మాజస్ట్రేటుమీద మహజరులు పెట్టినవారిని వారి సాక్షులను విచారణచేయుటకు వాయిదావేసి నోటీసులు పంపిరి. వానిని పుచ్చుకొనక తప్పించుకొని తిరుగుచు మహజరులుపెట్టినవారు, సాక్షులు వాయిదాలకు హాజరుగాక పోవుట సంభవించినది. నాగేశ్వరరావుగారియొద్ద హాజరైన యెడల మహజరులోని అంశములు అబద్ధములని తీరుమానించి తమపై నేరారోపణ చేయుదు రనుభయము కలిగి వారట్లు తప్పించుకొనుచుండిరి.

ఇట్లుండగా చల్లపల్లి జమీందారుగారికి వారిసోదరులకును గలిగిన విరోధములనుబట్టి వారి రహితులలో కక్షలు ప్రబలి నొకరిపై నొకరు దౌర్జన్యములుజరుపుకొనినట్లు పెద్ద కేసులు మాజస్ట్రేటుకోర్టులో దాఖలైనందున ఆవిచారణ నాగేశ్వరరావు గారే జరుపుట సంభవించినది. జమీందార్ల మధ్య విరోధమును బట్టి ఏర్పడిన కేసు గనుక బందరులోని పెద్దవకీళ్ళందరును ఏదో ఒకపక్షమున పనిచేయుటకు వాయిదానాడు కోర్టులో హాజరైరి. ఇతరు లనేకులుగూడ వింతజూచుటకు వచ్చి కోర్టు నిండియుండిరి. విచారణజరుగుచుండగా అవనిగడ్డమాజస్ట్రేటుగారికి నూరు

రూపాయలు లంచమిచ్చి రు 10/-లు జరిమానాపడిన రహితు గూడ ఏదో పనిమీద బందరుకు వచ్చి, కేసువిచారణ చూచుటకు కోర్టుకు వచ్చెను. ఆ రహితును నాగేశ్వరరావుగా రెట్లు గుర్తించిరో ఊహింపశక్యముకాదు గాని ఎట్లో గుర్తించి కేసువిచారణమధ్యనే ఆరహితును 'పకడ్ లేవ్' అని జవానుకు బిగ్గరగా ఆజ్ఞాపించెను. ఆరహితు వెలుపలకు పరుగెత్తెను. జవాను వెంబడించి పట్టుకొని హాజరుపెట్టెను. రు 2000/-లకు జమీనిచ్చి తాము విచారించుచున్న అవనిగడ్డమాజస్ట్రేటుమీది విచారణవాయిదానాటికి హాజరుకావలసిన దనియు లేనియెడల జయిలులో నుండవలసినదనియు నాగేశ్వరరావుగా రుత్తరువు వేసిరి.

రామాయణములో పిడుకలవేట్లాటవలె విచారణమధ్యమున జరగిన ఈ నిరంకుశచర్య కోర్టులో నున్నవా రందరకు విస్మయము కల్పించెను. అచ్చట నుండి ఈచర్య యంతయు చూచుచున్న భట్రాజు వెంకట్రాయుడుగా రను సెకండుగ్రేడు ప్లీడరు త్వరితముగా సబుకోర్టుకు వచ్చి, అక్కడనున్న ప్లీడ ర్లందరితో నాగేశ్వరరావుగారు నడిపించిన దౌర్జన్యమునుగూర్చి వివరించి, దీనికి తగిన పరిహారము ఆలోచింపవలసినదని నొక్కి చెప్పెను. ప్లీడర్లు వారివారి పనులనిమిత్తము వెడలిపోయిరి. వల్లూరి సూర్యనారాయణరావుగారును నేను మాత్రమే నిలచి యుంటిమి. వారు నాకు ఇంచుక సీనియ రయినను మిత్రులు గావునను స్వభావముచే ప్రభుత్వోద్యోగుల లంచగొండితనమును, నిరంకుశత్వమును నిరసించువా రగుటచేతను ఈసమయమున

మనము జోశ్యము పుచ్చుకొనుట అవసరమని పలికెనమీదట మేము ఇరువురమును భట్రాజు వెంకట్రాయుడుగారును కలిసి పండితనాగేశ్వరరావుగారికోర్టుకు వచ్చుసరికి ఆయన ఆనాటికి పని ముగించుకొని ఇంటికి వెడలిపోయిరి. ఆ రహితువలన వకాల్తునామ తీసికొని, అతని విడుదలనిమిత్తము నాగేశ్వరరావుగారియొద్దనే అర్జీ దాఖలుచేయుటకు నిశ్చయించుకొని పండిత నాగేశ్వరరావుగారు న్యాయవిరుద్ధముగను, నిరంకుశముగను, ద్రోహబుద్ధితోడను ప్రవర్తించినారని అర్జీలో వివరముగ వ్రాసితిమి. నాగేశ్వరరావుగారు ఇంటిలో నుండగా అక్కడనే వారి కిచ్చితిమి. వారు దానిని చేత దీసుకొని చదువుచుండగా ఇంచుక చేయి వణికినదిగాని వెంటనే దృఢత్వమును బూని, "అర్జీదారునిపై వేయబడినఉత్తరువును రద్దుపరచుటకు కారణము లే"దని యుత్తరువువేసెను. అంతట మేము అప్పటికి చేయునదేమియు లేదని యింటికి చేరితిమి. ఆ రహితు ఎటులనో జామీనిచ్చి యింటికి జేరెను. నాగేశ్వరరావుపంతులు తనకు మేమిచ్చిన అర్జీలోతాను నిరంకుశముగను, ద్రోహబుద్ధితోడను ప్రవర్తించినాడని మేము వ్రాసిన అంశమును ఆధారముచేసుకొని మమ్ముల నిరువురిని ఎందుకు ప్రాసిక్యూషను చేయగూడదో సంజాయిషీ చెప్పవలసినదని నోటీసులు పంపించుచు, జిల్లాజడ్జిగారికిగూడ ఇందువిషయమున మామీద చర్యజరుపవలసినదని లేఖ యొకటి వ్రాసి పంపెను.

ఈనోటీసు మాకు పంపినవిషయము బందరుపురమునందంతట ప్రాకిపోయెను. నాగేశ్వరరావుగారి చర్యలును, అవనిగడ్డ

మాజిస్ట్రేటుపట్ల ఆయనపక్షపాతమును అందరికి తెలిసినవిషయ మగుటచే మేము వ్రాసినవాక్యములు సత్యదూరములుకావని ఎల్లరును గ్రహించినను మ మ్మాత డేమి చేయునోగదాయని వ్యాకులత నొందుచుండిరి. నాగేశ్వరరావుగారు ఆ ఆసామిని ఆకస్మికముగ పట్టి, పోలీసుహవాలులో నుంచిన సమయమున న్యాయవాదులు చాలమంది యుండినకారణమున వా రందరి వలనను జరిగినవిషయము జరిగినట్లు వివరముగ తెలుపు ప్రమాణ పత్రములను వ్రాయించి, తీసికొని శ్రీ జె. డి. సామ్యుయల్ అను క్రిమినల్‌లాయరును మాపక్షమున పనిచేయుడని కోరగా ఆయన తోడిన్యాయవాది యగుటవలన ఉచితముగనే పనిచేయు టకు సమ్మతించి, వాయిదానాటికి దాఖలుచేయుటకు అర్జీ తయారుచేసెను. మా అర్జీలో వ్రాసిన అంశములు సత్యము లనియు, పార్టీకి న్యాయముజరుగుటకు వ్రాయబడినవేగాని అధికారనిర్వహణమునకు అడ్డముగానెంచునవి కావనియు, మామీద జారీచేయబడిన నోటీసుచర్యను రద్దుపఱచవలెననియు వ్రాసి నాగేశ్వరరావుగారికోర్టులో మాతోపాటే హాజరై అర్జీని, న్యాయవాదు లిచ్చిన ప్రమాణపత్రములతోగూడ దాఖలుచేసి, తన పార్టీదారులైన ప్లీడర్లు అర్జీలో వ్రాసినవిషయము అఫిడ విట్లుమూలకముగ ధృవపడుచున్నదిగాన వీరిమీద జరుపుచర్య న్యాయసమ్మతము కాదని వాదించెను. నాగేశ్వరరావుగారు ఈవాదనను అంగీకరించక మమ్ముల నిర్వరను క్రిమినల్‌ప్రొసీ జరుకోడ్డు 477 వ శెక్షనుక్రింద పోలీసుహవాలుచేసి వెంటనే మరియొక మొదటితరగతిమాజస్ట్రేటునొద్దకు బంపెను. ఈఉత్త రువు గ్రామములో గొప్ప సంచలనము గావించెను. ప్లీడర్లను

పోలీసుహవాలా చేసి, క్రిమినల్ విచారణకై పంపుట అప్పటికి ఎన్నడు వినియెరుగని సంగతి. ప్రజల కది విపరీతముగ గన్ పెను. మొదటితరగతిమాజస్ట్రేటు ఎదుటకు మేము పోయీ పోకముందే ఆయన మమ్ములను మర్యాదతో సంబోధించి "మీకు వాయిదా కావలసియున్నదికాబోలు, ఎంతకాలము కోరెదర"ని మమ్ము ప్రశ్నించెను. హైకోర్టులో రివిజన్ పిటీషను పెట్టుకొని ఉత్తరువుపొందువరకు మూడునెలలు కావలెనని కోరితిమి. మావలన స్వంతపూచీఖత్తులు పుచ్చుకొని ఆయన వాయిదావేసెను.

మేము అంత హైకోర్టులో స్వామినాథను అను బారిష్టరు ద్వారా శ్రీ శంకరనాయరుగారిని నియమించుకొని హైకోర్టులో శ్రీ సుబ్రహ్మణ్యఅయ్యర్ శ్రీ బోడామగార్లు చేరిన కోర్టులో రివిజన్ పిటీషను దాఖలుచేయించితిమి. స్వామినాథను మా కిరువురకుగూడ స్నేహితుడుగాన ఆయనద్వారా చాల సానుభూతితో శ్రీ శంకరునాయరుగారు పనిచేసిరి. ఇట్టి విషయములో రివిజన్ పిటీషను ఫైలులో చేర్చుకొనుట దుర్లభమైనను కొన్ని తీర్పులు శోధించి ఫైలులో చేర్పించిరి. నాయరుగారికి నూరురూపాయలు ఫీజు వెంటనే చెల్లించితిమి. హైకోర్టులో విచారణ వాయిదా పడులోపల స్వామినాథను క్రిందికోర్టురికార్డులు వగైరా తెప్పించి తర్జుమాచేయుచుండెను.

ఇంతలో అవనిగడ్డమేజస్ట్రేటుచే పదిరూపాయలు జరిమానా విధింపబడిన ఆ ఆసామీ బందరుడిప్యూటీ మాజస్ట్రేటు అనగా నాగేశ్వరరావుగారియొద్దనే అపీలు దాఖలుచేసెను.

నాగేశ్వరరావుగారు క్రిందికోర్టుతీర్పు ఖాయముచేసిరి. ఆతీర్పు మీాదగూడ రివిజన్‌పిటీషను హైకోర్టులో దాఖలుచేయబడెను. మరియు జిల్లాజడ్జిగారికి నాగేశ్వరరావుగారు తగు చర్యనిమిత్తము లేఖ పంపిరని పైన వ్రాసితిని. జడ్జిగారు దానిని తనపై బెట్టుకొనక మాలో సూర్యనారాయణరావు హైకోర్టువకీలుగాన మా యిర్వురవిషయముగూడ విచారణకు హైకోర్టునకే పంపివేసెను. అనగా న్యాయవాదులచట్టముక్రింద విచారణనిమిత్తము పంపబడినదనుట. కాబట్టి అవనిగడ్డమాజిస్ట్రేటు వేసినఆర్డరులు తీర్పులు, మేము వ్రాసిదాఖలుచేసిన అర్జీయును నాగేశ్వరరావుగారు వేసిన ఆర్డర్లు తీర్పును, బందరుప్లీడరు ఇచ్చిన అఫిడవిట్లును, మాతరఫున సామ్యుయల్‌గారు దాఖలుచేసిన అర్జీయును ఈ కాగితములన్నియు మొత్తమున ఒక్క వ్యవహారముతో సంబంధించిన రికార్డుగా నేర్పడినవి. జిల్లాజడ్జి హైకోర్టుకుపంపిన కాగితములుగూడ వీనికి దోడయినవి.

ఈ వ్యవహార మంతయు ఒక్కసారిగ కోర్టుఎదుట విచారణకు వచ్చునట్లు హైకోర్టులో ఏర్పాటుచేయుటకు స్వామినాథను చాల శ్రమచేసి అధికారులను ఆశ్రయించి, శ్రీ సుబ్రహ్మణ్యము, బోడాముగార్ల కోర్టులోనే ఒక్కవాయిదాకే విచారణకు వచ్చులాగున ఏర్పాట్లు గావించెను. శ్రీ సుబ్రహ్మణ్యముగారు న్యాయమూర్తిగా నుండుట మాకు అనుకూలమని తలచితిమి. కాని ఇంతలో శంకరునాయరుగారు హైకోర్టుజడ్జిగా నియమింపబడుటచే మేము మరియొక న్యాయవాది నేర్పరచుకొనవలసివచ్చెను. మావ్యవహారము విచారణకు వాయిదా

గూడ పడినది. నార్టను అను సుప్రసిద్ధ క్రిమినల్ బారిస్టరును చూచి సంగతులు తెలిపి మాపక్షమున పనిచేయుడని కోరగా రు 500/- ఫీజు కోరిరి. అందుకు సమ్మతించితిమి. మా రికార్డు కూడ యిచ్చితిమి. సొమ్ముమాత్ర మీయలేదు. శుక్రవారము రాత్రి బయలుదేరి తాను తంజావూరులో శనివారమునాడు పని చూచుకొని ఆదివారము ఉదయము మరల పట్టణమునకు వచ్చెద ననియు, ఆరోజున మాతో రికార్డు చదివెదననియు, ఈమధ్య అవకాశము కల్గినపుడు రికార్డు చదివెదననియు వాగ్దానము చేసెను. ఆప్రకారము ఆదివారము ఉదయమున కలిసికొనగా భోజనముచేసివచ్చినతోడనే చదివెదనని చెప్పెను. మే మిర్వు రము శ్రీ రెంటాల వెంకటసుబ్బారావుగారి ఇంటిలో భోజనము చేసి సుబ్బారావుగారితోగూడ నార్టన్‌గారిబంగళాకు చేరితిమి. అప్పటికే ఆయన ఏదో జమీందారీ కేసురికార్డు చదువుచున్న ట్లును కొంచెము తాళినయెడల మా రికార్డు చదువుననియు గుమాస్తా చెప్పినందున మేము వెలుపల చెట్లక్రిందనే యుంటిమి. ఎంత వేచియున్నను జమీందారు కేసురికార్డే చదువుచుండెను. లోపలికి కబురంపి నపుడెల్ల ఇదిగో నదిగో ననుజవాబులే గుమాస్తా చెప్పుచుండెనుగాని లాయరుగారు మారికార్డు చదివే అవకాశము కనుబడలేదు. విసుగుబుట్టి వెంకటసుబ్బారావుగారు వెడలిపోయిరి. మేమిరువురము ప్రొద్దుజారిపోవుచున్నకొలది వ్యాకులచిత్తులమగుచుంటిమి. ప్రొద్దు తూలిపోయినది. రేపే విచారణకదా రికార్డు చదువుట కవకాశము లేదుగదా, ఏమి చేయదలచినారో గట్టిగా తెలుసుకొనవలసినదని గుమాస్తాను బలవంతపెట్టగా ఆయన లోనికి బోయి వచ్చి మరియొక రోజును

వాయిదావేయించెదనుగాన తొందరపడనవసరము లేదని సమాధానముచెప్పినట్లు తెలిపెను. ఎంతయో శ్రమమీద మావ్యవహార మంతయు శ్రీ సుబ్రహ్మణ్యము శ్రీ బోడాముగార్ల ఎదుట విచారణకువచ్చునట్లు ఏర్పాటుచేసుకొంటిమి. మరల వాయిదాపడునెడల మరి ఎవ్వరియొద్దకు పోవునో, అని ఎంచి ఏమైననుసరే మారికార్డు మా కిచ్చివేయవలసినదని కోరితిమి. గుమాస్తా రికార్డు తెచ్చియిచ్చెను. సూర్యుడు అస్తమించు సమయ మాసన్నమయ్యెను. రికార్డు చేతబట్టుకొని ఏమిచేయుటను తోచక చింతించుచు మైలాపూర్ లజ్ చర్చిరోడ్డునిూద న్యాయవాది శ్రీ కృష్ణస్వామిఅయ్యరుగారి బంగళాకేగితిమి. వారు మిక్కిలి మర్యాదగా మా వర్తమానమంతయు వినిరి. మేము నాగేశ్వరరావుగారి కిచ్చిన అర్జీలోని వాక్యములను చదివి, కృష్ణస్వామయ్యరు మాపై చాల కుపితుడై మీ రిట్లు వ్రాయుట ఎంతమాత్రము సరికాదని పలికెను; కాబట్టియే మేము మీావద్దకు రావలసివచ్చినదని నేను జవాబుచెప్పినమీాదట రికార్డుతీసుకొని మమ్ము భోజనముచేసుకొని రండని పంపెను. మేము భోజనముచేసి వచ్చునప్పటికే ఇంటివాకిట తోటలో దీపమునెదుట రికార్డు చదువనారంభించెను. రికార్డు చదువునపుడు మధ్యమధ్య పండ్లుకొరికి "ఎందు కింత మూర్ఖముగా ఈ దూషణవాక్యములు వ్రాసితి" రని మాత్ర మనుచుండెను. రికార్డంతయు చదివి, రేపు ఉదయము మరల చదివెదననెను. మరునా డుదయమున మాతోగూడ భట్రాజు వెంకట్రాయుడుగా రుండిరి. ఆసామీామీాద చోరీకేసురికార్డు మొదలగు వ్యవహార మంతయు ఆయన అయ్యరుగారికి సావ

ధానముగ తెలియపరచెను. మొత్తమున తొందర లేదనునది ఆయన మాటవలన మాకు తోచెను.

పదునొకండుగంటలకు హైకోర్టులో శ్రీ సుబ్రహ్మణ్యము, బోడాముగార్ల కోర్టుకు చేరితిమి. మొట్టమొదట నార్టనుకు సంబంధించిన జమీందారీఅప్పీలు తీసుకొనబడెను. నార్టను వాదన సాయంకాలము అయిదుగంటలవరకు సాగించినందున మా వ్యవహారము మరల వాయిదాపడునట్లు కనుపించెను. మాలాయరు గారు మనవిచేయగా మరునాటికే వాయిదావేయబడెను. మరి యొకసారి రికార్డు అంతయు చూచి, అందలి ప్రతివిషయమును పూర్ణముగ కృష్ణసామయ్యరుగారు ఆకళింపుచేసుకొనిరి.

మరునాడు మా వ్యవహారము మొట్టమొదటనే న్యాయమూర్తులు చేపట్టిరి. కృష్ణసామయ్యరుగారు అరీ విషయము మొదటనే ఎత్తుకొని "ఈ వ్యవహారమున పూర్వరంగము కొంత కలదు. అది ముందు మనవిచేయుదు"నని అనుమతిపొంది, అనగ అనగ నొకరాజు అన్నట్లు కథారంభముచేసి, పశువుల కడ్డము పోయిన ఆసామికి చోరీనేరముక్రింద శిక్షవిధించుట మొదలు ఆ ఆసామిని చెరలోబెట్టి నూరురూపాయలు లంచము పుచ్చుకొనుటయు, అవనిగడ్డ మేజస్ట్రేటుమీద లంచగొండి యని మహాజర్లు కలెక్టరుకు పోవుటయు, అందుపైన విచారణ, రిపోర్టు, నాగేశ్వరరావుగారి పక్షపాతము, చోరీకేసువిచారణలో అవనిగడ్డ మాజస్ట్రేటుతీర్పును ఆయన ఖాయపరచుట, మహాజర్ల విచారణ నాగేశ్వరరావుచేతబడుట, ఆకస్మికముగ ఆ ఆసామిని పట్టుకొని

జామీను ఆర్డరువేయుట మొదలగు అక్రమచర్య లన్నియు మొదటినుండి తుదివరకు జరిగిన గ్రంథ మంతయు తెలియపరచెను.

ఆసామీ తన పశువులను బందెలదొడ్డికి తోలనివ్వకుండ తీసికొనివచ్చుట చోరీగా నిర్ణయించినట్లు చెప్పుటతోడనే "ఈ మాజస్ట్రేటు ఎవరు ? ఎంతటివాడు" ? డని న్యాయమూర్తులు ప్రశ్నించిరి. కృష్ణస్వామయ్యరు చెప్పిన దంతయు సావకాశముగ విన్నపిమ్మట, రివిజన్‌పిటీషను కేసులలో సాక్ష్యము చదువుట ఆచారము గాకపోయినను ఈ వ్యవహారసందర్భమునుబట్టి సాక్షి వాఙ్మూలములు చదివెదముగాక యని ఆ చోరీ కేసులోని వాఙ్మూలములను చదువగోరి, కృష్ణస్వామిఅయ్యరు వాటిని చదివి వినిపించిరి. పిమ్మట మా పిటీషనుకు సంబంధించిన అఫిడవిట్లుగూడ చదివి వినిపించిరి. ఇవి అన్నియు వినిపించినపిమ్మట గవర్నమెంటు ప్రాసిక్యూటరు పవల్‌గారిని 'మీ రేమి చెప్పెద' రని ప్రశ్నించిరి. మాజస్ట్రేటునుగూర్చి దూషణవాక్యములు పిటీషన్‌లో వ్రాసి, దాఖలుచేయుటచే అధికారిచర్యకు అడ్డము అనునేరమునకు ప్లీడర్లు పాత్రులేయని వాదించెను. "మాజస్ట్రేటు ఇంటిలో నున్నప్పు డిచ్చినా, ఆయనకోర్టులో అధికారము చలాయించుచున్నప్పుడేనా" యని ప్రశ్నించిరి. 'ఎక్కడైనా మేజస్ట్రేటు మాజస్ట్రేటే' యని ఆయన మారుపల్కెను. వీట యింట్లో నున్నను మాజస్ట్రేటేనాయని హేళనగ మాట్లాడిరి. అంతట పవల్‌గారు మరేమియు మాట్లాడక కూర్చుండెను.

న్యాయమూర్తులు మా పిటీషన్‌నుగూర్చి వ్రాయుచు "ప్లీడర్లు అధికారికి పెట్టిన పిటీషనులో ఆయననుగూర్చి అట్లు

వ్రాయుట వారికి ఃహితమగు నియమపద్ధతి నతిక్రమించియు న్నను డిప్యూటీమాజస్ట్రేటు పండిత నాగేశ్వరరావుగారు ఆప్లీడర్లు వ్రాసినట్లు "నిరంకుశముగను, ద్రోహబుద్ధితోడను ప్రవర్తించినా"డనుట నిశ్చయము గాన ఇట్టి సందర్భములో ప్లీడర్లపై ఎట్టి చర్యను జరుపనవసరములేదు. వారిపై మాజస్ట్రేటు వేసిన ఉత్తరువును రద్దుపరచితి"మనిరి. మరియు ఆసామికి చోరీనేరముక్రింద వేసినశిక్ష రద్దుపరచి, ప్లీడర్లమీద న్యాయవాది చట్టముక్రింద విచారణ చేయనక్కరలేదు అని తీర్పుచెప్పిరి.

## బందరు నుండి వీడ్కోలు

ఈ నాగేశ్వరరావుగారితోసంబంధించినవ్యవహారమునకు ముందే నామిత్రులు చన్నాప్రగడ భానుమూర్తిగారును, నేనును ఒకయింటిలోనే కాపుర ముండుట తటస్థించెను. ఈ కారణమున మామైత్రి గాఢమాయెను. మాఆడవారికి, వారి ఆడవారికిగూడ స్నేహమయ్యెను. వల్లూరి సూర్యనారాయణరావుగారును ఆ సమీపముననే కాపురముండిరిగాన వారి కుటుంబముతోగూడ మావాండ్లకు మైత్రికుదిరెను. వేసవి సెలవులలో నాకును భానుమూర్తిగారికిగూడ తీరికయే. ప్రతిదినము ఉదయమున ఆయన యింటిపెరటిలో పాదులు త్రవ్వి, అరటిమొక్కలును, పూలమొక్కలును నాటి, నీళ్లుపోసి పెంచుచుండెడివారు. గొడ్డలితో కట్టెలు చీల్చుచుండెడివారు. చెట్లెక్కి దిగుచుండెడివారు. స్వతః బలిష్ఠకాయులు గాన అట్టి వ్యాయామము వారు చేయగలిగి యుండిరి. నేను అంతటి బలువగు వ్యాయామముచేయలేక అరటి

మొక్కలువేసి, బావినుండి నీళ్లు తోడి పోయుచుంటిని. అక్కడి బావులు వరలబావు లగుటచే నీళ్లుతోడుట సుకరముగా నుండెను.

మే మిట్లు వ్యాయామములు చేయుచు, జీవితాదర్శము లను గూర్చి సంభాషణలు సలుపుకొనుచు నుండెడివారము. సెలవుదినములలో పల్లెగ్రామములకు బోయి మనదేశపు బూర్వౌ న్నత్యముచు, ఇప్పటి దుస్థితులనుగూర్చి ప్రజలను ప్రబోధించుట యుచిత మని యెంచి, యొకదినము బయలుదేరి, బందరు తాలూకా పడమటిగ్రామములలోగుండా గుడివాడతాలూకా లోని కొన్నిగ్రామములుగూడ సంచారముచేసి, కొన్నిదినములకు ఇల్లుచేరితిమి. ఈ గ్రామములంలో ఏ సత్రములోనో బసచేయుచు మా భోజనపదార్థములు మేమే కొనితెచ్చి వంటచేసికొని తిను చుంటిమి. భానుమూర్తిగారే వంటచేయుచుండిరి. ఎవ్వరైన పిలిచినయెడల అచ్చటను అప్పుడప్పుడు భుజించుచుంటిమి. మా యుపన్యాసములలో పూర్వమున మనదేశమున నుండెడి శాస్త్ర పరిజ్ఞానము, సత్యశీలము, ఔదార్యాది గుణసంపత్తి, గ్రామ కట్టుబాటులు, ఆర్థికసంపత్తి, వృత్తులు, దూరదేశములతో వర్తకవ్యాపారములు, శిల్పనైపుణ్యమును వర్ణించి, ఇప్పటి దాస్యము, విద్యావిహీనత, అజ్ఞానము, దారిద్ర్యము మొదలగు విషయములనుగూర్చి వివరించుచుండ స్త్రీపురుషులు మిక్కిలి శ్రద్ధాళువులై వినుచుండిరి. వారి కుతూహలమును చూచి మాకును ఉత్సాహముగ నుండెను. మేము భోజనముచేసిన బ్రాహ్మణగృహములు శుచిత్వము, దేవపూజ మొదలగు సదా చారములచే సంపన్నములుగ నుండెను. వేదాధ్యయనపరత్వము

గాని, శాస్త్రపరిజ్ఞానముగాని ఎచ్చటను మాకు గానుపించలేదు. సామాన్యశ్రౌతస్మార్తకర్మపరులును, పూర్వాచారపరులు మాత్రము కనబడుచుండిరి. ఇందు స్త్రీలు విద్యావ్యాసంగము లేనివారయ్యు గృహకృత్య నిర్వహణమున నిపుణులుగనే యుండిరి. ముఖ్యముగ కొన్ని బ్రాహ్మణగృహములలో వితంతులైన యువతులు చేయుసేవయు, వారి వైరాగ్యమును శ్లాఘ్యముగ నుండెను.

ఇట్లెందరో వైధవ్యమును పొందిన యువతులు పుట్టినింటనో అత్తవారింటనో నిర్బంధముగ సేవాపరత్వముచే జీవితము గడపుచుండిరిగదాయని సంతాపము చెందితిమి. వారిలో బుద్ధిపూర్వముగ విరక్తలై సేవాపర లగువారు అరుదుగానుందురని యూహించితిమి. అట్టివారికి విద్యనేర్పుటకు విద్యాశాలలును, శరణాలయములును, దేశమున స్థాపించుట యవసరమని తలంచితిమి. మేము చేసిన ఉపన్యాసములధోరణి వినినపిమ్మట భానుమూర్తిగారి ఇంటిలోని ఆడవారు ప్రభుత్వాధికారులవలన ఏమి యొత్తిడికలుగునో యని భయముచెందిరని నాకు దెలియ వచ్చినది. మరల సంచారము సల్పుట మాత్రము కలుగలేదు.

ఇంతలో కృష్ణాజిల్లాలోనుండి కృష్ణానదికి దక్షిణభాగమున నున్న గుంటూరుభాగమును విడదీసి, నెల్లూరుజిల్లాలో చేరియున్న వంగోలుతాలూకాను కలిపి, ప్రత్యేకజిల్లాగా చేయుట తటస్థించెను. ఆ జిల్లాకు గుంటూరు ముఖ్యపట్టణమై అందు కలెక్టరు కచ్చేరి, జిల్లాకోర్టు నేర్పడెను. అంతట నా జన్మస్థానమగు గుంటూరులోనే నా వృత్తిని గడపవలెనని తలచితిని. భానుమూర్తి

గారి నెడబాయవలసివచ్చెను. ఇరువురము ఒకనాడు ముచ్చటించు కొనుచు మన జీవితము లెప్పుడును కుటుంబపోషణాకార్యము లందే వినియోగించుటయా, లేక మరి యేదైన పరోపకారముచే ధన్యతజెందుటయా యనిచర్చించుకొంటిమి. కుటుంబార్థము కొంత సొమ్ము నిలవచేయుటకై పదిసంవత్సరము లీ వృత్తులందే గడిపి, ఆ గడువు ముగిసినతోడనే వృత్తివిసర్జనముచేసి అప్పటికి యుక్తమని తోచిన దేశసేవా కార్యమునందు ఉభయులము కలిసి పనిచేయవలెనని తీరుమానించుకొంటిమి. నామిత్రుడు హనుమంతరావు బందరులోనే స్థిరనివాసముచేయు నుద్దేశముతో ఊరివెలుపల విశాలావరణ గల పాతబంగళా నొకదానిని పదమూడువేలకు గొని అందు ప్రవేశింపవలెనను సన్నాహములో నుండెను. ఆయనకు చల్లపల్లి జమీందారుగారి దివాను శ్రీ కోపల్లె కృష్ణారావుపంతులుగారి అభిమానమువలన చల్లపల్లివారి ఫైలు లభించుననియు, పబ్లిక్ప్రాసిక్యూటరు పనికిగూడ ప్రయత్నముచేయవలెననియు ఉద్దేశము గలిగెను. ఈ ప్రయత్నములగూర్చి హనుమంతరావు నాతో ముచ్చటించలేదు. ఇతరుల వలనమాత్రమే నేను వింటిని. అదిగాక మేము కలిసి పనిచేయుచుండగనే చల్లపల్లివారి కేసులు కొన్ని తాను పుచ్చుకొని పని చేసెను. ఆ కేసులవృత్తాంతముగాని ఫీజుగాని నాకు దెలుపలేదు. ఆ మొత్తములు జాయింటులెక్కలో జమపడలేదు. కొంతవరకు నా కీవిషయము తెలిసినను నాటి ముఖ్యులైన కృష్ణరావుగారి అభిమానముచే లభించిన పనియగుటవలన ఆ కేసులలో వచ్చిన ఫీజులో నాకు భాగము రాకపోవుట సహజమేయని సమాధాన పరచుకొంటిని. ఇదిగాక కొలదికాలములో గుంటూరునకు

పోదలచిన నేను ఈవిషయమై వివాదముపెట్టుకొనుట సరికా దనియు తలచితిని. నాకంటె హనుమంతరావు తెలివిగలవా డనుట నిశ్చయమే. నేనును జాగ్రత్తగనే పనిచేయుచు కక్షి దారులయు న్యాయమూర్తులయు అభిమానమును కొంత సంపా దించుకొంటిని. ఏది యెట్లున్నను మా ఇర్వుర చిరకాలస్నేహ బంధము మహాభాగ్యముగ నేను తలంచి దానికి భంగముకలుగు మాటలుగాని చర్యలుగాని జరుపకుండ ప్రవర్తించు చుంటిని. మేము జాయింటుగా పనిచేయుకాలములో నేను పరగ్రామమున నుండవలసివచ్చినపుడుసహితము ఆయన యొక్కడే పనిచేసి ఆర్జించినసొమ్ములో నేను సగభాగము తీసికొన్నను ఆక్షేపించ లేదు. ఆయన బాపట్లలో డిస్ట్రిక్టుమునసబుపని ఒకమాసమో రెండుమాసములో చూచుచున్నపుడు నేనొక్కడనే పనిచేసి నప్పుడు వచ్చిన ఫీజులో ఆయనభాగము తీసికొనెను. నేను సాంఘికములు, రాజకీయములునగు కార్యములలో నెక్కువ ప్రవేశించుచుంటిని. హనుమంతరావు అనివార్యమైనపుడు తప్ప అట్టి పనులలో జోక్యముకల్గించుకొనువాడు గాడు. అట్లయ్యు నా ఈ అన్యవ్యాపృతి నాయన ఆక్షేపించియుండలేదు.

నేను అధ్యక్షుడుగ, వక్తగ నుండిన సభలలో ఆంగ్లేయభాష లోనే ప్రసంగించుచుంటిని. ఉత్సాహము హెచ్చుగా నున్నపుడు ఇంగ్లీషులోఉపన్యాసము పలువుర నాకర్షించునట్లు చేయగలిగినను సామాన్యముగ నా ప్రసంగము అంత సౌష్టవముగ, హృద్యముగ నుండెడిదికాదు. నాతో సమానులును నాకంటె కొంత వెనుక బడినవారు నుండెడిసభలలో కొంత పటుత్వముగ భాషణచేయు

చుంటిని గాని నాకంటె పెద్దలున్న సభలలో సభాకంపము నన్ను బాధించు చుండెను. పిమ్మటికాలములో కాంగ్రెస్ సభలలో ఇట్టి మనోదౌర్బల్యముచేతనే ఇంగ్లీషునం దుపన్యసించుట మానవలసి వచ్చెను. నేను కాంగ్రెస్ నాయకులలో తగినంత ప్రాధాన్యము వహించకపోవుటకును ఇది యొక గొప్పకారణము. ఒక కాంగ్రెసు మహాసభలో తెంపుచేసి భాషణచేయవలెనని యూహించుకొని ఏదో తీరుమానమునుగూర్చి మాట్లాడుటకునాపేరు ఈయబోగా శ్రీ చక్రవర్తుల రాజగోపాలాచార్యులుగారు అంత మహా సభలో మన మాటలు వినబడవు గనుక అందుకు ప్రయత్నించ వలదని నాకు సలహా నిచ్చెను. అప్పటినుండి ఆప్రయత్నమే మానివేసితిని. విషయనిర్ణయసభలోమాత్రము అపుడపుడు మాట్లాడుచుంటిని. అఖిలభారతకాంగ్రెసుకార్యనిర్వాహకసభలో సభ్యుడుగా నున్నపుడుగాని అధ్యక్షుడుగా నున్నపుడుగాని నేను చాల మితభాషినని పేరుపొందితిని. ఇందుకు పైన చెప్పిన సభా కంపమే కారణము.

బందరులో నున్న పదునొకండు సంవత్సరములకాలము చక్కగనే గడచిపోయినది. కుటుంబములో పిల్లలను కోల్పోయిన దుఃఖముతప్ప తక్కినవిషయములలో నుత్సాహముతో నా యావనమునందు ప్రధానమైన ఘట్టము గడచిపోయినది. అచ్చటి స్నేహితులతో కలసిమెలసి ప్రవర్తించుటవలన కలిగిన యనుభవ ములు పిమ్మటికాలములో చాల నుపయుక్తముగ పరిణమించిన వనుటకు సందియములేదు. అప్పుడచ్చట ఆంగ్లేయవిద్యాధికులలో ముఖ్యముగా యువకులగు న్యాయవాదులలో దేశహితైక

కార్యములందు అభిమానము, సాంఘికరాజకీయములందు చొరవయు నెక్కువగ నుండెను. నీతిబద్ధమైన జీవితాదర్శములు వారిహృదయముల నాకర్షించుచుండెను. ఈ పరిస్థితికి వెంకటరత్నంనాయుడుగారి జీవితమును, నీతిబోధయు ముఖ్యకారణము లైయుండును. సంఘములో నొక వ్యక్తి యేనియు నీతివర్తనుడైనచో దాని ప్రభావ మూరక పోదనుటకిదియే తార్కాణము.

కాబట్టి నేను గుంటూరున నా వృత్తికార్యము వ్యవహరింప వచ్చునాటికి నా యౌవనము కొంతగడచెను. జీవితాదర్శమునుగూర్చి కొంత నిశ్చయమేర్పడెను. పదిసంవత్సరములతో నా వృత్తికి స్వస్తి చెప్పి ఏదైన దేశహితకార్యమును చేపట్టవలయునను కృతనిశ్చయముతో వచ్చితినిగాని సంపాదనచేసి సౌఖ్యముపొందవలె నను ఆశయముతో రాలేదు. అట్లని సంపాద్యవిషయమున వైరాగ్యమును కలుగలేదు. న్యాయముగ సంపాదన చేయవలయు నను కాంక్ష పూర్తిగనే యుండెను. కనుకనే గుంటూరుజిల్లాకోర్టులో పబ్లిక్‌ప్రాసిక్యూటరుపని సంపాదింపవలెనని ఆశించితిని. ఆ పనినిమిత్తము బందరుజిల్లాజడ్జీగారి సహాయము కోరతలంచి కోర్టులో వారి ప్రైవేటుగది కేగితిని. నాకును ఆజడ్జిగారికిని కొలదిరోజుల క్రితమే పైనచెప్పిన సంఘర్షణ జరిగియుండెను. గాన కొంత సంశయించుచునే లోపలి కేగి వారి సహాయ మర్థించితిని. సిఫారసు ఉత్తరము కావలెనా యని దయతోడను శాంతముతోడను నన్ను వారు ప్రశ్నించిరి. సిఫారసు అక్కరలేదుగాని యోగ్యతాపత్రము వ్రాసి యిండని కోరితిని. సిఫారసుకోరుట వంచనము, ఆత్మగౌరవభంగము నని తలంచితిని.

ఆయనకు నన్నుగూర్చిన అనుభవము ఉన్నదున్నట్లు వ్రాయ వచ్చును గనుక యోగ్యతాపత్రము కోరుటయే యుక్తమని తలంచితిని. జడ్జిగారు మరునాడు ఉదయము తన బంగాళాకు రావలసినదని చెప్పిరి. బెజవాడకు కాలువమీద పోవుటకు పడవ నొకదాని నేర్పాటుచేసుకొని నా సామానులు భద్రముగ నెక్కించుట కేర్పాటులు చేసికొని నామిత్రుడు హనుమంతరావు వద్దను, సోదరన్యాయవాదులవద్దను సెలవుపుచ్చుకొంటిని. శ్రీ జంధ్యాలగౌరినాథశాస్త్రిగారు తమగుంటూరుజిల్లా కక్షిదారుల రికార్డును నాకు దయతో నిచ్చివేసి, పార్టీలకుగూడ ఉత్తరములు వ్రాసి, నాకు వకాల్తనామా వారిచే నిప్పించిరి. తమ కెదురు పక్షముననుండి వాదించిన కేసులలో నేను తృప్తికరముగ పనిచేసి యుంటిననియు, సాక్ష్యమును క్రాసుప్రశ్నలు వేయుటలో హనుమంతరావుకంటె నిపుణత్వముజూపితిననియు, గుంటూరులో త్వరలో వృద్ధికిరాగలననియు పలికి నన్ను ఉత్సాహవచనములతో బహూకరించి వీడ్కొలిపెను. శ్రీ పురాణము వెంకటప్పయ్య పంతులుగారు అక్కడి న్యాయవాదులలో మిక్కిలి పేరుపొందిన వారు. ఆయనవద్ద సెలవు గైకొనబోగా "మీయొద్ద స్వతంత్ర కార్యాచరణశక్తియు, ధైర్యమును, ఉత్సాహము నున్నవి. కాన ముందుకాలమందు పేరుప్రతిష్ఠ లెక్కువగా పొందగల"రని నన్ను దీవించి తమయొద్ద నున్న గుంటూరుకక్షిదారుల అప్పీళ్ళు రికార్డులు నొకటిరెండు నా కిచ్చిపంపిరి. మునసబుకోర్టుప్లీడర్లలో నాకు ప్రియమిత్రులు సాధువర్తనులును, సత్యప్రియులు నగు శ్రీ కట్టమూడి చిదంబరరావుపంతులుగారిని వదలివచ్చుట కష్టముగనుండెను. స్నేహపాత్రులైన కొండూరి లక్ష్మీనారా

యణాగారి నుండియు సెలవుపుచ్చుకొంటిని. నా ముఖ్యమిత్రుడు హనుమంతరావుతోడి చెలిమిమాత్రము గ్రామములువేరైనను శాశ్వతముగ నుండగలదను ధైర్యముచే గాబోలు ఆయనను విడచుట కష్టముగ తోచలేదు.

మరునాడు యోగ్యతాపత్రమునిమిత్తము ఎనిమిదిగంటలకు జడ్జిగారి బంగాళాకు పోతిని. ప్రయాణపు టేర్పాటులలో నుండుటచే కొన్ని నిముషము లాలస్యముగ చేరితిని. అంతకు ముందే ఆయన క్లబ్బుకు పోయెనట. కొంచెము వేచియుండి ఇంకను ఆలస్యము చేయునెడల ప్రయాణము సకాలములో సాగదని తలంచి మరలిపోవుటకు పదియడుగులు వేయునప్పటికి మరియొకదారిని జడ్జిగారు వచ్చుచుండుట కనపడెను. అంతట నేను బంగళామెట్లయొద్దకు వచ్చునప్పటికి త్వరత్వరగ ఆయన మెట్లెక్కి లోని కేగెను. నన్ను చూచియు నిలువకుండ పోయి నందున ప్రయోజన ముండదని తలంచి ఇంటికి పోవలెననుకొనుచుండగనే ఉత్తరమును చేతబట్టుకొని మెట్లుదిగివచ్చి నాకు ఉత్తరము నిచ్చి నాచేయి పట్టుకొని యాడించుచు "ఇచ్చట నడిపినట్లే వృత్తిని శ్లాఘ్యముగ నడపి జయమందుము" అని హితవచనములు బలికెను. నేను కృతజ్ఞత తెలిపి వీడ్కొంటిని.

---

# గుంటూరు నివాసము

అప్పటికి గుంటూరులో నాకు ముఖ్యస్నేహితుడు న్యాపతి హనుమంతరావు అగ్రహారములో కోపల్లెవారి మేడను ముందుగనే కుదిర్చియుంచినందున సామానులన్నియు నచ్చట చేర్చి, పాతగుంటూరులో మానాయనగారును తమ్ములు నివసించుచున్న పురాతనగృహమునకు చేరితిమి. అచ్చట నొకటి రెండు రోజు లుండి, అగ్రహారములో కాపురముచేయ ప్రారంభించితిమి. గుంటూరులో జిల్లాకోర్టు 1905సంవత్సరము ఆగష్టులో ప్రారంభింపబడెను. నేను గుంటూరు చేరునప్పటికి పబ్లిక్‌ప్రాసిక్యూటరుపని శ్రీ కామరాజు మన్నారుకృష్ణరావుగారి కిచ్చివేయబడెను. నేను ఆపనినిమిత్తము వచ్చెదనని నిరీక్షించినట్లును నేను రానందున, మరియొకరి కీయవలసివచ్చినట్లును జిల్లాకోర్టుసిరస్తాదారు నాతో చెప్పిరి. అచటి జడ్జి పర్సివల్ రైస్. వీరు బందరు జిల్లాకోర్టుజడ్జిగాకూడ నుండిరి. వారును నేను వచ్చెదనేమో యని యోచనచేసియుండవచ్చును. శ్రీ మన్నారు కృష్ణరావుగారు ఫస్టుగ్రేడుప్లీడరైనను వంగోలుమునసబుకోర్టులో న్యాయవాదిగా పనిచేయుచు అక్కడ మునిసిపల్ ఛైరుమన్‌గా నుండి ప్రాముఖ్యమువహించెను. వంగోలులో పశువులసంత నేటేట జరుగుచు జిల్లాకలెక్టరులు, బోర్డుమెంబర్లు, గవర్నమెంటు సెక్రటరీలు మొదలగువారి ప్రాపకము సంపాదించెను. వారే చాల కాలము పబ్లికుప్రాసిక్యూటరుగ నుండి దివానుబహద్దురుబిరుదమును సంపాదించి గవర్నమెంటుపక్షపాతి అనిపించుకొనిరి. కాని సహాయోద్యమకాలములో మేము బాధలు పడుచుండు

నప్పుడు స్వానుభూతి చూపుచు నన్ను కొంత ప్రస్తుతిచేయు చుండెను.

బందరుకోర్టునుండి నేను శ్రీ ఏకా లక్ష్మీనరసింహము పంతులుగారు మాత్రమే వచ్చితిమి. తెనాలి మునసబుకోర్టు నుండి గోవిందరాజు శ్రీనివాసరావుపంతులుగారును, వంగోలు మునసబుకోర్టునుంచి శ్రీ కొంపల్లి కోటిలింగముపంతులుగారును, శ్రీ గొల్లపూడి రామనాథయ్యగారునువచ్చి, ఈ జిల్లాకోర్టులో న్యాయవాదులుగా చేరెరి. వీరందరిలో నేనే సీనియరును. అనగా జిల్లాకోర్టులో నా కెక్కువ అనుభవము కల దన్న మాట. బందరుజిల్లాకోర్టునుంచి ట్రాన్సుఫరుకాబడిన అప్పీళ్లు, అసలువ్యాజ్యములలో హెచ్చుభాగము నేను వకాల్తు పొందిన వగుటచే కోర్టులో హెచ్చుపని నాచేతులలోనే యుండెను. నా నేర్పు కక్షిదారులకు బోధపడుట కెక్కువ అవకాశము కల్గెను. ఆ కేసులు పూర్తిగ పరిష్కారమైనపిదపగూడ నాకు పని పూర్తిగనే లభించుచుండెను. కొలదిసంవత్సరములలో వ్యాజ్యములయు అప్పీళ్లయు సంఖ్య హెచ్చినకొలది తక్కిన న్యాయవాదులకుగూడ పని హెచ్చెను. అందులో గోవిందరాజు శ్రీనివాసరావుగారి వాదనాసామర్థ్యము హెచ్చుగ ప్రకటిత మగుచుండెను. కొంపల్లి కోటిలింగముగారును ఆయనతో కొంచె మెచ్చుసరి దీటుగ నేర్పరితనము వెల్లడించుచుండెను. శ్రీ గొల్లపూడి రామనాథయ్యగారు నానాట ఉపాయముగ కేసులు రాబట్టుకొనగల్గెను. బాటులను వినియోగించుకొని వారిద్వారా కేసులు సంపాదించుకొను దురాచారము నానాట

# గుంటూరు నివాసము

అప్పటికి గుంటూరులో నాకు ముఖ్యస్నేహితుడు న్యాపతి హనుమంతరావు అగ్రహారములో కోపల్లెవారి మేడను ముందుగనే కుదిర్చియుంచినందున సామానులన్నియు నచ్చట చేర్చి, పాతగుంటూరులో మానాయనగారును తమ్ములు నివసించుచున్న పురాతనగృహమునకు చేరితిమి. అచ్చట నొకటి రెండు రోజు లుండి, అగ్రహారములో కాపురముచేయ ప్రారంభించితిమి. గుంటూరులో జిల్లాకోర్టు 1905సంవత్సరము ఆగస్టులో ప్రారంభింపబడెను. నేను గుంటూరు చేరునప్పటికి పబ్లిక్ప్రాసిక్యూటరుపని శ్రీ కామరాజు మన్నారుకృష్ణరావుగారి కిచ్చివేయబడెను. నేను ఆపనినిమిత్తము వచ్చెదనని నిరీక్షించినట్లును నేను రానందున, మరియొకరి కీయవలసివచ్చినట్లును జిల్లాకోర్టుసిరస్తాదారు నాతో చెప్పిరి. అచటి జడ్జి పర్సీవల్ హైరెస్. వీరు బందరు జిల్లాకోర్టుజడ్జిగాకూడ నుండిరి. వారును నేను వచ్చెదనేమోయని యోచనచేసియుండవచ్చును. శ్రీమన్నారు కృష్ణరావుగారు ఫస్టుగ్రేడుప్లీడరైనను వంగోలుమునసబుకోర్టులో న్యాయవాదిగా పనిచేయుచు అక్కడ మునిసిపల్ ఛైరుమన్‌గా నుండి ప్రాముఖ్యమువహించెను. వంగోలులో పశువులసంత నేర్పాటు జరుపుచు జిల్లాకలెక్టరులు, బోర్డుమెంబర్లు, గవర్నమెంటు సెక్రటరీలు మొదలగువారి ప్రాపకము సంపాదించెను. వారే చాల కాలము పబ్లికుప్రాసిక్యూటరుగ నుండి దివానుబహద్దరుబిరుదమును సంపాదించి గవర్నమెంటుపక్షపాతి అనిపించుకొనిరి. కాని అసహాయోద్యమకాలములో మేము బాధలు పడుచుండు

నప్పుడు స్వానుభూతి చూపుచు నన్ను కొంత ప్రస్తుతిచేయు చుండెను.

బందరుకోర్టునుండి నేన్నును శ్రీ ఏకా లక్ష్మీనరసింహాము పంతులుగారు మాత్రమే వచ్చితిమి. తెనాలి మునసబుకోర్టు నుండి గోవిందరాజు శ్రీనివాసరావుపంతులుగారును, వంగోలు మునసబుకోర్టునుంచి శ్రీ కొంపల్లి కోటిలింగముపంతులుగారును, శ్రీ గొల్లపూడి రామనాథయ్యగారునువచ్చి, ఈ జిల్లాకోర్టులో న్యాయవాదులుగా చేరిరి. వీరందరిలో నేనే సీనియరును. అనగా జిల్లాకోర్టులో నా కెక్కువ అనుభవము కల దన్న మాట. బందరుజిల్లాకోర్టునుంచి ట్రాన్సుఫరుకాబడిన అప్పీళ్లు, అసలువ్యాజ్యములలో హెచ్చుభాగము నేను వకాల్తు పొందిన వగుటచే కోర్టులో హెచ్చుపని నాచేతులలోనే యుండెను. నా నేర్పు కక్షిదారులకు బోధపడుట కెక్కువ అవకాశము కల్గెను. ఆ కేసులు పూర్తిగ పరిష్కారమైనపిదపగూడ నాకు పని పూర్తిగనే లభించుచుండెను. కొలదిసంవత్సరములలో వ్యాజ్యములయు అప్పీళ్లయు సంఖ్య హెచ్చినకొలది తక్కిన న్యాయవాదులకుగూడ పని హెచ్చెను. అందులో గోవిందరాజు శ్రీనివాసరావుగారి వాదనాసామర్థ్యము హెచ్చుగ ప్రకటిత మగుచుండెను. కొంపల్లి కోటిలింగముగారును ఆయనతో కొంచె మెచ్చుసరి దీటుగ నేర్పరితనము వెల్లడించుచుండెను. శ్రీ గొల్లపూడి రామనాథయ్యగారు నానాట ఉపాయముగ కేసులు రాబట్టుకొనగలెను. టౌటులను వినియోగించుకొని వారిద్వారా కేసులు సంపాదించుకొను దురాచారము నానాట

ప్రబలుచుండెను. ఇందువలన కొంతవరకు నాకును పని తగ్గుట తటస్థించెను. కొటులను ప్రోత్సహించుట అవినీతి యని మన స్సున బాధపడుచుంటిని. ఈ ఆచారము వృత్తిపై కొంత అసహ్యమును అయిష్టమును గూడ కల్పించెను. ఈ ఆచారము నెంత నిరసించువాడ నైనను కేసు గెలిచినతర్వాతనో, విచారణ పూర్తియైనపిమ్మటనో కక్షిదారులతో వచ్చిన కొట్లు నాయొద్దకు వచ్చి ప్రాధేయపడినపుడు ఏదో కొద్దిగా ఇచ్చుట సంభవించు చుండెను. అట్టి సహాయము ముందే దైన కేసు తెచ్చి మరల పొందవచ్చునని ప్రోత్సహించుటయే యనుట స్పష్టమే. నా కట్టి యుద్దేశములేదు గాని ఆమాత్రమున కైన లోబడి నాజీవితమున నొక కళంకము ఏర్పరచుకొంటి నని ఖేదము నొందుచుంటిని. చేసినతప్పులు చెప్పిన పోవునందురు గాని దానివలన కలుగు మనఃపరితాపము జీవితాంతమువరకును పోవునది కాదనియే తోచుచున్నది. సంపాదించిన ద్రవ్యము కొంత వెనుక వేసుకొని వృద్ధిచేయవలెనను ఆశ నాకు పొడమెను. కాని వచ్చినఫీజు లెక్క శ్రద్ధతో పరీక్షించు అభ్యాసము నాకు లేదయ్యెను. గుమాస్తా చెప్పిన లెక్కనే నమ్ముచుంటిని. లభించిన సొమ్ములో నుంచి అడిగినవారికి వడ్డీ కిచ్చి ప్రామిసరీనోట్లను, తాకట్టు పత్రములును వ్రాయించుకొనుచుంటిని. మా తండ్రిగారు చేయు చున్న పద్ధతియే నాకును పట్టుబడినది. అది నాకు తప్పుగా తోచలేదు. వాడుకలో నున్న రూపాయివడ్డీనే పుచ్చుకొను చుంటిని. బిడుగోలుషరతులు పెట్టి కాంపౌండువడ్డీ కిచ్చు పద్ధతి నేను అవలంబించలేదు. దావాలు వేయకుండనే నాసొమ్మును రాబట్టుకొనుచుంటిని. ముస్లిము లొకరికి రు 3000

అప్పటప్పటి వడ్డీతో నది ఆరువె లైనందున ఆమొత్తము చెల్లిం చలేక వారికి ఆయూరిలో నున్న పదునేడు యకరములమెట్ట పొలమును, ఫిరంగిపురములో పదియకరముల పొలమునునాకు దఖలువ్రాసి రిజిష్టరుచేసి యిచ్చిరి. ఈపొలములో కొంతభాగము వారి తల్లులది, చెల్లెండ్రది యగుటచే వారికిని కొంత సొమ్మిచ్చి ప్రత్యేకముగ దస్తావేజులు రిజిష్టరు చేయించుకొంటిని. వారు ఈభూములు నాకు అమ్మటచే జీవనాధారము లేక మిక్కిలి బాధచెందిరి. అప్పుడప్పుడు నాయొద్దకు వచ్చి సహాయము కోరుచుండిరి. ఏదియో స్వల్పముగ సాయముచేయుచుంటినిగాని వారు కష్టములపాలైనారను బాధమాత్రము బాధించుచుం డెను. కాని వారు జాగ్రత్తగ ప్రవర్తించుచు మితవ్యయములు చేయకుంటయు, సకాలముననే పలుమార్లు చెప్పినను బాకీ చెల్లింపకుంటయు వారిదే తప్పు అని సమాధానపరచుకొంటిని. వీరితో జరిపిన వ్యాపారము ఇప్పటికి నా మనోవ్యథ కొక కారణముగనే యున్నది.

నేను అగ్రహారములో ప్రత్యేకముగ కాపురము పెట్టిన పిమ్మట అప్పుడప్పుడు పాతగుంటూరు పోయి మాతండ్రిగారిని తమ్ములుమొదలగువారిని చూచివచ్చుచుంటిని. పూర్వార్జిత మగు 15 యకరముల గుంటూరి మెట్టయీనాముభూమిగాక ఆసమీపముననే ఏడుయకరముల మెట్టశేరీభూమియును మరి నాలుగెకరముల శేరీమెట్టయును, వేజెండ్లగ్రామములో పదియకర ముల మెట్ట ఈనాముభూమియును మాతండ్రిగారు సంపాదించిరి. వేజెండ్ల భూమిని కవ్వులుకిచ్చి మక్తా వసూలుచేసుకొనుచు,

గుంటూరుపాలమును కొంతపాలిపద్ధతిని అమరకపడి ...లు చేసికొనుచు సుమారు నాలుగువేలరూపాయలు వడ్డీల కిచ్చి వారు కుటుంబపోషణ గావించుకొనుచుండిరి. వారప్పటికి డెబ్బది యైదేండ్ల వృద్ధులైనను ఈ వ్యవహారమంతయు మిక్కిలి యోపికతో స్వయముగ చూచుకొనుచుండిరి.

నేను బందరులో నున్నపుడు వేసవిసెలవులలో కొంత కాలము గుంటూరులో నాసంసారముతో ఉండిపోవుచుంటినే గాని ఈఅయివేజునుండి నేనేమియు తీసికొనియుండలేదు. మా తండ్రిగారికి నేను ఏమియు ఇచ్చియుండను లేదు. బందరులో నాసంపాదన నాకుటుంబవ్యయములకును ప్రయాణములు మొదలగువానికి, ఇన్సూరెన్సు పాలిసీక్రింద చెల్లించుటకును సరి పోవుచుండెనేగాని హెచ్చుగా నిల్వయుండలేదు. మాతండ్రిగా రేమైన తమకు పంపుమనికోరినను పంపలేకుంటిని. నాకుగాని నా భార్యకుగాని పొదుపుచేతగాదని మానాయనగారు చెప్పుచుండెడి వారు. అది చాలవరకు నిజమే. గుంటూరు వచ్చిన పిమ్మట జాయింటు లేక ఒక్కడనే వ్యవహరించుటచే కొంత హెచ్చుగా ఆదాయము లభించినది.

తండ్రిగారు కుటుంబభారము వహించుచుండుటయు తమ్ములు ఏ జోక్యము పుచ్చుకొనక తిని కూర్చుండుటయు నామనస్సునకు కొంత కించ కల్పించుచుండెను. ఒకనాడు మధ్యాహ్నము కోర్టులో నాపనిపూర్తియైనపిమ్మట పాత గుంటూరుకు మావాండ్రను చూచిరావలెనను కోర్కె పుట్టి పోతిని. పోవునప్పటికి మాతమ్ములు మొదలగువారు భోజనములు

చేసి గూర్చుండిరి. వంటయింటిలో మాతండ్రిగారుభోజనము చేయుచుండిరి. అప్పటికి మూడుగంటలైనందున ఇంత ఆలస్యముగ భోజనముచేయుచున్నారేమని ప్రశ్నించితిని. వారు మారు పలుకకుండిరి. ఇంత ప్రొద్దుపోయిన దేమని మామేనత్తగారి నడిగితిని. "ఏమని చెప్పను, ఎంత పెద్దవాడైనను ఆయనబాధ తప్పించెడివారెవ్వరును లేరు, పొలములో ధాన్యము కైలు చేయించుటకు ప్రొద్దుటనే పోయి ఇప్పుడే వచ్చె"నని ఆమె కండ్ల నీరుగార్చుచు చెప్పెను. నాకు దుఃఖము పట్టరాకుండెను. మా తమ్ములమీద కోపమును అధికమయ్యెను. అందరు తిని, పోతరించి యథేచ్ఛగ ప్రవర్తించుటేగాని పెద్దలైన తండ్రిగారి కష్టము గనిపెట్టకపోవుట అన్యాయమని గట్టిగ పలికి పిమ్మట మానాయనగారితో నిట్లంటిని. "ఇంకను మీ రిట్టి కష్టములు పడుట నేను సహింపలేను. రేపటినుంచి మీరు పెద్దలు ఉభయులును నాయొద్దకు వచ్చి నాపోషణలో నుండి, నాచేత సేవగొనుచుండవలెను. ఆప్రకారము మీరు చేయనియెడల నేను నావృత్తినైన మానుకొని ఇక్కడనే ఉండెదను. మీరు రేపు నాయొద్దకు రానియెడల మరల రేపు తప్పక వచ్చెదను. నాశపథమును నేను తప్ప"నని నాదుఃఖార్తిని వెలిబుచ్చితిని. వారు మారుపలకక ఊరకుండిరి. నేను మీరు తప్పక రావలయునని మరి రెండుమారులు స్పష్టముగ చెప్పి సాయంకాలమునకు అగ్రహారమునకు చేరితిని. మరునా డుదయమున మాతండ్రిగారు మాత్రము నాయొద్దకు వచ్చిరి. మా మేనత్తగారు రాలేదు. అప్పటినుండి మాతండ్రిగారు ప్రతిదినము ఉదయమున స్నానసంధ్యాదికములు తీర్చుకొని నా భోజనవేళకువచ్చి నాతో

గూడ భోజనముచేయుచుండిరి. మధ్యాహ్నము కొంతసేపటి విశ్రమించి, చల్లబడినపిదప పాతగుంటూరు నడచిపోయి మరల సాయంకాలము ప్రొద్దు గ్రుంకునప్పటికి అగ్రహారము వచ్చి, భోజనమైనపిమ్మట అప్పుడు మాయింటిలో నున్న దూరపు బంధువు మద్దులూరి చెన్నకృష్ణమ్మగారిని తోడుతీసుకొని చీకటిలో నైనను కాలినడకనే పాతగుంటూరు పోవుచుండిరి. చెన్నకృష్ణమ్మగారుమాత్రము ఉదయముననే తిరిగి వచ్చుచుండెను. ఈ చెన్నకృష్ణమ్మగారు మా అత్తవారింటిలో కొంతకాలము మగదిక్కుగా నుండిరి. మేము బందరులో నుండగా మాతోడనే యుండి, వంటమొదలగుపనులలో పాల్గొనుచు మాకు మిక్కిలి సహాకారిగానుండెను. కొన్నిసంవత్సరములు హైదరాబాదులో తమ్ముని యొద్ద నుండెనుగాని అచ్చట తనకు సుఖముగ జరుగక కాబోలు మరల నాయొద్దకే వచ్చిచేరెను. ఈయన వంటలో కడునేర్పరి. అత్యంతభోజనప్రియుడు, బలశాలి. దూరమునుండి గుండిగతో నీళ్ళు నెత్తిపై నిడుకొని వచ్చెడివాడు. తనకు తగినట్లు భోజనముకుదిరినయెడల దానితో సంతుష్టిచెందెడివాడు. కాని, ఆయనను సామాన్యులు భరింపజాలరు. ఆయనకు షడ్రసోపేతముగను సంతుష్టిగను భోజనవసతి జరిగెడిచోటనే గాని మరొకచో నుండజాలడు. ఆయన చనిపోవువరకు మా యింటనే ఇరువదిసంవత్సరములకాలము మమ్ములను కనిపెట్టుకొనియుండెను. ఆయన ఇంచుక స్థూలశరీరి. వైష్ణవనామములు ముఖమునమాత్రమేగాక రెక్కలమీదను ఎదురురొమ్ముమీదను నిండుగ ధరించుచుండెను. శ్రీవైష్ణవుడని, హెచ్చుగా వైష్ణవ ప్రతిపత్తిగలవాడని తెలియనివా రనుకొనుచుండిరి. దేవతార్చన

మంత్రపఠములు. మంత్రపుష్పమును వల్లించుటేగాని ఇతర విద్యా గంధ మాయన కావంతయు లేదు. వ్రాయను చదువనుగూడ అంతగా తెలియదు. వ్యవహారజ్ఞానమైనను శూన్యమే. అంతటి వాడు గనుకనే మాయింట అంత్యకాల ముందుట తటస్థించెను. ఇంటికి కావలసిన బజారువస్తువు లాయనయే తెచ్చుచుండెడి వాడు. ఆయన చేసినదే బేరముగాన అందువలన నష్టముగనే యుండెను. మరిమెవ్వరును లేనందున ఆయనవల్లనే నడుపుకొన వలసివచ్చెను.

## స్వ దే శో ద్య మం

మాపరిస్థితు లిట్లుండగా ఈమధ్యకాలములో దేశమున గొప్ప రాజకీయసంచలనము సంప్రాప్తమయ్యెను. బంగాళారాష్ట్ర విభజనవలన బంగాళములోనేగాక ఆసేతుహిమాచలము ప్రభు త్వమునెడ విరక్తి ప్రబలిపోయెను. కాంగ్రెసుమహాసభలో ఈవిభజనను ఖండించుటేగాక విదేశవస్తువులను బహిష్కరించి దేశములో నుత్పన్నమైన వస్తువులనుమాత్రమే స్వీకరించవలెనను తీవ్రదీక్ష వహించవలెనని కాంగ్రెసునాయకులు దేశమం దంతట నుపన్యాసముల గావించుచుండిరి. స్వదేశఉద్యమము భారత దేశమం దంతట సాగుటవలన విదేశవస్త్రముల అమ్మకము పడి పోయెను. సీమలో పాటకజనుల జీవనోపాయమునకు భంగము కలిగెను. బొంబాయి, అహమ్మదాబాదు మిల్లులలో నేయబడిన వస్త్రములు వాడుకలోనికి వచ్చెను. చేమగ్గములవారికిగూడ పనులు హెచ్చెను. కత్తులు, చాకులు, గాజుసామాన్లు సబ్బులు మొదలగునవి మనదేశములోనే తయారుచేయుటకు కర్మాగార

ములు కొన్ని స్థాపించబడెను. ప్రభుత్వమున కిది వెట్టబుట్టించెను. కాని ఇంతమాత్రమున ఈఉద్యమములో నున్నవారి నేమియు చేయలేకుండిరి. తమ క్రిందియుద్యోగులు స్వదేశవస్త్రములు ధరించుట సహింపకుండిరి గాన ఆ ఉద్యోగులు ఈ ఉద్యమము నకు దూరముగనే యుండిరి. జాతీయవిద్యాప్రచారము సాగు చుండెను. జాతీయగీతములు, పద్యములు జనులలో ప్రాకి పోయెను. వందేమాతరగీతము ప్రజలలో నూతనోత్సాహము పురికొల్పుచుండెను. ఆకాలమున బంగాళారాజధాని భారతదేశ మునకు మార్గదర్శకమై విలసిల్లుచుండెను. ఆనాటి ఉద్యమముల కన్నిటికి ముఖ్యస్థానము కలకత్తాపట్టణమే. సురేంద్రనాథబెనర్జీ, డబ్లియు. సి. బెనర్జి, బిపిన్‌చంద్రపాల్ మొదలగు కాంగ్రెసు నాయకులు వక్తృత్వమున సుప్రసిద్ధులు. వీరిలో బిపినచంద్రపాల్ కలకత్తా మొదలు చెన్నపట్టణమువరకును గల పట్టణము లన్నిట స్వదేశోద్యమమునుగురించి మహోద్రేకపూరితములై, యువకుల వేడిరక్తము పొంగులెత్తించు గంభీరోపన్యాసముల నిచ్చి ఎన్నడు కనివినని ప్రజాందోళన గల్పించెను.

బిపినచంద్రపాలు బ్రాహ్మసామాజికుడు. సమాజసందేశ వ్యాప్తికై అంతకుముందొకసారి బందరుకు వచ్చి, మహోప న్యాసమొసంగెను. ఆనాడు బంగాళదేశమున ఆంగ్లేయవిద్యా ధికులు పలువురు బ్రాహ్మసమాజికులే. వీరిలో అనేకులు విద్యా వతులగు స్త్రీలుగూడ చేరియుండిరి. ఏకేశ్వరోపాసనము, జాతి కులభేదములులేని సర్వమానవసమానత్వము, విగ్రహారాధనని షేధమును— ఈమతము హైందవమతమునుండి వేరుజేయువిశిష్టాంశ

ములు. వీరిలో పలువురుదీక్షాపరులు, ఆస్తికులు, గౌరవపాత్రులు నుండిరి. విద్యార్థిగా నున్నపుడు పండితశివనాథశాస్త్రిగారి ఉపన్యాసములు వింటిని. నిర్మలచిత్తముతో పరమేశ్వరుని ధ్యాన మొనర్చుచు అన్నిటికిని ఆయనయందే భారముంచి ప్రవర్తించుట పరమధర్మమని వారు వక్కాణించిరి. అందువలన కొఱతలేక జీవితము సాగగలదని బోధించి, అట్టి నిరతిశయ భక్తిప్రపత్తుల వలన కలుగు ఫలితమునకు స్వీయానుభవములను దృష్టాంత ముగ చెప్పిరి. శశిపాదబెనర్జీ, హేమచంద్ర సర్కారుల సంభాషణలుగూడ నేను వింటిని. శశిపాదబెనర్జీగారు తొం బదిసంత్సరముల వృద్ధులుగా నున్నపుడు కలకత్తాలోనే దర్శించి వారు ఋషికల్పులని భావించితిని. సీతానాథతత్త్వభూషణులు మహాపండితులు. వీరు శంకరసిద్ధాంతమునందలి మాయావాద మును ఖండించి, రామానుజుల సగుణతత్త్వమునే అంగీకరించి, నిర్గుణతత్త్వమును నిరసించిరి. శంకరుని నిర్గుణసిద్ధాంతమున భక్తిప్రపత్తుల కవకాశము లేదని వారి వాదము. ఈవిమర్శ కిందు స్థానములేదు. గాని నేను వ్రాసిన 'బ్రహ్మవిచార' మను పుస్తకమున ఈవిషయమైన చర్చలు వలయువారు చదువగలరు. మన ప్రాంతమున ఈ బ్రాహ్మమతమునవలంబించినవారిలో శ్రీ వేంకటరత్నంనాయుడు, వీరేశలింగముగార్లను గూర్చి ప్రశం సించితిని. నాయుడుగారు పిఠాపురము జమీాందారుగారైన సూర్యారావుబహద్దరువారికి గురుప్రాయులుగ నుండి వారిచే అనేకసత్కార్యముల నొనర్పజేసిరి. ఆజమీాందారుగారు బ్రహ్మ సమాజమునందు అభిమానముకలవారయ్యు వారిసంస్థానమున నవరాత్రములలో వేదాధ్యయనపరులకును శాస్త్రజ్ఞులకును

ఏటేట సన్మానములుచేయు నాచారము నడపుచునే యుండిరి. జమీందారుగారి సతీమణి హిందూమతాభిమానిగా నుండి, దేవీ పూజలుమొదలగునవి చేయుచుండెను. అమె దీపారాధన చేయు చుండగా అకస్మాత్తుగా చీరకు నిప్పంటుకొని మండుటచే దేహ మంతయు కాలి మరణించెను. అప్పటినుండి జమీందారుగారి వర్తనలో కొంత మార్పుకలిగినట్లు చెప్పుచుందురు. మూడు నాలుగు సంవత్సరముల క్రిందట వారు షష్ఠిపూర్తి ఉత్సవము అతి వైభవముతో గావించుకొనిరి. అపుడు బ్రహ్మసమాజము వారికిని, ఇతరపండితులు, కవులు, గాయకులు మొదలగువారి కనేకులకు భూరిసన్మానములు గావించిరి. ఆఉత్సవమునకు నేను వెళ్ళి వారొనర్చిన పరోపకారకార్యములను ప్రశంసించితిని. కడప జిల్లాలో మైదుకూరునకు సమీపమున ఆనందాశ్రమములో చేసిన చిత్రవర్ణ దారుశిల్పములు కొన్ని వారికి సన్మానపూర్వకముగ నొసంగితిని. ఈ చిత్రకారులు పనిచేయు ఆశ్రమమునకు విరాళ రూపమున సహాయము చేయదగునని శ్రీ రాజావారి కప్పుడు ముఖ్యసలహాదారులుగ నుండిన శ్రీ బులుసు సాంబమూర్తిగారి మూలకముగ తెలియపరచితిని. పిమ్మట పలుమార్లు జ్ఞాపకము చేసినను ఏమియు నీయలేదు. బ్రహ్మసమాజమును గూర్చిన శాఖాచంక్రమణము నింతట నాపి, మరల స్వదేశోద్యమము నెత్తి కొందును. బిపినచంద్రపాలుని యుపన్యాసములచే ఆంధ్రదేశము ఉత్తేజితమైన ఆదినములలో బందరులో శ్రీ డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్యగారును, శ్రీ కోపల్లిహనుమంతరావుగా రును, శ్రీ ముట్నూరికృష్ణారావుగారు అను ముగ్గురు యువకులు సార్వజనికములగు ఉపకారకార్యములందు ఉత్సాహము కల

వారై యుండిరి. వీరిలో పట్టాభిసీతారామయ్యగారు వైద్యమం నందు నిపుణులని పేరుపొంది ద్రవ్యోపార్జనసామర్థ్యము గలిగిన వారు. కోపల్లి హనుమంతరావుగారు యం. ఏ పరీక్షయం దుత్తీర్ణులై దేశములో విద్యావిషయికమైన సేవచేయవలయునను గొప్పదీక్షతో జీవితమును అర్పణజేయసమకట్టిన మహోదార మూర్తి. శ్రీ ముట్నూరికృష్ణారావుగారు ఆంగ్లేయములో ప్రావీణ్యము లేకపోయినను తెలుగునందు గొప్ప ప్రావీణ్యము గణించి ఆంధ్రవ్యాసరచనయందు సమర్థులు. దేశోపకారకార్యములందు అగాధమగు అభిమానము గలవారు. వీరు ముప్పురును బాల్యస్నేహితులు. పట్టాభిసీతారామయ్యగారు వక్తృత్వశుద్ధి గలవారు. పైన నుడివిన వీరి సామర్థ్యములు కాలముగడచిన కొలది ప్రస్ఫుటములై ఆకర్షణీయములైనవి. ఈస్వదేశోద్యమమునందు వీరు ముప్పురును అనన్యమైన విశ్వాసము గలిగి జాతీయవిద్యావ్యాప్తికై కళాశాలాస్థాపన చేయ దీక్షబూనిరి. గ్రామములవెంట సంచారముచేసి ప్రజలకు స్వదేశోద్యమము, జాతీయాదర్శములు, జాతీయవిద్యాప్రాముఖ్యములను గూర్చి బోధించి కళాశాలనిమిత్తము విరాళములను వసూలుచేయ నారంభించిరి. వీరితోపాటు శ్రీ వల్లూరిసూర్యనారాయణగారును కొంతవరకు కవుతాశ్రీరామశాస్త్రియను మరియొక ఉత్సాహ పురుషుడును దేశపర్యటనమందు పాల్గొనిరి. ఈ శ్రీరామశాస్త్రి గారి కాంగ్లేయవిద్యావాసన లేకున్నను తెలుగున చక్కగ వ్రాయునేర్పు గలదు. మహాసభలందు వేలకొలది జనుల హృదయములు రాతిబండలైనను కరుగునట్లు భావపూరితములును మృదులపదగుంభితములును ఉత్సాహజనకములు నగుభాషణలు

నలువసమర్థులైన సంఘసంస్కరణాభిమానులు వీరు. వీరు వితం తూద్వాహముగావించుకొని సంఘబహిష్కరణబాధలనొందుచు కొన్ని గ్రంథములు తెలుగున వ్రాసి ప్రచురించియు, బంగాళాభాషా భ్యాసముచేసి, అందలి కథాగ్రంథములను ఆంధ్రీకరణముగావించి ప్రకటించియు, శారదయను మాసపత్రికను ప్రకటించియు ఈ రచనలవలన లభించిన స్వల్పాదాయముతో గాలిజీవనము చేయు చున్న యోగ్యపురుషులు. ఆకాలమున ఆంధ్రదేశమున సార్వ జనికజీవితమునందు గణనకెక్కిన ప్రసిద్ధవ్యక్తి. ఈయనకు పై జెప్పిన బందరుత్రయము చేయూత నొసగుచుండువారు.

ఇట్లు దేశపర్యటన గావించి, సొమ్ము సంపాదించి, బంద రులో నొక విశాలస్థలము సంపాదించి, అందు కొన్ని భవనము లను నిర్మాణముజేసి జాతీయకళాశాలను 1908 సంవత్సరమున స్థాపనగావించిరి. ఆకళాశాలా ప్రారంభోత్సవమున కాకినాడ న్యాయవాదులలో ప్రముఖులగు శ్రీ దురుచేటి శేషగిరిరావు పంతులుగారు అధ్యక్షతవహింప నాహూతులయ్యు రాజాలక పోయిరి. నేను అధ్యక్షత వహించి కళాశాలాప్రారంభము గావిం చుచు ఆంగ్లేయముననే యుపన్యసించితిని. కళాశాలాకార్య క్రమము నడిపించుట కొక కార్యనిర్వాహకసభ ఏర్పరుపబడినది. కళాశాలనిమిత్తము అయిదునూరులుగాని అంతకు మించిగాని విరాళములిచ్చినవారిలో కొందరితోపాటు నేనును అం దొక శాశ్వతసభ్యుడనుగా జేర్చబడితిని. స్వదేశోద్యమఫలితముగా ఆంధ్రదేశమున స్థాపితమైన బందరుకళాశాల కొంతకాలము ప్రజలచే మిక్కిలి శ్లాఘింపబడెను. కాని జాతీయవిద్యనుగూర్చి

మిక్కిలి అభిమానోత్సాహములతో గంభీరోపన్యాసముల నిచ్చిన ఘనులెవ్వరుగాని వారిబిడ్డలను ఈకళాశాలకు పంపక ప్రభుత్వ పాఠశాలలోనే విద్యగరపి ఉద్యోగములు లభింపజేసికొనజూచు చుండిరి. ప్రభుత్వపాఠశాలలో చేరుటకు ద్రవ్యము లేక, తిండికి గూడ జరుగని దరిద్రులుమాత్రము ఇందు విద్యార్థులుగ చేరు చుండిరి. వీరికి భోజనాదికవసతులేర్పరచి, కొన్ని సంవత్సరములు శ్రీ హనుమంతరావుగారును, శ్రీ పట్టాభి సీతారామయ్య గారును చాల కృషిసల్పిరి. ఆకళాశాలలో దేశచరిత్రము, చిత్రకళావిషయములు, ఆంధ్రభాషాజ్ఞానముతోపాటుగ, చేతి పనులలోగూడ ప్రవేశముగల్గించుట కొక యంత్రాగారము స్థాపించిరి. రాట్నమువడికించుట, నేతనేయుట, తివాచీలునేయుట మొదలగు నిర్మాణకార్యములుగూడ నేర్పుచుండిరి. ఇట్లు ఉత్సాహముగ కొన్నిసంవత్సరములు నడచినవిగాని నానాట విద్యార్థులు తగినంతమంది లేక సన్నగిలిపోయినది. ఇంతటి దుస్థితి రాకపూర్వమే హనుమంతరావుగారు తామంత నిష్కామ బుద్ధితో, త్యాగశీలముతో నిరంతరము నిద్రాహారములుమాని చేసిన సత్కార్యమునకు విద్యాధికులైనప్రముఖులలో సహితము ప్రోత్సాహములేకపోవుటచేత మనఃక్లేశము పొందుచుండిరి. ఎడ తెగని మహత్తరసేవయు, ప్రజలలో నిరుత్సాహమును ఆయన ఆరోగ్యమునకు భంగము కల్పించెను. తుద కాయన క్షయ వ్యాధిచే అకాలమృత్యువాత బడెను. అట్టి జ్ఞానమూర్తిని, నిష్కళంకసేవాతత్పరుని, సునిశితఆంగ్లభాషారచయితను, మహత్తరదేశభక్తుని, పావనచరిత్రుని గోల్పోయిన - ఆంధ్రదేశమే అన నేల ?-భారతదేశపు దౌర్భాగ్యమును వర్ణింపతరముగాదు. అప్పటి

నుండియే ఆంధ్రజాతీయకళాశాలకు దుర్దశ ప్రారంభమైనది. సాలునకు పదివేలరూప్యముల ఆదాయము వచ్చు భూవసతి దానికిగలదు. గాంధిమహాత్మునకు కళాశాలయందును అందు పనిచేయు పట్టాభి సీతారామయ్య, హనుమంతరావు, కృష్ణరావులయందును గల అభిమానముచేత కాంగ్రెసుచే పదునారు వేలరూప్యముల నొక్కసారిగ విరాళమిప్పించిరి. ద్రవ్యానుకూలమెంత యున్నను ప్రజలలో నిజమైన జాతీయవిద్యాభిమానము లేమిచే కళాశాలోద్దేశములు నెరవేరవాయెను. నేడు స్వరాజ్యము స్వాతంత్ర్యము లభించినవి గాన ఈకళాశాలలో జాతీయ విద్యతోపాటు స్వతంత్రముగ జీవితముజరుపుటకు తోడ్పడగల చేతిపనులను నేర్పు ఏర్పాటులు జరుపుటకు ప్రభుత్వము శ్రద్ధ వహింపదగును.

అనాదిసిద్ధమైన వంగజాతి ఐక్యమునకు భంగముగావించి దాని ప్రాధాన్యమును గౌరవమును నశింపజేయుటకు కర్జను ప్రభువు చేసిన ఈ దుష్ప్రయత్నము ఆయన యనంతరమున హార్డింజి హయాములో ప్రభుత్వము విడనాడవలసివచ్చెను. పూర్తికాబడిన విభజన మరల మార్చబడదని ప్రతిజ్ఞాపూర్వకముగ ఇండియాకార్యదర్శి వచించిన వాక్యము మరల దిగ మ్రింగవలసివచ్చెను.

## ఆంధ్రోద్యమ బీజములు

గవర్నరుజనరల్ హార్డింజి "ఒక్కభాషయు, ఒక్క శమును, ఒక్క సంస్కృతియు గల జనులు ఏకముగ

నొక్క-రాష్ట్రమున నొక్క-పరిపాలనలో నుండుటయే ధర్మ మనియు, అట్టి ఐక్యము జాతియొక్క- సర్వతోముఖాభివృద్ధికి దోహదము కల్పించునని యు ప్రకటనగావించిరి. బంగాళాదేశ విభజన మార్చి, హిందీభాషాప్రచారముగల ప్రాంతమును బీహారురాష్ట్రములో జేర్చి, బంగాళాప్రజలను ప్రత్యేక బంగాళా రాష్ట్రనిర్మాణము గావించిరి. మరల దేశమున శాంతి సమ కూడెను. స్వదేశోద్యమము మెల్లమెల్లగ వెనుకడుగు వేయ సాగెను. కాని హార్డింజిమొదలగువారు ప్రచురణచేసిన భాషా ప్రయుక్తరాష్ట్రసిద్ధాంతవచనములు దేశమున వ్యాపించెను. ముఖ్యముగ ఆంధ్రదేశమున అందున గుంటూరులోని ఆంగ్లేయ విద్యాధికులగు యువకులహృదయముల నాకర్షించెను. ఈ చెన్న రాజధానిలో ఆంధ్ర - కర్ణాటక - తమిళ - కేరళభాషలు నాలుగు ప్రచారములోనుండినను ఇట్టి ప్రత్యేకప్రాంతముల నన్నిటి నొక్క- రాష్ట్రమున గూర్చి ఒక్క- పరిపాలనచక్రమునందు చేర్చుటచేత పరిపాలనాసౌష్ఠవము లోపించి, మిక్కి-లి అసౌకర్యముగ నుండుట చేత, ఆయాప్రాంతములందు వసించు ప్రజల అభ్యుదయమునకు పలువిధముల ఆటంకము కలుగుచున్నది. కావున ఈ వివిధభాషా ప్రాంతములను వివిధరాష్ట్రములుగ నిర్మాణముచేయుట అవసర మను విషయము మాటిమాటికి వారు చర్చింపసాగిరి.

ఇంతకు బూర్వమే నేను బందరునుంచి గుంటూరు చేరి తిని. పిదపగూడ కృష్ణాజిల్లాకాంగ్రెసుసంఘముక్రిందనే గుంటూరు జిల్లాకాంగ్రెసువ్యవహారములు నడుచుచుండెను. జిల్లామహాసభ యొకటి నరసరావుపేటలో నడిచినది. అప్పుడు నేనే అధ్యక్షు

డుగా వ్యవహరించితిని. శాసనసభాసభ్యులుగా నుండిన మోచర్ల రామచంద్రరావుపంతులుగారుకూడ హాజరైరి. బీదలకు ఉచిత ముగ విద్యనేర్పుటయేగాక మధ్యాహ్నమునందు భోజనమునకు వసతి ఏర్పరుచుటకు ప్రభుత్వమువారు, విద్యాశాలాధికారులు గ్రాంటులిచ్చుట అవసరమని నా యుపన్యాసమున వచించితిని. రామచంద్రరావుగారు అది బాగుగనేయున్నది గాని సాధ్యము కాదని నిరసించిరి. ఈసభ జరిగినపిమ్మటనే స్వదేశోద్యమము ప్రారంభమై ప్రచారము తీవ్రముగ సాగి ప్రభుత్వమువారికి వేడి పుట్టించుకాలముననే తెనాలిలో కాంగ్రెసుసంఘయాజమాన్యమునమహాసభ యొకటి సమావేశమయ్యెను. ఈసభలో పాల్గొన్న వారికి ప్రభుత్వమువలన అపకారము కలుగునేమో యను సందేహము ప్రజలలో వ్యాపించెను. ఆసభకు నేను అధ్యక్షత వహించుటకై బండి ఎక్కబోవుచుండగా మాతండ్రిగారు "నిన్ను జనులు కోరుటయు నీవు అంగీకరించి సభలో అధ్యక్షతవహించుటకు బోవుటయు గౌరవముగ నున్నది గాన నాకు ఆనందముగనే యున్నది గాని నీవు మాత్రము సర్కారువారి వలన ఉపద్రవము రాకుండ తగుజాగ్రత్తతో ప్రవర్తించవలసిన"దని మెల్లగ హెచ్చరికచేసిరి. వారి హృదయమున గల సందేహమును గ్రహించితిని గాని అందువిషయమై భయ మేమియు నాకు గలుగలేదు.

తెనాలిలో ఈసభ 1907 లో జరిగినదని జ్ఞాపకము. ఈ సభకు పలువురు హాజరైరి. పోలీసువారు కొందరు సభ నిమిత్తము వేయబడిన పందిరివెలుపల తిరుగాడుచుండిరి. పోలీసులు లోనికి రాకూడదని నేను తెలియపరచితిని. దానిపైనొక

సబినస్పెక్టరు కొంత గడబిడ చేయసాగించెను. కొందరు మిత్రులు శాంతవచనములుచెప్పిభద్రముచేసిరి. సభకుచెన్నపట్టణమునుంచి హైకోర్టువకీలు శ్రీపురాణమునాగభూషణముగారుకూడవిచ్చేసిరి. గుంటూరునుండి న్యాపతి హనుమంతరావుగారును హైస్కూలులో ఉపాధ్యాయులుగా నున్న జగన్నాథరావుగారును గూడ హాజరైరి. అప్పటికింకను గ్రాంటుబడులలో ఉపాధ్యాయులు రాజకీయములలో పాల్గొనగూడ దను నిషేధము పుట్టలేదు. సభలో విదేశవస్తుబహిష్కారమును స్వదేశవస్తుప్రోత్సాహమును చేయవలయునని తీవ్రచర్చ జరిగినది. కొంత కలకలము బుట్టెను. తీరుమానమునకు అనుకూలురను ప్రతికూలురను లెక్కపెట్టవలసివచ్చెను. పంక్తులవరుసను తిరిగి నేనే స్వయముగ లెక్కపెట్టగా అనుకూలురసంఖ్య మిక్కిలి హెచ్చుగ తేలినందున కరతాళధ్వనములు మిన్నుముట్టెను. సభ మరికొన్ని తీర్మానములుచేయుటతో ముగిసెను. పోలీసువారితో తొందరలేకుండ జరిగిపోయినందున కందరును సంతసించిరి.

కాంగ్రెసు సభాకార్యములు కృష్ణా గుంటూరు జిల్లాలు చేరిన విశాలదేశఖండమున సంతుష్టిగ జరుపుటకు అవకాశము లేకుండెను. ప్రతిసంవత్సరము వార్షికమహాసభ ఒక్క జిల్లాలో జరుగుట కవకాశములేక రెండేండ్లకొకసారి జరుపవలసివచ్చెను. ఇందువలన ప్రజలలో కాంగ్రెసువ్యవహారములనుగూర్చిన ఉత్సాహము శ్రద్ధావిశేషములు తగ్గిపోవుచుండెను. స్థానికములైన ఇబ్బందులనుగూర్చిన విచారణకు అవకాశము కొఱతబడసాగెను. కావున గుంటూరు ప్రత్యేకజిల్లాగా విభజనకాబడినది. కాబట్టి

కృష్ణాజిల్లాకాంగ్రెసుసంఘమునుండి విడిపోయి, గుంటూరుజిల్లా లోని కాంగ్రెసువాదులు గుంటూరుజిల్లాసంఘము ప్రత్యేకముగ నేర్పరచవలెనని ఉద్యుక్తులగుచుండిరి.

## సొంతవ్యవహారములు

ఒకనాడు పాతగుంటూరు వెళ్లునప్పటికి నాతమ్ములిరువురును బిగ్గరగ అరచుచు తగవాడుచుండుటయేగాక ఒకరినొకరు కొట్టుకొనబోవుచుండిరి. నే నప్పు డిరువురను విడిపించి అట్లు బజారున బడుట అవమాన మని చెప్పి శాంతింపజేసితిని. కాని వారిరువురమధ్య సరిపడక మధ్యమధ్య తగవులాడుచునేయుండిరి. వారి భార్యలమధ్య మనస్పర్ధ లేర్పడెను. మా తండ్రిగారికి వీరిద్దరు నొకచోట కాపురముచేయజాల రని తోచెను. కుటుంబపు టాస్తిని పంపకముచేసి వేరింటికాపురములు పెట్టుటకు నిర్ధారణచేసుకొనిరి. "నీ వేమనియెద" వని నన్ను ప్రశ్నించిరి. నేను వారితో నేకీభవించితిని. భాగములు పరిష్కరించుటకు నా భార్యమేనమామగారైన మద్దులూరి సీతారామయ్యగారిని పిలిపించవలసినదని వారు సెలవిచ్చిరి. నా తమ్ముని భార్య నా భార్యకు పెదతల్లికుమార్తెయే గాన సీతారామయ్యగారు నా చినతమ్మునకు అనుకూలురే. పెదతమ్ముడు సూర్యనారాయణ చిన్నవానికంటె కొంతపరిజ్ఞానము కలవాడు కాన సీతారామయ్యగారి మధ్యవర్తిత్వము నంగీకరించెను. కుటుంబపు టాస్తిలో నాకు భాగము పంచనక్కరలేదు, తమ్ము లిరువురకే సమముగా పంచివేయవలసినదని మాతండ్రిగారితో చెప్పితిని. వా రందుకు

సమ్మతించక తమ ఆస్తిలో నేను భాగము తీసికొనితీరవలెనని పట్టుపట్టిరి. నేను స్వార్జితముగా సంపాదించిన సొమ్ముగూడ ఆస్తి మొత్తములో చేర్చి యావదాస్తియు మూడు భాగములుగా పంచవచ్చునని సీతారామయ్యగారిచే నాకు తమ అభిప్రాయము తెలిపిరి. అందుకు నేను సమ్మతించితిని. సన్ లైఫు ఇన్సూరెన్సు కంపెనీవలన నాకు రెండుసంవత్సరములలో రానున్న రు 3000/- లును, ఏలూరు జ్యూట్ మిల్లులో భాగములు వెల రు 1000/- లును, మరి యితరబాపతులు కలసి నాయాస్తి రు 6000/- ల మొత్తము తేలెను. ఆమొత్తముతో యావదాస్తి రు 30000/- లుగా నిర్ధారణచేసిరి. ఒక్కొక్కరికి రు 10000/- ల చొప్పున భాగనిర్ణయము గావించిరి. ఇందు కుటుంబముతాలూకు ఇల్లు నాభాగమునకే చేర్చిరి. ఇంటియావరణమునకు తూర్పువైపున నున్న ఖాళీస్థలమును అందున్న పంచపాళీయు నాపెదతమ్ముని కిచ్చిరి. నాచినతమ్మునకు ఒక ఖాళీస్థలమును, ఇంటిక్రింద కొంత సొమ్ము నేను ఇచ్చులాగున నిర్ణయముచేసిరి. భూములుమాత్రము ఉత్తమమధ్యమములు నిర్ణయించి పంచిపెట్టిరి. రుణములు వసూలుపఱచి, వచ్చినసొమ్మునో ఎప్పటి దప్పుడు భాగముల వరుస తీసుకొనుచుండులాగున ఏర్పరచి, బాకీలు వసూలుచేయు బాధ్యత నాపై నిలిపిరి. ఇతరగ్రామములలోని భూములు జాయిం టుగానే ఉంచుకొని, అయివేజుమాత్రము సమానభాగములుగా ప్రకృతమునకు పంచుకొనులాగున వీలువెంబడి అవియును పంచు కొనునట్లు నిర్ణయించిరి. మాతండ్రిగారు వెయ్యిరూపాయల బాకీ యొక్కటి వారిక్రిందనే యుంచుకొనిరి. నాభాగమునకు వచ్చినయింటిలో నాచిన్నతమ్ముడు కాపురముండెను. పిమ్మట

తనస్థలములో డాబాయిల్లు కట్టుకొనెను. అది కట్టుకొనుచుకూలీలకు సొమ్ముచెల్లించవలసినపుడు నాయొద్దకు వచ్చి, ఆసొమ్ము నిమ్మనికోరుచుండెను. నే నప్పుడు విరివిగ సంపాదించుకొనుచుంటిని గాన అడ్డుచెప్పక ఇచ్చుచువచ్చితిని. ఆప్రకారము సుమారు వేయిరూపాయలవరకు తేలెను. నే నది మరల పుచ్చుకొనవలె నను అభిప్రాయముతో నియలేను. భూముల విచారణ నేనే జరుపవలసివచ్చెను.

అయిలవరములో మాతండ్రిగారు ఆయూరి ఆచార్యుల వారికి పెట్టిన ఋణముక్రింద మాకు కొంతభూమి సంక్రమించెను. ఆ ఆచార్యులు దుర్వ్యసని. మానాయనగారు వారి వర్తనము విచారింపక వడ్డీకి ఆశపడి సుమారు రు 6000/– ల వరకు ఋణముపెట్టిరి. అంత మొత్తమునకు ప్రామిసరీనోట్లుమాత్రమే వ్రాయబడియుండెను. ఇది యంతయు నేను బందరులో నున్న కాలమున నడిచినది. మాతండ్రిగారికి ఈబాకీ రాబట్టుట కష్టసాధ్యముగ తోచి నేను గుంటూరుకు వచ్చినపిమ్మట నాకు తెలుపుటచే నేను ఆచార్యులగారి గ్రామమునకు వెళ్ళి విచారించగా ఆయన మాతండ్రిగారిచే బాకీ పెట్టించిన ఒక ఆసామీకి స్వాధీనుడై వర్తించుచున్నాడని తెలిసినది. ఆయనతాలూకు భూమి ధూళిపూడిలో నొకవర్తకునకు తాకట్టుపెట్టినట్లుగూడ తెలియ వచ్చినది. ఆచార్యులుగారు ముఖముతప్పించుచు కనపడకుండెను. ఆయనతల్లిగారిని పిలిపించి ఆమెతో చెప్పియు, స్నేహితుడైన ఆసామీసహాయముతో ఆచార్యులవారిని రప్పించియు, మరి కొంత సొమ్ము తల్లిగారికిని ఆచార్యులుగారికిని ఇచ్చునట్లు ఏర్పా

టుచేసుకొని, వారి కుటుంబము తాలూకు భూములు విక్రయము వ్రాయించుకొనుట సంభవించెను. దస్తావేజు మాఅన్నదమ్ములు ముగ్గురిపేరను రిజిష్టరుచేయించబడెను. ఇట్లు వ్యవహారము పూర్తి యైనపిమ్మట ఆచార్యులవారిభార్యయు, ఆమెతండ్రియునువచ్చి, జీవనముజరుగుట దుర్లభముగ నున్నదని చెప్పి ఆమెకు మను వర్తి రావలసియున్నదని పేచీలుపెట్టసాగిరి. భర్త దుర్వ్యసనియై, ఆమె జీవనమునకు తండ్రిగారి యిల్లు చేరవలసిన దుస్థితి కలుగుట గుర్తించి ఆమెకును కొంత సొమ్మిచ్చి, సమాధానపరచి పంపితిని. అప్పటి ధరలనుబట్టి ఇది దండుగవ్యవహారముగనే కనుబడెనుగాని అల్లరిపాలుగాకుండ వచ్చినంతవరకే చాలునని సంతుష్టిచెంద కల్గితిమి. ధూళిపూడిఆసామీకి ఇవ్వవలసిన తాకట్టుబాకీ క్రమేణ మేమే చెల్లించితిమి. ఈ పరిష్కారము 1908లో మేము పంపిణీలు చేసుకొని పార్టీఖత్తు రిజిష్టరుచేసుకొన్నపిమ్మటనే జరిగెను. కనుక ఈభూమియు జాయింటుగనే యుండి అయివేజుమాత్రము మూడుభాగములుగా పంచుకొనుచుంటిమి.

ఈ 1908 లోనే నేను మాతండ్రిగారితోడను నాసంసారముతోగూడ కాశీయాత్రకు వెళ్ళి, కాశీ గయా ప్రయాగ జగన్నాథాది తీర్థస్థానములనుదర్శించివచ్చితిని. మాతండ్రిగారి కప్పటికి డెబ్బదిఎనిమిది సంవత్సరములున్నను ఆ తీర్థయాత్రలయందలి భక్తిచే ఆయాస మనుకొనక నదులలో స్నానములుచేయుచు ఎంతదూరమైనను కాలినడకనే పోవుచు శ్రద్ధతో దేవసందర్శనములుచేయుచు మిక్కిలియోపికతో తిరిగిరి. 1909లో రామేశ్వరమునకు బోతిమి. శ్రీరంగము ముక్కోటిఏకాదశినాటికి చేరితిమి. రేపకడనే లేచి స్నానములుచేసి రంగనాథదేవాలయమునకు

పోయి, ద్వారదర్శనము చేయగలిగినందుకు మాతండ్రిగారు మిక్కిలి సంతసించిరి.స్వామిని ఎంత దర్శించినను తృప్తి లేకుండెను. ఎవ్వరో యొక ఉదారపురుషుడు ఆయనను తన చేతులతో పట్టి లేవనెత్తి దర్శనము చేయించెను. రామేశ్వరములో పదిదినములు నిలచితిమి. ఒకనాడు మధ్యాహ్నము భోజనమైనపిదప ఆ రామేశ్వరము దీవియగుటవలన మే మున్న తీరము వైపుగాక మరియొక తీరము వైపు పోవలెనని యుద్దేశించి యొంటరిగనే ఒక రోడ్డువెంట నడువసాగితిని. కొంతదూరము పోయినపిదప నొక ప్రక్కను చెట్లు గుబురుగా నున్న యడవి కనుపడెను. అందొక కాలిదారిని బట్టి కొంతదవ్వు పోవునప్పటికి గొప్పయెడారి పొడసూపెను. అందు పెద్ద యిసుకతిన్నెలు గానవచ్చెను. అందొక తిప్ప నెక్కి నలుప్రక్కలు బరికింప మానవు లెవ్వరును గానరారైరి. అప్పటికి భానుబింబము పశ్చిమాద్రిని గ్రుంకుచుండెను. దూరమున శ్రీ రామేశ్వరదేవాలయశిఖరము బంగారురేకులు పొదగబడియున్నందున ఆసాయంసంధ్యాతపమున తళతళ మెరయుచుండెను. ఆయెడారిలో నిర్జనప్రదేశమున నేకాంతముగ నుండుటచే కొంచెము గుండె జంకుబారెను. గాని అంతలో ధైర్యము బూని సర్వత్ర వ్యాపించియున్న పరమేశ్వరుని ధ్యానించి పరవశుడనై బిగ్గరగ "దేవా పరమేశ్వరా" యని పిలిచి నమస్కరించి సంతసించితిని. అంతట తృటికాలమున కలిగిన ఆనందానుభవమును జ్ఞాపకము తెచ్చుకొనుచు వచ్చిన దారినే అడవిలో నడిచి బసకు చేరితిని. అపూర్వమగు ఆ మహదానందమును నేను పిమ్మట రచియించిన "శ్రీ వేంకటేశ్వరానందలహరి" యను పుస్తకములో వర్ణించితిని.

1908 కి ముంధే రాయప్రోలు వెంకటరమణయ్య శాస్త్రి గారుఅనగా రాయప్రోలు యజ్ఞనసోమయాజులుగారి తండ్రిగారు నాకు చిరపరిచయులుగానున్నందున నొకదినము నాయొద్దకువచ్చి నీకు భగవద్గీత భాష్యముతోగూడ చదివిచెప్పవలె నను సంకల్పము కలదనిరి. నేను మిక్కిలి సంతోషముతో చదివెద నని నుడివితిని. ఉదయమున 6 గంటలకే లేచి స్నానమాడి మడి వస్త్రము ధరించి పూజాద్రవ్యములతో సిద్ధముగా నుండవలె ననియు తా నప్పుడు వచ్చి,యొకగంటకాలము భగవద్గీతాపఠనము గావించెదననియు చెప్పిరి. అప్పటికి నాకు పుట్టినపిల్లలలో మొదట పుట్టిన ఆడపిల్ల మాత్రమే మిగిలియుండెను. ఈగ్రంథకాలక్షేపమున నీకు సత్సంతానప్రాప్తి కలుగునని శాస్త్రిగారు వాక్రుచ్చిరి గాని నాకు అట్టి విశ్వాసము లేకపోయినను భగవద్గీతాపాఠము అవసరమును యుక్తము నని తలంచి వారు నియమించిన ప్రకారము ప్రతిదినము ఉదయమున ఆనందగిరిభాష్యముతో గూడిన గీతా గ్రంథమ్ము నొక పీటమీద పెట్టి పూజించి, పిమ్మట ఉపనిషత్తులందలి ప్రథమశ్లోకములుపఠించి, గీతాశ్లోకములను భాష్యముతో గూడ చదువుచుంటిమి. ఆప్రకారము పదునెనిమిదిఅధ్యాయములు చదివి ముగించినపిదప నొకరోజున సమారాధనచేసి శాస్త్రిగారిని వారి భార్యగారినిగూడ బిలిచి, నూత్నవస్త్రము లొసగి, గురుదక్షిణయు నిచ్చితిని.

కొంతకాలమునకు పిమ్మట నాభార్య ఆడశిశువును గనెను. భగవద్గీతాపఠనమున శ్రద్ధావిహీనుడగుటచే ఆడశిశువు కలిగినదని శాస్త్రిగారో వారిభార్యగారో యనినట్లు గాలివార్త యొకటి వింటిని. ఒకరోజున ఆ శిశువు ఇంచుక జబ్బుచేసి పొట్ట

ఎగురవేయుచున్నందున సమీపమున నున్న ఆయుర్వేద వైద్యుని పిలిపించి చూపించితిని. సదాపాకు తెప్పించి, రసముతీసి పొంగించి ఇచ్చిన-చో లతగ్గగలదని సలహాయిచ్చెను.ఇంతలో నెవ్వరో చెన్నపట్టణమునుండి -కాంగ్రెసునిమిత్తము చందాలు వసూలుచేయుటకు వచ్చి, నన్ను కలుసుకొని, తన్ను గృహస్థులయొద్దకు తీసికొని వెళ్లుమని కోరినందున నేను వారిని వెంటబెట్టుకొని యూరిలోని కేగితిని. ఇంటికి వచ్చునప్పటికి పదిగంటలు మిగిలినది. పిల్ల ఆడు కొనుచున్నదిగాని పొట్టమాత్రము ఎగురవేయుచునేయున్నది. ఉదయమున వైద్యుడు చెప్పిన వైద్యము చేయకపోతినని కొంత వ్యాకులము నొందితిని. ఇంతలో డాక్టరు కుగ్లరుదొరసాని వచ్చెను. నాభార్యకును ఆమెతో చాల పరిచయముగలదు. మాయెడల ఆమె స్నేహభావముతో మెలంగుచుండెను. ఆమె లోపలకు వచ్చినతోడనే పిల్లనుచూపించితిని. "నేను పిల్లను తీసికొనివెళ్లి చికిత్సచేసి మరల ఇప్పుడే పంపించెద" నని తల్లినిగూడ తనబండిపై కూర్చుండబెట్టుకొని ఆస్పత్రికి తీసికొనివెళ్లెను. పిల్లతో నాభార్య మరలివచ్చునుగదా యనుకొంటినిగాని ఎంత కాలముచూచినను రాలేదు. సాయంకాలము ఆరుగంటలవరకు చూచి ఆస్పత్రికి పోవునప్పటికి ఒకగదిలో పిల్ల ఒక తొట్టెలో పండుకొనియున్నది. దగ్గర కూర్చున్న తల్లి కండ్ల నీరు గార్చుచు దుఃఖపడుచున్నది. పిల్ల స్మృహతప్పియున్నది. పిల్లకు చికిత్స చేయుటలో ఆసురాతితో పండ్లూరాచిరట. రక్తము కారినది. దానిమీద వాతముగ్రమ్మి పిల్ల యిట్టి దుస్థితికి వచ్చినదని తల్లి చెప్పినది. ఆగదిలో మరెవ్వరును లేరు. కుగ్లరు మొదలగువా రందరు ప్రార్థననిమిత్తము చర్చికి వెళ్లిరని తెలిసినది. కొంతతడ

పైనపిమ్మట కుగ్గరుదొరసానివచ్చి పిల్లను ఏదో ఔషధమిచ్చెను. ఆరాత్రి యంతయు పిల్లను తనయొడిలో బెట్టుకొని ఆమె చాల వ్యధనొందినది. మేము దుఃఖముతో ఏమగునో యను భయము పొందితిమి. ఆమె పిల్లనిమిత్తము ఈశ్వరప్రార్థనచేసి "నీచిత్తము నెరవేరుగాక" యని ముగించెను. పిల్ల బ్రతుకు నను ఆశ లేనట్లే కనబడెను. కాని ఆమె పిల్లను తెల్లవారువరకు తన తొడపై నిడుకొనియే మావలెనే వ్యాకులచిత్తముతో బాధపడుచుండెను. తెల్లవారినపిమ్మట "ఇక పిల్ల బ్రతుకనేరదు గాన తీసుకవెళ్లవలసిన" దని చెప్పుచు, ఇంకను ప్రాణముండుటచే ఆవరణలో ఇంచుక పెడగా నున్న యింటిపంచలో పెట్టుకొనవచ్చు నని డాక్టరుగారు చెప్పిరి. అప్పటికి మాతండ్రిగారు మొదలగు బంధువులు వచ్చి చేరిరి. పిల్ల యింకను ప్రాణముతోనే యుండినందున మరల డాక్టరుగారు తనంత తానే వచ్చి పిల్లను ఆస్పత్రికి కొనిపోయి ఏదో చికిత్స కొంత చేసెను. మధ్యాహ్నమువేళకు పిల్ల చనిపోయినది.

డాక్టరుగారు సదుద్దేశముతోనైనను చికిత్సలో కొంత పొరపాటు చేసిరి. పిమ్మట ఆమెకు వశము తప్పిపోయినది. పశ్చాత్తాపముతో రాత్రియంతయు కన్నువాల్చక చికిత్స చేసి, మధ్యాహ్నమువరకును తాను చేయకలిగిన చికిత్సచేసినందుకు ఆమెయెడ కృతజ్ఞతాభావము కల్గెనుగాని ఆమె చేసిన చికిత్సలో లోపముచేసె నను విరుద్ధభావము నాకుగాని నా భార్యకుగాని కలుగలేదు. కాని ప్రొద్దుట ఆడుకొనుచున్న పిల్ల మధ్యాహ్నమగునప్పటికే స్పృహతప్పిపోయి మరునాటికి మరణించినందున ఆకస్మికముగ కలిగిన ఈవిపత్తు మామనస్సులను దుఃఖమున ముంచివేసెను.

*

# గుంటూరు మునిసిపాలిటీ

ఈ యుదంతము జరిగినపిమ్మట కొలది దినములకు అరండల్ పేటలో నెలకు రు 30/ ల అద్దెకొకయింటిలోచేరితిమి. ఈ యింటికి మిక్కిలి సమీపమున నామిత్రులు న్యాపతి హనుమంతరావుగారు క్రొత్తగా కట్టుకొనిన యింటిలో కాపురముచేయుచుండిరి. వారు యం. ఏ పరీక్షయందుకృతార్థులై సెకండరీప్లీడరుపరీక్షనిచ్చి గుంటూరు డిస్ట్రిక్టుమునసబుకోర్టులో న్యాయవాదిగా పనిచేయుచుండిరి. న్యాపతివారిది వ్యాపారులలో పేరుపొందినకుటుంబము. ఆస్తి నానాటికి తీసికట్టయినను వీరినాటికి నలుబది యకరముల ఫలవంతమైన భూస్థితి యుండెను. వీరు స్వభావముచే చాల శాంతులు. వీరియింట పలువురు పేదవిద్యార్థులు నిత్యమును భోజనముచేయుచుండిరి. దివ్యజ్ఞానసమాజములో వీరు సభ్యులు. ఆసిద్ధాంతములను ఆచరణలోపెట్టవలెననుశ్రద్ధవీరికి హెచ్చు. ఇంచుక పరిచయము గలవా రెవ్వరెదురుపడినను (Brother) సోదరా! యని ఇంగ్లీషుతో సంబోధించి కుశలప్రశ్నలడిగి సంభాషించిననేగాని వదలెడివారు కారు. దివ్యజ్ఞానసమాజ సంబంధపు బను లేవి వచ్చినను బాధ్యతబూని నిర్వహించుచుండిరి. గ్రామగ్రామము తిరిగి సొమ్ము ప్రోవుచేసి సమాజమందిరనిర్మాణము గావించిరి. పట్టణములో ప్రజలకు వీరియెడ మిక్కిలి అనురాగగౌరవములు గలవు.

పట్టణపరిపాలకసంఘములో సభ్యులై వీరు శ్రద్ధగా తమ విధుల నెరవేర్చుచుండిరి. నేను వీరి యింటిసమీపమున చేరిన పిదప అగ్రహారపుసభ్యత్వము ఖాళీఅయినందున దానికి నన్ను అభ్యర్థిగా నిలుమని ప్రోత్సహించి కృషిసల్పిరి. అగ్రహారములో

చాలమంది వైశ్యవర్తకులు వోటర్లుగా నుండుటచే ప్రత్యర్థి
యైన వైశ్యప్రముఖుడే జయమునొందెను. కొలదికాలమునకు
అరండల్‌పేట స్థానము ఖాళీ పడినది. అంతకుమున్న సభ్యులుగా
నున్న ఏకా రామయ్య పంతులుగారు మంచి పలుకుబడికలవారు.
నాయెడ అభిమానముగలవారు. నన్ను తమస్థానమున నుండు
మని ప్రోత్సహించిరి. అందుకు సమ్మతించి అభ్యర్థిగ నిలచితిని.
ప్రత్యర్థు లెవరును లేరుగాన సభ్యత్వము సుకరముగ లభించెను.
శ్రీ పి. వెంకటరెడ్డిగారను వైశ్యులు మునిసిపల్‌సంఘమునకు
అధ్యక్షుడుగ నుండిరి. ఆయన గుంటూరు క్రైస్తవకళాశాలలో
ఉపాధ్యాయులు. అంతకుముందు వైశ్యు లెవ్వరు నాపదవి
నలంకరించలేదు. కాబట్టి పలువురు పట్టుబట్టిఆస్థానము ఆయనకు
లభింపచేసిరి. ఆ ప్రయత్నమున నేను కొంత పాల్గొంటిని.
న్యాపతి హనుమంతరావుగారు సహాయాధ్యక్షులుగా నెన్ను
కొనబడిరి. హనుమంతరావుగారు సహజశ్రద్ధతో పనులు నిర్వ
హించుచుండిరి. రానురాను వెంకటరెడ్డిగారు ఇతరవ్యాసం
గములలో బడి అధ్యక్షుధర్మముల నుపేక్షచేసిరి. మునిసి
పాలిటీపనులు చాల దురవస్థలోనికి వచ్చెను. ప్రభుత్వము
మునిసిపాలిటీని ఏల రద్దుచేయకూడదో సంజాయిషీ ఇయ్య
వలసినదని ఉత్తరువుచేసిరి. ఆసందర్భమున హనుమంతరావు
గారు ఛైర్‌మన్ డెలిగేటుగా నియమింపబడిరి. అప్పుడు నేను
సహాయాధ్యక్షపదవికి సంబంధించినపనులు నెరవేర్పవలసివచ్చెను.
ఈమార్పు లన్నియు ప్రభుత్వపు టుత్తరువు వచ్చుననగా ఏర్పడి
నను లోగడకాలమున జరిగినలోపము లన్నిటికిని మేమే బాధ్యుల
మైనట్లు తెలియనివారు తలంచుటయే గాక మాకాలమునోన

మునిసిపాలిటీ రద్దుపరచబడిన దను అపకీర్తి పొందవలసివచ్చునేమో యను భయము మాకు కలిగెను. మునిసిపల్ రికార్డులు పరిశీలించినయెడల రద్దుపరచవలసినంత దోషములు కనుపడవు. కావున లోగడ రికార్డు లన్నియు చదివి, ప్రభుత్వముచేసిన యాక్షేపణల కన్నిటికి సమాధానములతో నివేదిక వ్రాయ వలసిన బాధ్యత నాపై బడుటచే కొన్నిదినములు తదేకదీక్షగా నివేదిక తయారుచేసితిని. అప్పుడు గుంటూరు డిప్యూటీ కలెక్టరుగా నున్న శ్రీ జయంతి రామయ్యపంతులుగారు మాకు విశేషముగ తోడ్పడిరి.

ఈ జయంతి రామయ్యపంతులుగారు న్యాయదృష్టియు సమర్థతయుగలవారు. శాసనములు చదువుటయందు సమర్థులు. ఆంధ్రసాహిత్యమునెడ దేశచరిత్రమునందు మిక్కిలి అభిమానము కలవారగుటచే తాము ఉద్యోగము చేసిన జిల్లాలలో శాసనములను బయలుపరచి వాని ప్రతులను ఆర్కియాలజికల్ శాఖకు పంపుచుండిరి. ఆంధ్రసాహిత్యసంఘమునకు కొంతకాలము అధ్యక్షులుగ నుండిరి. శ్రీ పిఠాపురముసంస్థానాధీశులు సాగించిన ఆంధ్రనిఘంటుప్రయత్నమున వీరే ప్రోత్సాహకర్తలు. ఆనిఘంటు విచారణకర్తలుగా గూడ నుండిరి. చెన్నపురిప్రెసిడెన్సీమాజస్ట్రేటుగా గూడ పనిచేసిరి. వీరు ఆంధ్రదేశములో పేరెక్కిన ప్రముఖులు. వారు నాయెడ కొంత అభిమానము జూపుచుండిరి.

నేను తయారుచేసిన నివేదికను రామయ్యపంతులుగారు బలపరచుచు ప్రభుత్వమునకు నివేదిక పంపుటతో ప్రభుత్వము

సమాధానముచెందెను. మునిసిపల్ వ్యవహారములు మామూలుగ నడచిపోయెను. ఛైర్‌మన్ వెంకటరెడ్డిగారు చాలకాలము రోగపీడితులుగా నుండి చనిపోయిరి. ఇట్లు ఖాళీపడిన ఛైర్‌మన్ పదవికి నేను నిలువవలెనను కోర్కె జనించెను, గాని హనుమంతరావుగారికి ఆపదవియెడల విశేషవ్యామోహము కలిగియుండుటచే నేను నాకోర్కెను విడనాడి, ఆయన యుండుటయే యుక్తమని తలంచితిని. తుదకు "పౌరనాయకుడుగా" రని పేరు పొందిన యతిరాజులునాయుడుగారు ఛైర్‌మన్‌గా అధికసంఖ్యాకులచే నెన్నుకొనబడిరి. ఆకాలములోనే శ్రీ ఎస్. శ్రీనివాసశాస్త్రిగారు గుంటూరువచ్చిరి. వీరు తర్వాత (Servants of India Society) అఖిలభారత సేవాసంఘమునకు అధ్యక్షులై గొప్ప గౌరవము బడసి, సర్, రైటు ఆనరబిల్ బిరుదములు బడసిరి. వీరు తిరువళ్ళికేణిహైస్కూలులో ప్రధానోపాధ్యాయులుగా నున్నకాలములో శ్రీ గోపాలకృష్ణ గోఖ్లేగారు వీరి ఆంగ్లేయభాషాపాండిత్యమును లోకవిషయపరిజ్ఞానమును, అసమానమగు వక్తృత్వశక్తిని గమనించి తాము స్థాపించిన అఖిలభారత సేవాసంఘములో సభ్యులుగా చేరునట్లు ప్రోత్సహించిరి. ఆదినములలోనే గుంటూరుకు వచ్చి రెండుమూడు దినములు మాయింటనే అతిథిగా నుండిరి. అప్పుడు వారి గౌరవార్థమొక అల్పాహారపువిందు నేర్పాటుచేసి న్యాయవాదులలో ప్రముఖులగువారి నందరిని పౌరనాయకులను సమావేశపరచితిని. అప్పుడు శాస్త్రిగారు ఉపన్యాసములో నన్నుగూర్చి ప్రశంసించుచు మునిసిపాలిటీలో నన్ను సభ్యునిగా నెన్నుకొని నాచే సేవ చేయించుకొనుట యుక్తమని వక్కాణించిరి. నాకు శాస్త్రి

గారితో పరిచయ మప్పటినుండియే ప్రారంభమయ్యెను. 1911లో కార్బోలును, నాకు వ్రణములేచి చాల ప్రమాదస్థితికి తెచ్చినది. అప్పుడు నాబ్రతుకు దుర్ఘటమని పలువురను తోచెను. పట్టణము లోని ప్రముఖులు పలువురు నన్ను జూచుటకువచ్చి యోదార్చు చుండిరి. నా విద్యాగురువగు యూలుదొరగారుకూడ నన్ను చూచి చాల సంతోషముపొందెను. దైవానుగ్రహమువలన ఆవ్రణము పక్వమైన పిదప సులభముగ శస్త్రముచేయుటతో నివారించినది.

# శారదా నికేతన సంకల్పం

ఆ వేసవిలో గుంటూరునందుండజాలక వాడరేవుంగో మాబంధువులయింటికి బోయి వేసవికాలము గడిపితిమి. అప్పుడు వేటపాలెములో కాపురముచేయుచున్న లక్ష్మీనారాయణ అను నొక బ్రాహ్మణుడు అవివాహితుడు, కాంగ్రెసుసభలకు వచ్చుచు సాంఘికసంస్కరణాభిలాషిగా నుండి, ఆయూరి యూని యన్ వ్యవహారములలో, స్కూలువ్యవహారములలో జోక్యము కలిగించుకొని పనిచేయుచుండెను. ఆరోజులలో వేటపాలెములో రోమన్ కాతలిక్కులు మతప్రచారము నిమిత్తము ఒక ఆంగ్లేయ పాఠశాలను స్థాపించి, దాని నిమిత్తము ఊరివెలుపల ఎత్తైన స్కూలుభవనమును, చిన్న బంగళాయును మరికొన్ని చిల్లర కట్టడములను కట్టించిరి. రెండుమూడు చిన్నబావులు, పెద్ద దొరువులు త్రవ్వించి కొన్ని చెట్లు వేయించి ఆప్రదేశమును రమణీయము గావించిరి. కొన్నిసంవత్సరములు గడచినపై వారి

మతప్రచారము సన్నగిలిపోయెను. అంతట ఆపుస్తకాలుభవన మును బంగళాను, దానిచుట్టునున్న స్థలమును బేరముపెట్టిరి. దూరమున ఊరివెలుపల నుండుటచేతను స్మశానభూమిసమీప మున నుండుటచేతను ఆభవనములపై నెవ్వరికని వ్యామోహాము కలుగలేదు. లక్ష్మీనారాయణగారు నావద్దకు వచ్చి ఆభవన ములు స్వల్పధరకు లభించునని తెలిపిరి. అంతకుమునుపే పునహాపట్టణములో కార్వేపండితులు స్థాపించిన ట్లొక మహిళా విద్యాలయము స్థాపనచేయవలె నను ఆశయము నాహృదయ మున నుండెను. ఈభవనము లందుకు ఉపయోగించు నని ఎంచి తిని. తుదకు నాలుగువేలరూపాయలకు విక్రయించుటకు మిషన రీలు సమ్మతించిరి. నేను గుంటూరుబ్యాంకులో అప్పుతీసికొని వారికి చెల్లించి, క్రయదస్తావేజు రిజిష్టరుచేయించుకొంటిని. ఆభవనములు మొదలగువాని చూచుచుండుటకు లక్ష్మీ నారాయణగారినే విచారణకర్తగా నేర్పరచి, ఆతోటలో చెట్లకు నీళ్ళుపోసి పెంచుట కొరకు తోటమాలిని నియమించితిని.

పిమ్మట లక్ష్మీనారాయణగారిని వెంటబెట్టుకొని పునహా పట్టణములో మహిళావిద్యాలయమును దర్శించి, కార్వేపండితు లతో ముచ్చటించి, విద్యాలయము నడుపుటనుగూర్చి వారి సలహా పొందితిని. వారు నాప్రయత్నమునకు మిక్కిలి సంతసించిరి. వారి విద్యాలయములో శిక్షితయైన సమర్థురాలి నొకరిని మావిద్యాలయప్రధానగురుస్థానము వహించుటకు పంప వలెనని కోరితిని. వా రందుకు సమ్మతించిరి. ఆసమయముననే ఫర్గూసన్ కళాశాలను దర్శించి, ప్రధానాచార్యులైన పరంజపే గారిని కలుసుకొని, సంభాషించితిని. అఖిలభారతసేవాసంఘము

నకు బోయి అచ్చట నున్నవారితో ముచ్చటించితిని. అపుడు గోక్లేగా రచట లేరు. కార్వేగారు విద్యార్థి భోజనశాలలో మాకొరకు విందుగావించిరి. పళ్ళెములలో భోజనముచేయుట వారికి ఆచారము. మనము పెండ్లిరోజులలో వియ్యాలవారి విస్తళ్ళచుట్టు ముగ్గులువేసి ఊదుబత్తీలు వెలిగించినట్లు పళ్ళెములచుట్టును ముగ్గులువేసి ఊదుబత్తీలు వెలిగించిరి. ఇట్టి మర్యాదలను వారిచేనంది వారు కట్టించిన మహిళాకళాశాలా భవనము, వితంతుశరణాలయము, భోజనవసతిగృహములు మొదలగు కట్టడములు దర్శించి, వాని కొఱకు లక్షలకొలది ద్రవ్యమును వసూలుచేసి విద్యాదానముచేసి స్త్రీల అభ్యున్నతి నిమిత్తము అనన్యమగు కృషిసల్పిన మహాత్యాగియగు కర్వే పండితుని సెలవు పుచ్చుకొని మరల గుంటూరు చేరితిమి.

పునహాపట్టణములో శ్రీమహాదేవగోవింద రేనడేగారి భార్య వారిగృహమునే విద్యాశాలగ మార్చి, వయసునచ్చిన గృహిణులకును వితంతువులకును సామాన్యవిద్యతోపాటు ఎంబ్రాయిడరీ, లేస్ మొదలగు చేతిపనులను నేర్పుచుండిరి. మేము ఆసంస్థను దర్శించినపుడు రేనడేగారిభార్య కందుకూరివీరేశలింగముపంతులుగా రుండిన తెలుగుదేశమువారు మమ్ము శ్లాఘించుట ఎంతమాట" యని పంతులుగారిని ప్రశంసించెను. పిమ్మట శ్రీ పండితభండార్కరుగారి యింటికి బోయి వారినిగూడ సందర్శించితిమి. వారు మాతో ముచ్చటించుచు "మీప్రాంతము నుండి వేదపండితు లిచ్చటికి వచ్చుచుండెడివారు ఇప్పు డెవ్వరు నంతగ గానుపించుటలే" దని వక్కాణించిరి. వారిసంఖ్య తగ్గిపోవుచున్నదని మేము బదులు చెప్పితిమి. విద్యాధికులగు

యువకులు కొందరు అచట చేరి గావించుచున్న చారిత్రాత్మక పరిశోధనలనుగురించి వారు మాకు తెలియజెప్పిరి.

ఈమధ్యకాలములో చెన్నపురి శాసనసభలో నొక విచిత్రోదంతము నడిచెను. గుంటూరు, నెల్లూరుజిల్లాలలో మెట్ట భూములు వర్షాభావముచే ఫలించక ప్రజలు మాటిమాటికి క్షామబాధచే పీడితులగు చుండుటచే కృష్ణానదికి గుంటూరుజిల్లాలోని తెలుకుట్ల గ్రామమునకు దిగువను ఆనకట్టకట్టి అక్కడనుండి కాలువలు త్రవ్వి, పినాకినిపంటకాలువలలో కలిపి, రెండుజిల్లాలును సుభిక్షము గావించుటకు "కృష్ణారిజర్వాయరుప్రాజెక్టు" అనుపేరుతో నొకసన్నాహము ప్రభుత్వము సాగించెను. చాల విమర్శలు జరిగినపిమ్మట పదునాల్గుకోట్లరూపాయలు దాని వ్యయమునకు నిర్ణయింపబడెను. ప్లానులు అంచనాలు అంగీకృతములై పనులు కొలదిదినములలో ప్రారంభింతురని ప్రజలు ఉవ్విళ్లూరుచుండిరి. ఇట్టిసమయమున దక్షిణమున మెట్టూరుదగ్గర కావేరీ నదిమీద ఆనకట్టకట్టుట కొక ప్రణాళిక నాలుగుకోట్లరూపాయల వ్యయముతో సిద్ధముగానున్నదిగావున ముందు దానిని పూర్తి చేసి ఆమీద హెచ్చుఖర్చులు పెట్టవలసిన కృష్ణారిజర్వాయరుప్రాజెక్టు సాగించవచ్చునని చెన్నపురి శాసనసభలో తీర్మానించబడినది. అప్పుడు పానుగల్, బొబ్బిలిరాజాగార్లు మొదలగు జస్టిసుపార్టీ ప్రముఖులు ఆంధ్రులై యుండియు దాక్షిణాత్యులకు లోబడిరి. మెట్టూరు నాలుగుకోట్లనుకొన్నది పదునాలుగుకోట్లకు మించి వ్యయమైనను సాగినది. కృష్ణారిజర్వాయరుప్రాజెక్టు మూలబడి పోయినది.

# పితృవియోగము

నేను అరండల్‌పేట కాపురము చేయనారంభించినప్పటి నుండి మాతండ్రిగారు నాయొద్దనే యుండి పంచలో ఆనుడుకుర్చీ మీద కూర్చుండి తెలుగుఅర్థములుగల భగవద్గీతాగ్రంధము చేత బట్టుకొని చదువుకొనసాగిరి. పెద్దలై నకొలది వారియందుఉదార భావములు హెచ్చుగు నుండెను. తనక్రింద నుంచుకొన్న వెయ్యి రూపాయలలో మాయింటియొద్ద వీధిలో సర్వజనులకు నుపయోగించున ట్లొక నీటికొళాయిని కట్టుటకు సుమారు మున్నూరు రూపాయలుదానమిచ్చిరి. తక్కిన ద్రవ్యమునుగూడ కొత్తగుంటూరులో కూరలమార్కెటుకు సమీపమున పశువులు నీరు త్రాగునిమిత్తము తొట్టెకట్టించవలెనని సంకల్పించిరిగాని మునిసిపాలిటీవారు అభ్యంతరముచెప్పుటచే ఆప్రయత్నము సాగకపోయెను. ఇంతలో మాతండ్రిగారి కొకమధ్యాహ్నము ఆకస్మికముగ మూత్రవిసర్జన కట్టుబడిపోయెను, సూదిగ్రుచ్చి నీరుదుతీయవలసివచ్చెను. డాక్టరు దానిని నివారణచేయలేకపోయిరి. చికిత్సచేయవచ్చిన డాక్టరు మాయింటికి చిరపరిచితులుగాన ఆయనతో "ఈసారి నన్ను లేవదీయుదువా" యని మాతండ్రిగారు హాస్యముగ బలికిరి. వేడినీళ్ళుబోసిన గంగాళములో కూర్చుండబెట్టి చూచితిమి. కాని మూత్రముకాలేదు, మృత్యువు ఆసన్నమైనదని యెఱిగియేకాబోలును కుమారులు ముగ్గురను బిలిచి తా మీలోకమును విడిచిపోవుచున్నా మనియు, మీరు ముగ్గురు అన్యోన్యప్రేమతో మెలగుచుండు డనియు చెప్పి, నాతమ్ముని లిద్దరికి నన్ను నమ్మి ప్రవర్తించవలసినదని నుడివిరి. "నాన్నా మీకు

ఏమైన కోర్కెలుగలవా'' యని నేను ప్రశ్నించితిని. తన కింక
యీలోకమున కావలసిన దేదియు లే దని గట్టిగా బలికిరి. అం
తట ప్రక్కకు తిరిగి కన్నులుమూసుకొని పరుండిరి. రాత్రి
తొమ్మిదిగంట లాయెను. నేను భోజనముచేసి, లోగడ రాత్రు
లలో నిద్రలేకపోవుటచే ప్రక్కపై బరుండి నిదురించజాలక
మరల వారియొద్దకు బోయి నాయనా అని కొంచెము బిగ్గరగా
పిలచితిని. అంతట వెల్లకిల దిరిగి మాట్లాడప్రయత్నించినను నోరు
తెరచుటకుసాధ్యముకాదయ్యెను. పండ్లుకరచుకొనిపోయియుండెను.
అంతట తేనె తెచ్చి, నావ్రేళ్ళతో పండ్లపై నెమ్మదిగ రుద్దుటతో
డనే ''రామరామ''యని ప్రాణములువిడిచిరి. వారు నిత్యమును
నిద్రలేచునపుడు రామరామ యనుకొనుట అభ్యాసము. అటులనే
అంతవరకు జ్వరవేదనవలన కన్నులుమూసుకొని పరుండినవారు
నేను పిలచినతోడనే మేల్కొని, రామరామ యని దీర్ఘనిద్ర
చెందిరి. వారి అంత్యక్రియలు మిక్కిలి భక్తిశ్రద్ధలతో
మాతమ్ములును నేనును నెరవేర్చితిమి. ఇం దొకవిశేషము
విచిత్రముగ గాన్పించును. నేటి ఆంగ్లేయవిద్యాధికులు నవ్వి
పోదురని యెరిగియు జరిగినయదార్థము వివరింతును.
పండ్రెండవదినమున పిండము వేసినప్పుడు కాకులుగాని గ్రద్దలు
గాని దానిని ముట్టలేదు. ఎంతతడవు దూరమునునుండి వేచి
యున్నను అవి బెదిరిలేచిపోవుటేగాని సమీపింపవాయెను.
అంతట నన్ను మాతమ్ములను తండ్రిగారిని స్మరించి వారి
కెదియో కొదువగానున్నట్లు కనబడుచున్నదిగాన దాని నెరవే
ర్చెదమని నమస్కరించవలసినదని పలువురు నుడువసాగిరి. వారు
చనిపోకపూర్వము తమ కేవిధమైన కోర్కెలు లేవని ప్రత్యుత్త

మిచ్చియుండిరిగాన మేము నెరవేర్పకలిగిన దేదియు లేదని చెప్పుచు మనసున తలంచుకొని "తప్పులుచేసిన క్షమించు" మని నమస్కరించితిమి. ఆప్రకారమే మాముప్పురిభార్యలు నమస్కరించిరి. నేను వారి అస్థులను గంగలో కలిపెదనని సహితము నమస్కరించితిని. కాని కాకులు ఇంకను దూరము ననే యుండెను. ఇంతలో నా రెండవతమ్ముడు మేము యాత్రలకు బోయినపుడు తన్ను దిగవిడిచి పోతిరని నిష్ఠురముగి మాతండ్రి గారితో ముచ్చటించినట్లును అప్పుడు "నీవు పోవుతరుణ మొకటి రాగలదులే అప్పుడు పోవచ్చు"నని మాతండ్రిగా రనినట్లును చెప్పెను. అంతట నేను కాశికి వెళ్లునపుడు తమ్ముడు హరినారాయణనుగూడ తీసికొనివెళ్ళెదనని నమస్కరించితిని. వెంటనే కాకులును గ్రద్దలును గుంపులుగుంపులుగ వచ్చి పిండద్రవ్యమును తినిపోయెను. కనుక మరణానంతరము జీవులేదో సూక్ష్మ రూపమున నుండునను టకిది యొక దృష్టాంతము.

మాతండ్రిగారు చనిపోయినపిమ్మట దివ్యజ్ఞానసమాజము లోని ప్రముఖు లొకరు వచ్చి, వేటపాలెముబంగళాను చూచి అందు స్త్రీలవిద్యాసంస్థను స్థాపింతు మనిరి. బంగళా మొదలగు ఆస్తి అంతయు తమకు సంపూర్ణముగ నిచ్చివేయవలెననిరి. ఆ పదతులు నాకు అంగీకారము కాకుంటచే వారిప్రయత్నము ఆగి పోయెను. మిస్ బెనెంటు అను నొక ఆంగ్లేయస్త్రీ ఈప్రాంతమున సంచారముచేయుచు వేటపాలెము బంగళాకు వచ్చి, అచ్చట స్త్రీల విద్యాసంస్థ స్థాపించుటకై విజయనగరం మహారాణీగారి వలన లక్షరూపాయలవిరాళమును సముపార్జించెద నని చెప్పి

విజయనగరమునకు వెళ్ళెనుగాని ఆమెప్రయత్నమును సఫలము కాలేదు.

నేను అంతకుమునుపే పునహానుంచి గుంటూరు వచ్చిన తోడనే "శారదానికేతనము" అనుపేరుతో వేటపాలెములో నాబంగళాలో విద్యాసంస్థ స్థాపింతుననియు స్త్రీవిద్యాభిమానులు సానుభూతిసహాయము లొసంగవలెననియు కోరుచు ఒక కరపత్రమును ముద్రించి, ఆంధ్రదేశమున ప్రముఖులైనవారి కందరికి పంపియుంటిని. అనేకులు ప్రోత్సాహవచనములతో ప్రత్యుత్తరములు వ్రాసిరి. పిమ్మట లక్ష్మీనారాయణగారిని మునగాల జమీందారుగారియొద్దకు బంపి వారికి దివానుగా నున్న శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారిద్వారా ప్రయత్నముచేసి, నాలుగు వేలరూపాయలవిరాళమును వాగ్దానముచేయించుకొని, జాబితాలో ప్రప్రథమమున వారిసంతకముచేయించితిని. పిమ్మట న్యాపతి సుబ్బారావు, శెడింబి హనుమంతరావు, వేమవరపు రామదాసుగార్లు మున్నగు ప్రముఖ న్యాయవాదులచేతను, గుంటూరులో రాయసంవెంకటశివుడు, చట్టి నరసింహారావు మొదలగు స్నేహితులచేతను జాబితావేయించితిని. దాదాపు ఇరువదివేలరూపాయలవరకు జాబితామొత్తమువర్పడెను. కానిలక్షరూపాయలు జాబితామీద పూర్తియగువరకు ఒక దమ్మిడియైనను వసూలు చేయగూడదని నియమముపెట్టుకొని గ్రామములో కొందరు ప్రముఖులను జూచి అనుకొన్నప్రకారము లక్షరూపాయలు పూర్తిచేయగల నన్నుధైర్యము నా కుండెను. ఈసంస్థను నపుడు వారినిగూర్చి ఆలోచింపబనిలేదనియు నామిత్రుడు చెన్నాప్రగడ

భానుమూర్తిగా రుండనేయుండిరనియు తలంచితిని. శ్రీ కర్వే పండితులు ఒకఉపాధ్యాయురాలి నెట్లును పంపెదమనిరి గాన నాయుద్యమము సాగుటకు ధైర్యము నా కేర్పడెను.

ఇట్లు శారదానికేతనోద్యమమునడచుచుండ, మాతండ్రి గారి అస్తులను గైకొని నేనును నాతమ్ముడును కాశికి వెళ్ళితిమి. కాశీనుంచి మరలివచ్చునప్పటికి నిడదవోలులో కొన్ని ఆంధ్ర మహాసభలు సమావేశము గానుండెను. గుంటూరు, కృష్ణా, గోదావరిమండలముల కాంగ్రెసుమహాసభయు, సంఘసంస్కరణ మహాసభ, ఆంధ్రఆస్త్రీకమహాసభలును అక్కడ జరుగుటకు నేర్పాటులుజరిగెను. నిడదవోలులో కోవూరుబసివిరెడ్డి యను వారు చదువను వ్రాయను నేర్చియుండకపోయినను గొప్ప వర్తకముచేసి చాలసొమ్ము గడించి యుండిరి. ఆయనకుమారుడు చంద్రారెడ్డి విద్యనేర్చినవాడు. ఆంధ్రదేశాభ్యుదయోద్యమములం దభిమానముకలవాడు. ఈసభలను ఆయన నిడదవోలుకు ఆహ్వానించి పందిళ్ళు, పాకలు వేయించి, భోజనాదివసతులు ఏర్పరచెను. ఆయాసభలకు సంబంధించిన మహానాయకు లందరును అచ్చట చేరుటచే ఆంధ్రదేశమున ప్రసిద్ధికెక్కిన పురుషులును, స్త్రీలును గూడ నొకరినొకరు గుర్తెరుంగుట కపూర్వావకాశము కలిగెను.

కాంగ్రెసుసభకు వచ్చినవారిలో రాజమహేంద్రవరము వారు గుంటూరు, కృష్ణా, గోదావరులకు మూటికి నొక్క-కాంగ్రెసుసంఘము నేర్పాటుచేయనుద్దేశించిరి. అప్పటి కామూడు జిల్లాలకు శాసనసభలో నొక్కరినే సభ్యునిగా నంగీకరించు

చుండిరి కావున ఈమూడు నొక్కటిగా నుండుట యుక్తమని వారి అభిప్రాయము. గుంటూరుజిల్లానుంచి వెళ్ళిన మేము కృష్ణాజిల్లాసంఘమునుండి విడిపోయి ప్రత్యేకగుంటూరుజిల్లా సంఘముగ నేర్పడవలెనని యుద్దేశించుకొనియుంటిమి. చివరకు మాయుద్దేశమే సభలోఅంగీకరించబడినది. ఆ కాంగ్రెసు సభ లోనే ఆంధ్రరాష్ట్ర నిర్మాణమును గురించి తీర్మానము తెచ్చిరిగాని అధ్యక్షులుగానున్న శ్రీ వేమవరపు రామదాసుపంతులుగారు విషయనిర్ణయసభలో ప్రవేశపెట్టబడలేదుగనుక ఆతీర్మానము చర్చకుపెట్టుట సరికాదని నిరాకరించిరి.

మరునాడు గోదావరికాలువలో గుంటూరుమిత్రులు కొందరము స్నానముచేయుచుండగా యువకులలో నొకరగు చట్టి నరసింహారావుగారు "ఈసమయమున ఆంధ్రప్రముఖు లందరు ఒక్కచో జేకుటచే పరస్పరపరిచయము లేర్పడెనుగదా! ఇటులనే ప్రతిసంవత్సరము ఆంధ్రజిల్లాలవా రందరు గూడి ఆంధ్ర మహాసభ సల్పుట బాగుండు" నని పల్కెను. నేనును ఆవా క్యములు విని బాగుగనే యుండునని మారుపల్కితిని. అంత కంటె ఆవిషయమై ఎక్కువగా సంభాషణ ఏమియు జరుగలేదు.

కాంగ్రెసుసభలకు సామాన్యముగ హాజరుగాని ఆంధ్ర ప్రముఖులు ఆసభకు విచ్చేసిరి. ఆసభలో ఆంధ్రులను బర్మా యుద్ధమునాటినుండి సేనలో చేర్చుకొనగూడ దనునిషేధమును గర్హించుచు, దానిని తొలగించవలె నను తీర్మానము ప్రధాన ముగ చర్చించబడెను. అది ప్రభుత్వపుటుత్తరువును విమర్శించుట

గావున కొందరికి జంకుకలిగెను. అదివరకు రాజకీయసభలకు బోకుండువారికి మరింత వ్యాకులతకల్గెను. నేనాతీర్మానమును గూర్చి విమర్శించుచు ఆంధ్రుల పౌరుషధైర్యసాహసములును, యుద్ధనైపుణ్యమును పూర్వరాజన్యులకాలములోను ఆంగ్లేయ సైనికప్రచారములలో సహితము ప్రస్ఫుటములై యున్నవనియు ఎవ్వరో యొక సేనాని పాక్షికబుద్ధితో వ్రాసినవ్రాతల నాధారముచేసుకొని ముందువెనుకలు యోచించకుండ చేసిన నిషేధపుటుత్తరువు న్యాయవిరుద్ధమేగాక మొక్కబోవని శౌర్యవీర్యదర్పములుగల ఆంధ్రజాతిని సైనికదళములలో జేర్చరాదనుట కేవలము వివేచనారాహిత్యమును ప్రకటించుచున్నదనియు, బక్కబాపడనైన నేనుగూడ రణరంగమున అప్రతిమానప్రతాపమును ప్రకటింతుననియు వీరావేశముతో పల్కినపల్కులకు మహాసభలో కరతాళధ్వనులు మిన్నుముట్ట చెలరేగెను. మిత్రు లనేకులు నన్ను అభినందనవాక్యములతో ప్రస్తుతించిరి. విజయనగర కళాశాలాధ్యక్షులగు కిళాంబిరామానుజాచార్యులు గారు నా యొద్దకు వచ్చి, తమ యానందమును వెలిబుచ్చిరి.

ఇట్లు సభ లన్నియు ముగిసినపిదప ఇండ్లు చేరితిమి. కొలదిదినములకు గుంటూరులో న్యాయవాదిగా నుండి మునిసిపాలిటీకి అధ్యక్షులుగా కొంతకాలము పనిచేసి పట్టణములో పలుకుబడిగలిగిన శ్రీ వింజమూరి భావనాచార్యులుగారి యింటి యొద్ద కొందరు యువకులు చేరి నాకు కబురంపిరి. శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారును, చల్లా శేషగిరిరావుగారును, జొన్నవిత్తులగురునాధముగారును అక్కడ హాజరైనవారిలో ముఖ్యులు.

లక్ష్మీనారాయణగారు గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకా వేమలూరిపాడుకాపురస్థులు. సెకండుగ్రేడుప్లీడరీలో కృతార్థులై గుంటూరులోనే న్యాయవాదిగా నుండిరి. రాజకీయ, సాంఘిక సంస్కరణములందు ఉత్సాహముతో పనిచేయుచు వితంతూద్వాహములు జరిపి సంఘబహిష్కరణవలన పడరాని ఇడుములకు నోర్చి, పిమ్మట ఇంగ్లాండునకు బోయి, బారిష్టరుపరీక్షలో కృతార్థులై, హైకోర్టులో పనిచేయుచుండిరి. వీరికి యువకులలో హెచ్చుపలుకుబడి కలదు. జొన్నవిత్తుల గురునాధముగారు కృష్ణాజిల్లావారు. బి. ఏ. పరీక్షయందు కృతార్థులై ఆంగ్లేయ భాషారచనయందు సామర్థ్యము, భారతదేశ రాజకీయవిజ్ఞానము, దేశభక్తియు, త్యాగబుద్ధియు, కల్గిన ఉత్సాహమూర్తి. తరచు "హిందూ" మొదలగు ఇంగ్లీషుపత్రికలకు వ్యాసములు వ్రాసి పంపుచుండెను. కురుపాంజమీందారుగారియొద్ద స్వల్ప కాలము కార్యదర్శిగ నుండి, వారిమార్గములు తనకు కుదురక ఆఉద్యోగమును వదలి స్నేహితులసహాయముతో గాలిజీవనము చేయుచుండెను. చల్లా శేషగిరిరావుగారుకూడ ఉత్సాహశీలి యగు యువకుడు. దేశాభిమానిపత్రికకు వ్యాసములువ్రాయుచు రాజకీయములలో అభినివేశము ప్రకటించుచుండెను.

ఆనాడు జరిగిన సంభాషణలలో ఆంధ్రజిల్లాలను చెన్నపురిరాష్ట్రమునుండి విడదీసి, ప్రత్యేకరాష్ట్రముగా నిర్మాణము చేయవలసినదనియు, రాష్ట్రాంగములైన హైకోర్టు, రెవిన్యూబోర్డు మొదలగున వన్నియు ప్రత్యేకముగ నేర్పడవలెననియు, అందుకు దగిన ఆందోళన సాగించవలెననియు ప్రస్తావించి, నన్ను

ఆవిషయమైన భారమును వహింపవలసినదని కోరిరి. కాని నాకు వారిసంభాషణ ఆవేశపూరితమై అత్యాశలతోఁ గూడినదిగా గన్పట్టెను. అంతటి మహాకార్యము దుస్సాధ్యముగ గాన్పించెను. అందని[మ్రా]నిపండ్లకై [కా]లుసాచినట్లే యని తలంచితిని. కాని వారితో బొత్తుగ నేకీభవించనని మాత్రము చెప్పజాలకపోతిని. అంతటి యుత్సాహముతో నున్నవారి మనస్సులను మరల్చుట సాధ్యముకాదని తోచెను. ఈయుద్యమము పలువురకు వెఱ్ఱి ప్రయత్నముగ తోచును. ఇప్పటి కది ఎట్లున్నను ఏనాటికైన సాధించదగినదని నాకు స్పష్టముగనే యుండెను. కావున వారితో నే నిట్లు పల్కితిని. "ఈయుద్యమము భగీరథప్రయత్నమువంటిది. వినినవారికి వెఱ్ఱిగా కాన్పించకమానదు. మనలో ప్రముఖులైన వారికి మిక్కిలి అయిష్టము కల్పించవచ్చును. అందరిని కూడ దీసుకొనినగాని ఉద్యమము బలముగసాగి ఫలింపజాలదు. ముందుగనే ఆంధ్రరాష్ట్రనిర్మాణమునకై ప్రయత్నించి పలువురను బెదరగొట్టక ఆంధ్రులు, దేహ బుద్ధి, విద్యాపాటవమును ఆర్థికబలము నైతికబలము పెంపుచేసికొని, సర్వతోముఖమగు అభివృద్ధిపొందుటకు వలయుమార్గములను నిర్ణయించుటకు, ఆంధ్రులెల్లరు మేల్కొని ఐక్యముతో ప్రయత్నించుట అవసరము గాన ఆంధ్రమహాసభను స్థాపించి ఏటేట మహాసభలు ముఖ్య స్థానములలో జరుపుటయుక్తమని, అందులకువలయు ప్రచారము సాగించవలయు ననియు నాఅభిప్రాయము తెలిపితిని. వారిలో తీవ్రవాదులుకొందరు కొంతవడి భిన్నాభిప్రాయములు వెలిబుచ్చి వ్యతిరేకవాదన సాగించిరి. కాని తుదకు అందరమును నేను సూచించినమార్గమే యుక్తమని నిర్ణయించుకొంటిమి. అంతట

ఆంధ్రోద్యమము అనుపేరుతో చిన్నపొత్తమును తెలుగునను, ఇంగ్లీషునగూడ నేను వ్రాసి, సిద్ధముచేసితిని. ఈప్రయత్నమున జొన్నవిత్తుల గురునాథముగారు తోడయ్యెను.

## ప్రథమాంధ్రసభ

1913 సంవత్సరము వేసవిసెలవులలో బాపట్లలో గుంటూరుజిల్లాకాంగ్రెసుమహాసభ జరుపుటకు నిర్ధారణ కాబడెను. అక్కడ ఈభారమును వహించినవారిలో, నా చిరమిత్రుడు చోరగుడి వెంకటాద్రిగారు ముఖ్యులు. ఈయన బాపట్లలో న్యాయవాది. హాస్యరసప్రధానముగా ప్రసంగించు నేర్పరి. దేశహితైకకార్యములందు దీక్షతో కృషిచేయుచుండెను. కాబట్టి ఆంధ్రమహాసభ జిల్లాకాంగ్రెసుసభతోగూడ జరిపించవలెనని సన్మానసంఘమువారు అత్యుత్సాహముతో అంగీకరించి వెంకటాద్రిగారిని అధ్యక్షులుగా వరించిరి. నిడదవోలు తీర్మానము ననుసరించి ఏర్పడిన గుంటూరుజిల్లాసంఘమునకు నేను అధ్యక్షుడను. కావున గుంటూరుజిల్లాకాంగ్రెసుసభయు దాని వెంటనే ప్రథమాంధ్రమహాసభయును బాపట్లలో సమావేశపరుపబడునని పత్రికలలో ప్రచురించబడెను. ఆంధ్రోద్యమ గ్రంథములు విరివిగ దేశములో పంచిపెట్టబడెను.

భాష ననుసరించి బంగాళము, బేహారు వేరుపరచి ప్రత్యేకరాష్ట్రములుగ నేర్పరచిననాటనుండి గుంటూరులో ఆంధ్ర రాష్ట్రనిర్మాణమునుగూర్చి (Young men's Literary Association)

సాహిత్యసంఘ సమావేశములలో చర్చించబడుచుండెను. 1911 లోనే న్యాపతి నారాయణరావు అనువారు భావనను సరించి బేహారురాష్ట్రమువలెనే ఆంధ్రరాష్ట్రమునుగూడ నిర్మింపవలెనని వ్రాసినలేఖ పత్రికలలో ప్రకటించబడెను. యువకులలో జరుగుచున్న ఈఆందోళననుబట్టియే నిడదవోలుకాంగ్రెసుసభలో ఆంధ్రరాష్ట్రనిర్మాణమునుగూర్చిన తీర్మానము ప్రవేశపెట్టుటకు యత్నముజరిగెను. అప్పటినుండి పత్రికలలో ఆంధ్రరాష్ట్రమును గూర్చిన వాదప్రతివాదములు ప్రకటింపబడుచుండెను. కాని, ఆంధ్రోద్యమ మను పుస్తకమును వ్రాసిన నాకు ఆంధ్రరాష్ట్ర విషయమునుగూర్చి పత్రికలలో వ్రాయుట అభిమతముగాకుండెను. అదిగాకనేను ఆంధ్రోద్యమమునకు కార్యదర్శిగా వ్యవహరించుచుండుటచే ఆంధ్రరాష్ట్రనిర్మాణవిషయమున జోక్యము చేసుకొనుట ఉద్యమవ్యాప్తికి కొంతవిఘాతముగనుండును. ఈ కారణమునుబట్టియే జొన్నవిత్తుల గురునాథముగారును ఆసమస్యనుగూర్చి పత్రికలకువ్రాయలేదని తలంచుచున్నాను. కాని, ఆంధ్రులలో ఆంధ్రరాష్ట్రముపట్ల ఉత్సాహము పెరిగిపోవుచుండెను.

బాపట్లలో ఆంధ్రమహాసభకు చెన్నపురి శాసనసభలో పేరు పొందిన శ్రీ బయ్యా నరసింహేశ్వరశర్మగారు అధ్యక్షతవహించుట కంగీకరించిరి. నన్ను సన్మానసంఘాధ్యక్షునిగా నెన్నుకొనిరి. బాపట్లలో జిల్లాకాంగ్రెసుసభ పూర్తియైనమరునాడే ఆంధ్రమహాసభ సమావేశమయ్యెను. ఆంధ్రదేశమునందలి ప్రముఖులు అనేకులు సభకు విచ్చేసిరి. ప్రభుత్వోద్యోగులుకూడ వచ్చియుండిరి. వారిలో శ్రీ దివాన్‌బహద్దరు ముట్నూరు ఆదినారాయణయ్య

గారు సెటిల్మెంటు శాఖలో ఉన్నతోద్యోగిగా నున్నవారుగూడ సమావేశములో నుండిరి. ఈ ప్రేక్షకులతో క్రిక్కిరిసి సభ మహదానందము గొల్పుచుండెను. సభాధ్యక్షులగు నరసింహేశ్వరశర్మగారిని, రాజ్యపట్టాభిషేకమునకు 'గొనివచ్చు రాచకుమారునివలె పుష్పమాలాలంకృతుని గావించి మంత్రాక్షతలు సల్లి, కుంకుమాంకితునిజేసి, మంగళవాద్యముతో ఊరేగించుకొనుచు సభాస్థలికి తీసుకొనివచ్చితిమి. వేదవచనములతో, గీతములతో సభారంభము జరిగెను. అనంతరము నేను సన్మానపత్రమును చదివినపిమ్మట అధ్యక్షుని ఎన్నికజరిగెను. అంత సభాసదులు ఆనందపూరితులై. అత్యుత్సాహముతో కరతాళధ్వనులు చేయుచుండ అధ్యక్షులు దీర్ఘము, గంభీరమగు నుపన్యాసమిచ్చిరి. అందు ఆంధ్రదేశవైశాల్యమును, ఆంధ్రులు దేశదేశముల వ్యాపించుటయు నుగ్గడించి, పూర్వాంధ్రరాజుల శౌర్యప్రతాపముల వర్ణించిరి. తుదకు ఆంధ్రరాష్ట్రనిర్మాణమును గూర్చి సూచనమాత్రముచేసి తమ యభిప్రాయమును స్పష్టీకరించక ఉపన్యాసము ముగించిరి. పిమ్మట ఆంధ్రరాష్ట్రనిర్మాణావశ్యకమునుగూర్చి యొక తీర్మానము వేమవరపు రామదాసు పంతులుగారు ప్రవేశపెట్టిరి. ఆతీర్మానము సభలో గొప్ప కలకలము పుట్టించెను. దానికి అనుకూలురు పలువు రుండినను ప్రతికూలురలో దేశమందలి ప్రముఖులగువా రుండిరి. న్యాపతి సుబ్బారావుపంతులు, మోచర్ల రామచంద్రరావుపంతులు, గుత్తి కేశవపిళ్ళె మొదలగువారు ప్రతికూలాభిప్రాయములు ప్రకటించియుండిరి. సుబ్బారావుపంతులుగారు చెన్నపురి శాసనసభయందును కేంద్రశాసనసభలోను సభ్యులై ప్రఖ్యాతిగాంచిరి.

కాంగ్రెసుమహాసభకు గౌరవకార్యదర్శిగ చిరకాలము పనిచేసిరి. శ్రీ కేశవపిళ్ళెగారు గుత్తిలో న్యాయవాదిగానున్నను మిక్కిలి పలుకుబడి సంపాదించి శాసనసభలో సభ్యత్వముబడసి, రాయల సీమలో ప్రాధాన్యము వహించియుండిరి. మోచర్ల రామచంద్ర రావుగారు చెన్నపురి శాసనసభలో ప్రఖ్యాతి వహించినారు. ప్రభుత్వమువారిచే మన్ననబడసినవారు. అప్పటికాలములో ఆంధ్రదేశమున ఈముగ్గురిని మించినవారు రాజకీయములలో లేరు కావున వారిఅభిప్రాయమును ముందే తొలగద్రోసినచో ఆంధ్రోద్యమమునకే విఘాతము సంభవించుననుట స్పష్టమే. దేశమున ఈవిషయమున చీలికలు బలమగును. ముట్నూరి ఆదినారాయణయ్యగారు ఆంధ్రరాష్ట్రతీర్మానమును ప్రతిఘ టించుచు దీర్ఘముగ నుపన్యసించిరి. వారు చేసిన ఆక్షేపణలలో ముఖ్యమైనదేమన ఆంధ్రమహాసభోద్దేశములలో ఆంధ్రరాష్ట్ర విషయము లేదనియు ఆంధ్రుల పురోభివృద్ధియే సామాన్యముగ వక్కాణించియుండుటచే తమవంటివారు సభలో పాల్గొనుట సంభవించెననియు, ముందు తెలుపకయే ఈతీర్మానము ప్రవేశ పెట్టుట క్రమముగాదనియు వాదించిరి. రామచంద్రరావు పంతులు మొదలగువారు అమోఘమగు దేశసేవయొనర్చినవా రగుటవలన వారి సమ్మతిగూడ సమకూర్చుకొనుట అవసరమని కూడ నయవచనములతో ప్రసంగించిరి. ప్రజాభిప్రాయము తెలుసుకొనకయే యిట్టి తీర్మానము చర్చించుట అసమంజస మని ఆక్షేపించిరి. తొలుతనే భేదాభిప్రాయములు చెలరేగుట వలన అపుడపుడే మొలకెత్తిన ఆంధ్రోద్యమము మాసిపోవు నేమోయని మిక్కిలి భీతినొందితిని. కావున వాదోపవాదములు

ముదరకమునుపే లేచి, ప్రజాభిప్రాయమును సమకూర్చుకొ౦న కయే ఈతీరుమానమును ప్రవేశపెట్టుట సరికాదను వాదన సమంజసముగ నున్నదనియు, మనలో ప్రముఖుల యుద్దేశములను గూడ పాటింపవలసియున్నదనియు నుడివి, రాష్ట్రనిర్మాణము ఆంధ్రులపురోభివృద్ధికి అవసరమని నమ్మువాడనైనను అందు విషయమున ప్రజలలో ఆందోళనగావించి అంగీకారమును చేకూర్చుకొనుట యుక్తమనియే నేను నాఅభిప్రాయమును వెలిబుచ్చితిని. ఒక సంవత్సరకాలము ఇట్టి ప్రచారము దేశ మంతట గావించి, మన ప్రముఖులనుగూడ సమ్మతిపరచి, ముందు సంవత్సరము ఈతీర్మానమును ప్రవేశపెట్టవచ్చునని పలికినమీదట సభలో నామాటలు అంగీకృతముగ గన్పడినందున ఆంధ్రోద్యమ స్థాయిసంఘమువారిని దేశమున ప్రచారముసల్పి ఏకాభిప్రాయ మును సమకూర్పుడని కోరుచు తీర్మానము సవరణకాబడి మహాసభచే నంగీకరించబడెను.

1913 డిశంబరులో ఆంధ్రదేశములో రాయలసీమలో ప్రచారమునిమిత్తము శ్రీ పట్టాభిసీతారామయ్య, ముట్నూరి కృష్ణారావు, వల్లూరి సూర్యనారాయణరావుగార్లును నేనును ప్రచారసంఘముగా నేర్పడి పర్యటనముజేయ నారంభించితిమి. నంద్యాలలో దేశపాండ్య సుబ్బారావుగారిని కలుసుకొని ఆయూ రిలో మహాసభసమావేశపరచి ఉపన్యసించితిమి. పిమ్మట గుత్తి కేగితిమి. ఊరివెలుపల పెద్దసత్ర మొకటి కలదు. ఆసత్రములో మాకు భోజనమజ్జనాదులకు వసతిఏర్పరచిరి. గుత్తిలోపల ప్రవే శించుటకు ఇరుప్రక్కల నెత్తగు రాతిగోడలుగల పురాతన దుర్గ

ద్వారముగుండ మెలికలుదిరిగి వెళ్ళవలసి యుండెను. మాతో దేశపాండ్య సుబ్బారావుగారు గుత్తికోట పట్టుకొనబోవుచున్నా మని హాస్యవచనములు బల్కుచుండ మేము ఆపురమును జేరితిమి. ఆసాయంకాలమే మహాసభ సమావేశపరచబడెను. శ్రీ కేశవపిళ్ళెగారు అధ్యక్షతవహించిరి. ఆంధ్రుల పూర్వ వైభవమును, ఇప్పటి దుస్థితియు వర్ణించి, ఆంధ్రరాష్ట్రనిర్మాణావశ్యకము దాని ప్రయోజనములును వివరించుచు మాలో ఒకరివెనుక నొకరము ఉపన్యసించితిమి. కేశవపిళ్ళెగారు నయ వచనములతో మమ్ము సన్మానించుచు పల్కి, మాఉపన్యాసములనుగూర్చి ముచ్చటించిరి. రాబోవు ఆంధ్రమహాసభకు అధ్యక్షతవహించవలెనని కోరగా సంతోషముతో నంగీకరించిరి. మేము మరునాడు బయలుదేరి కడప, అనంతపురము, బళ్ళారి, హిందూపురముమొదలగు పట్టణములలో మహాసభలుగావించి ఆంధ్రరాష్ట్రనిర్మాణమునుగూర్చి ప్రచారము చేసితిమి. బళ్లారిలో లక్ష్మణస్వామిమొదలియారుగారు అధ్యక్షతవహించి మాఉపన్యాసమునందలి తెలుగుభాషనుమాత్రము ప్రస్తుతించి, ప్రత్యేక రాష్ట్రనిర్మాణవిషయమును పూర్ణముగ ఖండించిరి. ఇచ్చటతప్ప తక్కినచోట్ల ప్రజాభిప్రాయము అనుకూలముగనే యుండెను. కేశవపిళ్ళెగారు నానుభూతివచనములు పలికి, రాబోవుసభకు అధ్యక్షతవహించుటకు సమ్మతించినందున రాష్ట్రనిర్మాణవిషయమున అనుకూలురేయని యెంచి, పత్రికలకు వ్రాసితిమి. ఆయన వెంటనే తనయభిప్రాయము వ్యతిరేకముగ నున్నదని ప్రకటించిరి. ఇది మాకొకకొంత ఆశ్చర్యమును కల్పించెను.

పిమ్మట పెనుగొండగ్రామమునకు బోయితిమి. శ్రీ శివ శంకరంపిళ్ళె యను నొకన్యాయవాది గుత్తిలో కేశవపిళ్ళెగారి వలెనే పలుకుబడి కలిగి, కాంగ్రెసువ్యవహారములలో నచట శ్రద్ధవహించుచుండెడివారు. వారితో పరిచయముచేసికొని నెల్లూరు జేరి అక్కడ మహాసభ సమావేశపరచితిమి. ఇచ్చటి ఆంగ్లేయవిద్యాధికులకును చిత్తూరులోనివారికిని చెన్నపట్టణము నం దభిమాన మెక్కువగానుండి, చెన్నపట్టణము ఆంధ్రములో చేర దనుతలంపుతో ఆంధ్రరాష్ట్రనిర్మాణముపట్ల వైముఖ్య ముండెను. కాని సామాన్యజనుల అభిప్రాయము అనుకూలము గనే యున్నదని గుర్తించితిమి. తిరుపతి, చిత్తూరుపట్టణములందు దక్షిణాదిఅరవవైష్ణవులు, ఆంగ్లేయవిద్యాధికులు సహజముగ అరవదేశాభిమానులై యుండుటవలన వారు ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకు వ్యతిరేకాభిప్రాయములు వెలిబుచ్చుచుండిరి.

## 2 బెజవాడ

వేసవికాలము తిరిగివచ్చునప్పటికి బెజవాడలో రెండవ ఆంధ్రమహాసభ సమావేశమగునట్లు నిర్ణయించబడెను. బెజవాడలో శ్రీ పెద్దిభొట్ల వీరయ్యగారు, శ్రీ అయ్యదేవర కాళేశ్వర రావుగారు, అయ్యంకి వెంకటరమణయ్యగారు మొదలగు దేశాభిమానులు ఆంధ్రమహాసభను బాపట్లలోకంటె నెక్కువ వైభవముతో జరుపవలెనని కొన్నివేలరూపాయలు చందాలు వసూలుపరచి, పెద్ద పాక యొకటి సభాస్థానముగను, మరికొన్ని యితరపాకలు ప్రతినిధులనిమిత్తమును, వంటలు, భోజనముల నిమిత్తము మరికొన్ని పర్ణశాలలు నేర్పరచిరి. కాని తలవని

తలంపుగా గొప్ప గాలివానవచ్చి వాటి నన్నిటిని నిర్మూలము గావించెను. బెజవాడసన్మానసంఘమువారు వెనుదీయక మరల ఎంతయో సొమ్ము వ్యయముచేసి, అట్టివియే పాకలను నిర్మాణముచేసిరిగాని మరల నట్టి విపరీతవర్షమే కురిసి పాకల నన్నిటిని నేల గూలవేసెను.

బాపట్లలో మహాసభకు ఎనిమిదివందలప్రతినిధులు వచ్చియుండిరి. ఈసారి దేశములో రాష్ట్రనిర్మాణమునుగూర్చి తీవ్రమగు ఆందోళనజరిగియుండుటచే కొన్నివేలప్రతినిధులు రాగలరని బెజవాడవారు అందుకు తగినట్లు గొప్పఏర్పాటులు గావించిరి. బాపట్లలో రెండురోజులు సభ ముగిసిన మరునాడుదయమున ప్రతినిధులు వారివారి స్వస్థానములకు బోవుటకు రైలు స్టేషనుకు బోవునప్పటికి ఆకస్మికముగ పెద్దవర్షము కురియనారంభించెను. ఎంతతడవైనను వర్షము ఆగలేదు. రైళ్ళు రాలేదు. బాపట్ల సన్మానసంఘమువారు భోజనములులేక స్టేషనువద్దనున్నవారల కందరికి మరల వంటలుచేయించి భోజనములుపెట్టి ఆదరింపవలసివచ్చెను. ఈసారి వర్షము ప్రప్రథమముననే బెజవాడలో పాకలను పాడుచేసెను. ఇది తలచుకొని పలువురు విస్మయాకులచిత్తు లగుచుండిరి. మూడవసారి వేసిన పాకలుమాత్రము వర్షోపద్రవములేకుండ నిలచియుండెను. ఈమహాసభకు బందరున్యాయవాదులలో ప్రముఖులైన శ్రీ పురాణము వెంకటప్పయ్యగారు సన్మానసంఘాధ్యక్షులుగానుండిరి. న్యాపతి సుబ్బారావుగారు సభాధ్యక్షులుగ నుండిరి. సభాదినమున ఉదయమే ప్రతినిధులు కృష్ణానదిలో స్నానములుచేసి ఊరిలోనూరే

గింపుగావించిరి. శ్రీ సెనగపల్లి రామస్వామిగుప్త యనువారిని గూర్చి పైన కొంత వ్రాసితిని. సభలలో ఈయన మిక్కిలి ధైర్యముతో ఆవేశపూరితుడై దీర్ఘముగ నుపన్యాసములుచేయు చుండెను. ఆంధ్రదేశమున జరిగిన మహాసభలలో ఆరోజులలో ఈయన హాజరై, గంభీరముగ నుపన్యసించని సభ లేదనియే చెప్పవచ్చును. ఈ ఆంధ్రమహాసభాసమావేశములలో ఆయన యుత్సాహమునకు మేర లేకుండెను. ఊరేగింపులలో జయజయ ధ్వానములలో రామస్వామిగారి జయఘోష లెక్కువ విన బడుచుండెను.

మహాసభకు వేలకొలది ప్రజలు హాజరైరి. ప్రతినిధులు రమారమి రెండువేలుగా నుండిరని జ్ఞాపకము. రాష్ట్రనిర్మాణ తీర్మానము ఈసారి తప్పక నెగ్గించవలెనని పలువురు గట్టిగపట్టు పట్టియుండిరి. మహాసభకు మోచర్ల రామచంద్రరావుగారును విచ్చేసిరి. వీరు రాష్ట్రనిర్మాణమునకు సుబ్బారావుపంతులుగారి వలెనే వ్యతిరేకులు గాన వారిరాకకు సంతసించితిమి. కానివా రే మందురో యను సంశయము పలువురను బాధించుచుండెను. మొదటిదినమున సన్మానసంఘాధ్యక్షులు ప్రతినిధుల సన్మానవచనములతో నభినందించుచు ఆంధ్రరాష్ట్రనిర్మాణము మిక్కిలి ఆవశ్యకమని ప్రతిపాదించిరి. ప్రతినిధులును ప్రేక్షకులును అమందానందముతో పొంగిపోయిరి. నేను ప్రచారసంఘమువారు గావించిన పర్యటనవిశేషములనుగూర్చి నివేదిక వ్రాసి సభవారికి చదివి వినిపించితిని. సభాధ్యక్షులైన సుబ్బారావుగారి ఉపన్యాసవివరములు నే నిప్పుడు వ్రాయజాలను గాని అది సభాసదులకు సంతుష్టిగావించలే దనిమాత్రము స్పష్టమే.

మరునాడు మరల సభ సమావేశమై కొన్ని కాలేజీలు విద్యాశాలలు స్థాపించవలసినదని, ఆంధ్రులకు ప్రభుత్వోద్యోగములలో ఎక్కువ అవకాశమియ్యవలెనని కొన్ని తీర్మానములు చర్చించి అంగీకరింపబడినవి. పిదప మధ్యాహ్నము సమావేశమగునట్లు నిర్ణయింపబడెను. మధ్యాహ్నమగుసరికి మరల వర్షము ప్రారంభమయ్యెను. శ్రీ సుబ్బారావుపంతులుగారు పెద్దలగుటచే సుస్తీచేసి సభకు రాజాలకపోయిరి. వారిస్థానమున మరియొకరి నెవ్వరినో యెన్నుకొని రాష్ట్రనిర్మాణతీర్మానము చర్చించబడెను. ఈసారి తప్పక నెగ్గుననుట స్వతస్సిద్ధముగనే గన్పడెను. పలువురు అనుకూలముగ బల్కువారే యేర్పడిరి. పైనుండి వర్షముగురియుచు తాటాకుపందిరిమీద పడినవర్షము సభాసదులమీద పడుచున్నను కొందరు గొడుగులువేసుకొనియు, కొందరు తలపైన గుడ్డలుకప్పుకొనియు సభాస్థలము విడువక జయజయధ్వానములు మిన్నుముట్టునట్లు హర్షధ్వనులు గావించుచు తీర్మానమును అంగీకరించిరి. విశాఖపట్టణజిల్లావారు మూడవ ఆంధ్రమహాసభను వారిపట్టణమునకు ఆహ్వానముచేసిరి. పెద్దతటాకములోని నీరు కట్టతెగి ప్రవాహముగ పారి, చుట్టుప్రక్కల నేలపై పెద్దవెల్లువలై పారినట్లు ఆంధ్రరాష్ట్రనిర్మాణాశయము ఇక నే అడ్డులేక ఆంధ్రదేశమం దంతటను వ్యాపించగలదని స్పష్టమయ్యెను.

# ఆంధ్రోద్యమ ప్రచారము

1914, 1915 సంవత్సరములలో నా వృత్తివ్యాపారము సాగించుకొనుచు అప్పుడప్పుడు తీరికచేసుకొని ఆంధ్రదేశమున సంచారముగావించుచుంటిని. 1913లో బాపట్లమహాసభ జరిగిన పిమ్మట నేను మహానందిలో విద్యార్థుల మహాసభ జరుగునని విని న్యాపతి హనుమంతరావుపంతులుగారితో కలసి అచటికి వెళ్ళితిని. ఆమహాసభకు శ్రీ కేశవపిళ్ళెగారు అధ్యక్షత వహించిరి. అట్టిమహాసభ రాయలసీమలో అపురూపమైనదే. రాయలసీమజిల్లాలనుండి విద్యార్థులుమాత్రమేగాక పలువురు ప్రముఖులు గూడ విచ్చేసిరి. సభాకార్యక్రమము జరుగుచుండగనే నేను అధ్యక్షుల అనుమతి పొంది ఆంధ్రరాష్ట్రనిర్మాణమునుగూర్చి యుపన్యసించుచుండగా శ్రీ కేశవపిళ్ళెగారు "నేను అరవవాడనా, తెలుగువాడనా" యని ప్రశ్నించెను. మీరు తప్పక ఆంధ్రులేయని ప్రత్యుత్తరమిచ్చుచు పుట్టుకచే అరవవారైనను ఆంధ్రదేశమున మీవృత్తిని సాగించి, స్థిరనివాస మేర్పరచుకొని ఆంధ్రులకై పాటుపడుచు వారిలో ఐక్యమైనారుగావున మీరు ముమ్మాటికిని ఆంధ్రులే యని స్పష్టీకరించితిని. అందుమీద సభలో జయధ్వానములు చెలరేగెను.

మహానందిలో స్నానము మహదానందము కల్పించెను. మహానందీశ్వరునిదేవాలయ మొక అరణ్యప్రదేశములో నున్నది. ఊరుగాని పల్లెగాని లేదు. పర్వదినములలో యాత్రికులుతప్ప ఇతరసమయములలో మనుష్యసంచార ముండదు. రాత్రివేళ

దేవాలయము వెలుపల కట్టబడియున్న తొట్లలో నీరు త్రాగుటకు పులులు మొదలగు అడవిజంతువులు వచ్చునని అచ్చటివారు చెప్పిరి. చుట్టును రాతిగోడలతో కట్టిన ఎత్తగు ప్రాకారము గలదు. ఆప్రాకారపుగోడ నానించి వరుసగా మండపములవలె అరలు కట్టబడి యాత్రికులు రాత్రులందు పరుండుటకు వీలుగ నుండెను. కొందరాయరలలో వంటలుకూడ చేసుకొనుచుండిరి. ప్రాకారముఖద్వారము పెద్దదిగా నుండెను. ప్రకారముమధ్య తూర్పువైపున చిన్నదేవాలయమును ముఖమండపమును గలవు. ఆదేవళముమధ్య నొకలింగము దాదాపు భూమిమట్టమున కట్టబడిన పానవట్టముతో నుండును. ఈలింగమును యాత్రికు లందరును చేతులతో తాకి అభిషేకముచేసి స్వేచ్ఛగా పూజింతురు. ఈలింగముయొక్క శిఖరమున చిన్నతొట్టె యేర్పడి యున్నది. అందు వ్రేళ్ళు పెట్టినయెడల నీరున్నటుల తోచును. దాని దిగువభాగమున భూమిలోగుండ నీరుబారి దేవాలయ ముఖమండపపు బునాదిగోడకు కట్టియున్న నందిముఖముగుండ నిరంతరము ప్రవహించి ఆముఖమండపమునకు ఆనించి దేవాలయమునకెదుట కోనేరువలె నుండు రాతితొట్టిలో ఏకధారగా పడుచుండును. ఇట్లు ప్రవహించుజలములు అతినిర్మలములై ఎప్పుడును సమశీతోష్ణముగ నుండును. అందు నడుములలోతు నీరు తరుగకయుండును. ఎంతమంది అందు స్నానముచేసినను నీరు శుభ్రముగనే యుండును. ఏలనన అందు పడుచున్న నీరు కుండులో నిలువక ఎప్పటికప్పుడు తూములగుండ వెలుపలకు ప్రవహించి కాలువగ పారుచుండును. వెలుపలితొట్టిని నింపుచుండును. స్నానముచేయువారి పాదములగోళ్లుసహితము తెల్లగ

కనపడుచుండును. దేవాలయమునకు చేరువగనే యొకకొండ గలదు. ఆకొండలోనుండి ఈనీరు అంతర్వాహినిగా పారుచున్న దని యూహించదగియున్నది. ఈవిషయమును గనిపెట్టిన మహానుభావు లెవరో ఆశివలింగప్రతిష్ఠాపన గావించి ఆశివలింగమునుండి నందిముఖమున ఆపవిత్రజలములు పారింపజేసి తీర్థకుండిక నేర్పరచి ఆస్థలమును గొప్ప తీర్థయాత్రాస్థానము గావించిరి. మనపూర్వులిట్టి సహజనిర్మాణములను అద్భుతములగు విచిత్రరూపముల నెత్తించి వానిని తీర్థయాత్రాస్థానములుగ జేసి, దైవభక్తిని ప్రజలలో పురికొల్పుచుండిరి. ఉద్దేశము ఎంత యుక్తమైనను సత్యమును మరుగుపరచు సాధనములచే నెరవేర్ప జూచుట యుక్తముగాదని నాకు తోచుచున్నది.

ఆంధ్రరాష్ట్రనిర్మాణసంబంధమగు ఈప్రచారనిమిత్తమే యొకసారి రాజమహేంద్రవరమున మహాసభ సమావేశమయ్యెను. ఆసభకు న్యాపతి సుబ్బారావుగారగ్రాసనాధిపతిగా నుండిరి. అచ్చటకు వచ్చినసభ్యులలో పలువురు న్యాయవాదులే. అచ్చట నాప్రసంగము ముగిసినతర్వాత శ్రీ ధార్వాడ కృష్ణారావు గారును, శ్రీ టంగుటూరి శ్రీరాములుగారును ఆంధ్రరాష్ట్రోద్యమము తమిళులతో కలిసియుండుటవలన కలుగుచున్న లాభములు గమనించలేక సంకుచితదృష్టితో సాగించుచున్నదనియు దీనికి తోడ్పడుట అనుచితమనియు తీవ్రముగ ఖండించిరి. న్యాపతి సుబ్బారావుగారి అభిప్రాయముగూడ ఆధోరణినే. యనుకరించెను. వీరందరు ఆంగ్లేయభాషలోనే ప్రసంగించిరి. అంతట వారిప్రసంగములను సావకాశముగ వినుచున్న శ్రీ చిలక

మర్తి లక్ష్మీనరసింహముగారు తెలుగున భాషించుచు వారు గావించిన ఉపన్యాసములను తీవ్రముగ విమర్శించి సర్వవిధముల ఆంధ్రజనాభ్యుదయమునకు బలిష్టసాధనమైన రాష్ట్రనిర్మాణమును గూర్చిన ఆందోళన సంకుచితదృష్టితో చేయబడుచున్నదనుట సమంజసముకాదనియు, మన యల్పబుద్ధిని ప్రకటించుటయేయని మేఘగర్జనముచేసినట్లు ఎలుగెత్తి వాక్రుచ్చిరి. స్వార్థప్రియులమై మనము మిన్నకుండి దేశమున కుపకారముచేయబూనినవారి యత్నమును నిరసించుట అన్యాయమని సహేతుకముగను నిర్భయముగను, నిర్మొగమాటముగను వక్కాణించిరి. శ్రీ సుబ్బారావుపంతులుగారు రెండుమూడువాక్యములలో నేను ఉపన్యసించినందుకు సభాపక్షమున కృతజ్ఞత తెల్పి సభముగించిరి.

శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముపంతులుగారు ఆంధ్ర కవీశ్వరులై, అనేకకావ్య నాటకములను, నవలలను, రచించి ప్రఖ్యాతిగాంచిరి. వీరు సంఘసంస్కరణాభిమానులు, దేశాభి మానులునై, జాతీయపాఠశాలను స్థాపించిన మహనీయులు. వీరు అంధులయ్యు దేశహితైకకార్యములందు మిక్కిలియుత్సా హముతో పాల్గొనుచు, వీరేశలింగముపంతులుగారి వితంతు శరణాలయసంబంధములగు కార్యములందును తోడ్పడుచుండిరి.

ఆంధ్రరాష్ట్రప్రచారమునకై కాకినాడలో దుగ్గిరాల సూర్యప్రకాశరావుగారి ఆధిపత్యమున మహాసభ నడిచినది. పిఠాపురముజమీందారుగారి కళాశాలలో కొందరు ఉపాధ్యా యులును, న్యాయవాదులుమొదలగువారును సభకు హాజరైరి.

నాఁడుపన్యాసమును ఆనందముతో వినిరి. సూర్యప్రకాశరావు గారు అనుకూలాభిప్రాయమును వెల్లడించిరి. వీరు గోదావరి జిల్లాసంఘకార్యదర్శిగా నుండి, చిరకాలము దీక్షతో పనిచేసిరి. భూముల నీటివసతులు మొదలగువానినిగూర్చి పలుమారు ప్రభుత్వమువారికి అర్జీలుపంపి, రహితుల కష్టముల నివారణచేయు చుండిరి. వీరివ్రాతలు విషయపరిజ్ఞానము కలిగి, మిక్కిలి సహేతుకముగ నుండెడివి. సంఘసంస్కరణమునందును అభిమానము గలదుగాని వారికృషి యెక్కువగ స్థానికప్రజల బాధానివారణ చేయుటలో వినియోగింపబడుచుండెను. కనుక కాకినాడపౌరులలో వీరిది గురుస్థానము. వీరు పూర్వార్జితమువలన స్వతంత్ర జీవనము సలుపు సంపన్నగృహస్థులు.

## 3, 4 విశాఖపట్టణం, కాకినాడ

మూడవ ఆంధ్రమహాసభ విశాఖపట్టణములో 1914 వేసవిలో జరిగినది. శ్రీ పానుగంటి రామారాయణింగారు యం. ఏ. పట్టభద్రులు, ఆంధ్రభాషాప్రవీణులు. కేంద్రశాసన సభలో సభ్యులు. నేను వారిని కలుసుకొని ఆంధ్రమహాసభకు అధ్యక్షతవహింపుడని కోరితిని. ఆయన రాష్ట్రనిర్మాణవిషయము కొంతవడి నాతోచర్చించి తుదకు అధ్యక్షతవహించుట కంగీకరించిరి. శ్రీ భూపతిరాజు వెంకట్రాజుగారు శాసనసభలో సభ్యులు. విశాఖపట్టణములో ప్రముఖులగు న్యాయవాదులు. ఆంధ్రరాష్ట్ర నిర్మాణవిషయమున పూర్ణముగ నభిమానముకలవారు. వారు సన్మానసంఘాధ్యక్షోపన్యాసములో దానినిగూర్చి గట్టిగ పోషించిరి. పానుగల్లురాజాగారు మొదటి సంశయములెల్ల విడనాడి

రాష్ట్రపక్షముననే పూర్ణహృదయులై భాషించిరి. ఇట్లు బెజ వాడలో ఆంధ్రరాష్ట్రనిర్మాణ మవశ్యమని చెప్పిన మహాసభ విశాఖపట్టణములో ఆంధ్రరాష్ట్రము నిర్మించవలసినదని ప్రభుత్వ మును కోరుచు తీర్మానించెను. ఆర్టుకళాశాలలను, ఇంజనీయరింగు కళాశాలలను నిర్మాణముచేయించవలె నను మరికొన్ని తీర్మాన ములు చేసి, సభ ముగించిరి. నాల్గవమహాసభను కాకినాడవా రాహ్వానముచేసిరి.

ఆంధ్రమహాసభకు స్థాయిసంఘ మొకటి ఏర్పరచబడినది. దానిలో శ్రీ మోచర్ల రామచంద్రరావు, వరహాగిరి జోగయ్య, భోగరాజు పట్టాభి సీతారామయ్య ప్రభృతులు సభ్యులుగా నుం డిరి. నన్ను ఆసభకు కార్యదర్శిగా నెన్నుకొనిరి. ఆ కార్యదర్శి పదవినిబట్టియె నేను దేశమున ప్రచారమునల్పుచుంటిని.

విశాఖపట్టణసమావేశము ముగిసినపిదప నేను ఉదకమం డలమునకు వెళ్లితిని. అంతకుముందే శ్రీ బయ్యా నరసింహేశ్వర శర్మ, శ్రీ మోచర్ల రామచంద్రరావు మొదలగువారు అక్క- డికి వెళ్లియుండిరి.

ఆ ప్రాంతమున పోకచెట్లు విస్తారముగా గన్పట్టుచుండెను. ఆ సుందర దృశ్యము కనులు చల్లజేయుచుండెను. నీలగిరుల నెక్కుటకు ప్రత్యేకముగ రైలుమార్గ మేర్పడియుండెను. ఆ బండికి వెనుకను ముందును ఇంజెన్లు తగిలించిరి. బండి వెనుకకు జారిపోకుండునట్లు చక్రములకుపండ్లు ఏర్పరచిరి. ఉదయమున కొండప్రయాణము చేసినపిమ్మట నాకు ఒడలుత్రిప్పి, వమనమగు నట్లు బాధకలిగెను. తోడిబాటసారి దాక్షిణాత్యబ్రాహ్మణు

లోకరు తమయొద్దనున్న కారపుబుల్లలుకొంచెము నా కొసంగిరి. వానిలో వాముకూడ నుండుటచే తినుటకు రుచిగ నుండెను. పిమ్మట ఒడలుత్రిప్పుట మాని, సుఖముగానుంటిని. స్టేషనుదగ్గర రిక్షాబండ్లుతప్ప మరేబండ్లును కనుపడలేదు. రిక్షాబండ్లెక్కకూడ దని నాకు నియమ మున్నదిగాన కర్తవ్యతామూఢుడనై కొంత వడి చింతించి, తుదకు గతిమాలి రిక్షాపై నెక్కి పోతిని.

ఆ రోజులలో చెన్నపురి శాసనసభ అచట జరుగు చున్నందున దానిని చూచుటకు వెళ్లగా, నచ్చట కేశవపిళ్లెగారు కనుపడిరి. పిళ్లెగారు నన్ను జూచి. "మీ రీసభలో సభ్యులుగా చేరవలెనని మేము ఎదురుచూచుచున్నా"మని బహూకరణ వాక్యములు పలికిరి. ఒకరోజు జి. యస్. నటేశంగారిని కలుసు కొంటిని. వీరు గాంధిగారు దక్షిణాఫ్రికాలో ప్రభుత్వముతో జరుపుచున్న పోరాటమునుగూర్చి మాటిమాటికి వారిపత్రికలో ప్రకటించుచుండెడివారు. గాంధిగారితో ఉత్తరప్రత్యుత్తరములు జరిపి వారిమైత్రిని సంపాదించుకొనిరి. నాతో ముచ్చటించుచు "మిమ్మునుగూర్చివిశేషముగవినుచున్నాను. మీరు శాసనసభలో ప్రవేశించవలెను. దేశము మీసేవ కెదురుచూచుచున్న"దని ప్రోత్సాహవచనములుపల్కిరి.

ఈ ఉదకమండలమునందు మైసూరు, హైదరాబాదు, విజయనగరముమొదలగు సంస్థానాధీశులకు, జమీందారులకు విశాలములగు భవనములుగలవు. వేసవికాలము పేరుపెట్టి చెన్న పురిగవర్నరుగారును వారి క్రిందియుద్యోగులును సంవత్సరములో దాదాపు సగముకాలము ఇచ్చట వారికొరకు ప్రత్యేకముగ

కట్టబడిన దివ్యభవనములలో నివసించుచు కచ్చేరీలలో పని చేయుచుందురు. శాసనసభలుకూడ ఆకాలములో అచటనే సమావేశమగుచుండెను. ఈపర్వతప్రస్థానమువలన ప్రతిసంవత్స రము మితిలేని ఖర్చు అగుచుండుటచే కాంగ్రెసుమహాసభ ఈ ప్రస్థానములను మానవలసినదని తీర్మానించుచుండెను. పిమ్మటి కాలమున అచటశాసనసభాసమావేశములును, ప్రభుత్వప్రస్థానము లును ఆగిపోయినవి. శీతలము, రమణీయమునగు ఆప్రదేశమున కొండ లెక్కుచు, దిగుచు మేఘములు జొచ్చిపోయి, వానితో దాగుడుమూతలాడుచు ఆ వేసవి గడపి యింటికి చేరునప్పటికి నాస్వరూపమును జూచి, మాయింటిలోనివా రందరును సంతసిం చిరి. నాశరీరము మెరుగెక్కి, స్ఫుటముగనుండెను.

వేటపాలెములోనిబంగళాలు నాకు క్రొత్తవ్యయములకు కారణమైనవి. అచ్చట చెదలు విశేషముగ నుండుటచే అప్పుడ పుడు చిన్నచిన్నమరమ్మతులు గోరుచుండెను. విద్యాశాల స్థాపింతు నన్న, అచ్చట నిలచి దాని పరిపాలనాభారము వహిం చువారు కనుబడకుండిరి శ్రీ రాయసం వెంకటశివుడుగారిని ఈ బాధ్యత వహించవలసినదని కోరితిని. వారు స్త్రీవిద్యాభిమా నులు. స్త్రీల జ్ఞానాభివృద్ధినిమిత్తము "జనానా" యను పత్రిక నొకదానిని కొన్నిసంవత్సరములు ప్రకటించుచుండిరి. సంస్కర ణాభిమానము, నియమనిష్ఠలు గలవారుగాన సర్వవిధముల స్త్రీ విద్యాశాలకు అధ్యక్షతవహింప నర్హులని నేను ఆశించితిని. కాని వారు సమ్మతించరైరి. శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారిని గూడ అడిగితిని. వారును అంగీకరించలేదు. ఇట్లు కాలము గడచి

పోవుచుండెను. నాజీవితవృత్తియు బాగుగనే సాగిపోవుచుండెను. అవకాశము కలిగినపుడెల్ల ఆంధ్రోద్యమప్రచారము చేయుచుంటిని.

శ్రీ గోపాలకృష్ణ గోఖ్లేగారు స్థాపించిన అఖిలభారత సేవాసంఘమువంటి దొకటి ఆంధ్రరాష్ట్రసేవాసంఘమును స్థాపించుట యుక్తమని తలంచితిని. ఆవిషయమై పత్రికలలో ప్రకటించితిని. కొందరు సేవకులమని చెప్పుకొనుట మన పౌరుషమునకు తగియుండదని ఆక్షేపించిరి. కాని ఏపేరుతోనైనను అట్టిసంఘమును గూర్చి తోడ్పడినవారు లేరైరి. ఆంధ్రనిధి స్థాపింప యత్నించితిని. దానినిమిత్తము జిల్లాలు చాలవరకు తిరిగితిని. అందును గూర్చియు తెగువ కనుపడలేదు. రెండువేలరూపాయలుమాత్రము సమకూర్చి గుంటూరుజిల్లా సహకారబ్యాంకులో నిల్వజేసితిని. ఈనిధిని వృద్ధిపరచుటకు కొందరు జమీందారులయొద్దకు పోయెదమని శ్రీ మోచర్ల రామచంద్రరావుగారు చెప్పుచువచ్చిరిగాని అది కార్యరూపమెత్తలేదు. ఆకాలములో వారికి పలుకుబడి హెచ్చుగానుండెనుగాన వారు వచ్చిన బాగుండునని యెంచి నేను స్వతంత్రించి ప్రయత్నించలేదు.

శ్రీ బయ్యా నరసింహేశ్వరశర్మగారు, మోచర్ల రామచంద్రరావుగారు, భూపతిరాజు వెంకటపతిరాజుగారు, చింతలపాటి నరసింహరాజుగారు ఆకెళ్ళ సూర్యనారాయణపంతులుగారును మనఆంధ్రదేశమున తూర్పుజిల్లాలపక్షమున శాసనసభాసభ్యులుగా ప్రాముఖ్యమువహించియుండిరి. వీరందరిలో ఆకెళ్ళవారు చాల ధనవంతులు. ఆకాలమున మనఆంధ్రదేశమునుగూర్చి భారతదేశ

మంతట ప్రచారముసల్పి, ప్రభుత్వమునకుగూడ నచ్చచెప్పగల ఆంగ్లపత్రిక యొకటి ప్రకటించుట అవసరమని పలుమారు మనవా రనుకొనుచుండిరి. ఈయుద్దేశము నెరవేర్చునిమిత్తము నేను పైనుడివిన పెద్దలనందరిని చెన్నపురిలో కాస్మాపాలిటన్ క్లబ్‌లో కలుసుకొంటిని. ముందు మేడమీదిగదులలో నున్న వారిని కలియగా వారు చాల అనుకూలముగ ముచ్చటించిరి. దిగువగదిలో నున్న ఆకెళ్ళపంతులుగారితో ముచ్చటించి వారి సహాయముతో ఈకార్యము నెరవేర్చవచ్చునని వా రపేక్షించి, వెంటనే వారిని కలుసుకొని సంప్రదించగా వారు నిరుత్సాహ వచనములు పలుకుచు తామువూత్ర మేవిధమైన సహాయము చేయజాలమని స్పష్టీకరించిరి. అంతటితో తక్కినవారును నిరుత్సాహముచెంది యూరకుండుటచే ఆప్రయత్నము మూలబడెను.

1915 వ సంవత్సరములో కాకినాడలో మిక్కిలి వైభవముతో ఆంధ్రమహాసభ జరిగెను. దీనికి ముఖ్యముగ సహాయము చేసినవారు శ్రీ పోలవరము జమీందారులు. వీరు ఆంధ్రాంగ్లములు రెంటియందును ప్రవీణులు. చెన్నపురి శాసనసభలో సభ్యులు, ఆంగ్లభాషయందు మంచివక్తలు, ఆంధ్రభాషాపోషకులు. శ్రీ తిరుపతివేంకటకవీశ్వరు లిరువురును వీరి ఆస్థానములోనే కొంతకాల ముండి గ్రంథములను రచియించిరి. వీరు మిక్కిలి యుదారమూర్తులు. వీరిది బ్రాహ్మణసంస్థానమగుటచే వేదాధ్యయనపరులును శాస్త్రజ్ఞులునుగూడ వారిచే బహూకరింపబడుచుండిరి. ఆంధ్రమహాసభకు గొప్పగా విరాళము లిచ్చి ప్రతినిధులకు గౌరవసత్కారములను హెచ్చుగా గావించిరి.

ఈసభకు జమీాందారుగారే సన్మానసంఘాధ్యక్షులుగ నుండిరి. మోచర్ల రామచంద్రరావుపంతులుగారు అధ్యక్షత వహించిరి. గవర్నరు కార్యవర్గసభ్యు లొకరు వీరిని "దక్షిణభారత గోఖ్లే" యని ఉగ్గడించిరి. పలుమారు ప్రభుత్వమువారిచే నియమింప బడు కమిటీలలో సభ్యులుగను, అధ్యక్షులుగను నియమింప బడుచు గౌరవమును పొందుచుండిరి. వీరికి రాజకీయములందు విషయపరిజ్ఞానము మెండు. ప్రతివిషయమును ఆనుపూర్వముగ చదివి పూర్ణముగ తెలుసుకొననిదే వ్రాయుటకుగాని ఉపన్య సించుటకుగాని వీరు పూనుకొనరు. వీరికి న్యాపతి సుబ్బారావు పంతులుగారికివలెనే ఆంధ్రరాష్ట్రమునుగూర్చి అభిప్రాయభేద ముండెనుగాని సుబ్బారావుపంతులుగారు వ్యతిరేకవ్యాసములు వ్రాసినట్లు ఈయన ఏదియును వ్రాయకుండిరి. కాకినాడలో మహాసభాధ్యక్షత వహించునాటికి వీరిసంశయములు వదలి పోవుటచే ఆంధ్రరాష్ట్రనిర్మాణము ఆవశ్యకమని గట్టిగనే వారి అభిప్రాయమును ప్రకటించిరి.

మేము గావించిన సంచారవివరములు తెలుపు నివేదికను సభలో చదివితిని. విశాఖపట్టణన్యాయవాదులలో ప్రధానులగు ప్రభల లక్ష్మీనరసింహముపంతులుగారు రాష్ట్రనిర్మాణమునకు అనుకూలముగ అనర్గళధారగా మహోన్నతప్రసంగమును గావిం చిరి. అంత శీఘ్రగమనమున నిరుపమగు గ్రాంధికభాషలో శ్రోతలకు ఆనందముకల్పించుచు ఉపన్యసించినవారు మరెవ్వరిని నే నెరుగను. వా రాసభకుమాత్రమే విచ్చేసిరి. వారు పూర్వా చారపరాయణులు. దానధర్మములయందు పేరొందినవారు.

వీరు అనుకూలముగనుండుట గొప్పవిషయమని అందర మను కొంటిమి. తీర్మానము సర్వజనాంగీకారమునుబడసెను.

మరునాడు రామచంద్రరావుపంతులుగారితో ప్రయాణముచేసి మధ్యాహ్నము ఏలూరు చేరితిమి. నా సామానులలో చర్మముతోచేసిన పెద్దసంచి యొకటి కనుపడలేదు. ఆంధ్రనిధి నిమిత్తము వసూలుపరచిన సుమారు నూరురూపాయలమొత్తము కూడ అందే కలదు. రైలునుండి సామాన్లుదించుటలో కూలీలు దానిని వదలివేసిరి. నే నప్పుడు గమనించకపోవుట నాదియే గొప్పలోప మయ్యెను. అప్పుడు స్టేషనుమాస్టరుద్వారా పై స్టేషనునకు తంతివార్త నంపి మరల సంచి వచ్చువరకు ఏలూరు లోనే యుండి, పిమ్మట బయలుదేరి యింటికి చేరితిని. మరియొక తూరి రైలుబండి దిగునప్పుడు మంచి విలువగల శాలువతో గూడ పక్కచుట్టను పోగొట్టుకొంటిని. పిమ్మటికాలములో గాంధిగారితో సంచారముచేయునప్పుడు వారు తమసామానం తయు వచ్చినదో లేదో బండినుండి దిగునప్పుడే పరీక్షించుచుం డుట చూచి, వారి జాగరూకతకు ఆశ్చర్యము చెందుచుంటిని. ఒకబసలో దిగి, అక్కడనుండి పయనమై కారు ఎక్కినపిమ్మట తమసామా నంతయు ఎక్కించినారో లేదోయని గాంధీజీ పరీక్షించుచుండిరి. ఒకపరి విసనకర్ర బసలో వదలిపెట్టబడెను. దానిని తెప్పించుకొనినపిమ్మటనే వారు పయనముసాగించిరి. ఇంకొకచోట వారు చేతబట్టుకొను వెదురుకఱ్ఱ కనపడనందుకు చింతించిరి. వస్తువు పోయెనని కాదుగాని అజాగ్రత్తగా నుంటిమను బాధయే వారి కెక్కువగా నుండెను. ఇది మహాపురుషుల యందలి ఒక విశేషము.

# వృత్తివిసర్జనం

అప్పటికి పదిసంత్సరములపూర్వము నేనును శ్రీ చెన్నా ప్రగడ భానుమూర్తిగారును కలసి పదియేండ్లకు తదుపరి వృత్తి మానివేసుకొని ఏదో ఒక దేశహితైకకార్యమునందు ప్రవేశించ వలెనని చేసికొన్న ప్రతిజ్ఞ నాకపుడపుడు జ్ఞాపకము వచ్చుచుం డెను. ఉదయమున లేచి, ఆనాటి కేసులరికార్డును చదువుకొను చుండగా ఇంటివెలుపల సూర్యకాంతులు ప్రకాశించుచు చల్లని గాలి వీచుచుండ వెలుపలకుబోయి తిరుగవలెనని కుతూహలము పుట్టినను ఇంటిలోకూర్చుండి పాఠములుచదివినట్లు కాగితములు చదువవలసివచ్చినప్పుడు ఈనిర్బంధమునుండి ఎప్పుడు విముక్తి చెందుదునా యనువాంఛ మనస్సున కలుగుచుండెను. అట్టివిర మణ సిద్ధించుటకు క్రొత్తకేసులు పుచ్చుకొనకుండవలెనుగదా. అదివరకు చేపట్టినకేసులు త్వరలో ముగించుకొనవలెనుగదా యని యోచించుచుంటిని. కాని ఒకానొకరోజు ఏదియైన పెద్ద ఫీజు వచ్చెడికేసు వచ్చినప్పుడు దానిని వదల బుద్ధి పుట్టెడిది కాదు. ఇట్లు ఆసంవత్సరములో తుదిమాసములు ముగియు చున్నకొలది మనస్సున ఆందోళన హెచ్చుచుండెను. వృత్తిపని యనిన కొంత విసుగుపుట్టుచుండెను. ఇట్లు సంచలనముచెందు చున్న మనస్సుతోడనే డిసెంబరుమాసము ముగియుసరికి పంజ రమునుండి తప్పించుకొన్న చిలుకవలె సతంత్రవిహారతరుణమేర్ప డెనని ఆనందోత్సాహములు హృదయమునం దంకురించి ఒకరీతి నూతనబలమును చేకూర్చెను. 1915 డిశంబరు 31 వ తేదినాడు వృత్తివిసర్జన చేయగలిగితిని. నామిత్రుడు చెన్నాప్రగడ భాను

మూర్తిగా రప్పుడు చెన్నపట్టణములో గవర్నమెంటుట్రాన్సులేటరు ఉద్యోగము చేయుచుండిరిగాన "మనముపెట్టుకొన్న పదిసంవత్సరముల గడువు నేటితో ముగిసినది. నేను నావృత్తిని విసర్జించితిని. మీరును మీఉద్యోగము మాని, నాతో కలియవలె" నని కోరుచు వారికి జాబు వ్రాసితిని. ఇట్లునా వృత్తివిసర్జనచేయుట పలువురకు విపరీతముగ గాన్పించెను. పుష్కలముగ ద్రవ్యార్జన చేసుకొనుచు తినుచుతినుచున్న అన్నపుపాత్రను తటాలున బోర్ల త్రోసుకొను వెట్టివానివలె వృత్తిని విడనాడితినని తలంచుచుండిరి. నాబంధువులకెవ్వరికిని సమ్మతి లేదయ్యెను. నాభార్యకును ఇష్టములేకున్నను అంతగా కలవరముచెందక శాంతమువహించి యూరకుండెను. గుమాస్తాలు బొత్తుగ సహింపజాలకుండిరి. నా పెద్దగుమాస్తా కోతా పుండరికాక్షుడు నాదగ్గరకు వచ్చి, కంట నీరు బెట్టుకొని "ఇంకను కొన్నిసంవత్సరములు హాయిగ పనిచేయుచు మమ్మునుగూడ రక్షించరాదా? మీరు వృత్తివదలుటతో మేము నీరింకిన గుంటలోని చేపలవలె బయటపడి నశించవలసినదే" యని చెప్పుచు మిక్కిలి దుఃఖించెను. నాయొద్ద పనిలో ప్రవేశించినప్పటినుంచి ఆతడు సంసారముతో సుఖముగ కాలముజరుపుకొనుచుండెను. ఆతనిమాటలు వినినప్పుడు నామనసున జాలికలిగెనుగాని నేను వృత్తి మానినంతమాత్రమున అతనికి జీవనము జరుగకపోదనియు, ఎవరియొద్దనో పొట్టపోసుకొనగలడనియు తలంచి అతనినోదార్చి, అప్పీళ్ళు మొదలగు రికార్డులు తెప్పించి అవి పప్లీడర్లకు పంచిపెట్టవలెనాయని యోచించుకొంటిని. అప్పటికే నాయొద్ద జూనియరుగా పనిచేయుచున్న శ్రీ వెలగపూడి సుబ్బారావుగారు మంచి బుద్ధికుశలతగలవారు.

అప్పుడప్పుడు కొన్ని చిన్నఅప్పీళ్ళను ఆయనకే ఇచ్చి వాదన చేయించుచుంటిని. సమర్థుడని గుర్తించగలిగితిని. నేను వృత్తిని వదలివేయుట ఆయనకును సమ్మతమైనది కాదు. "మీరు ఇంటిలో ఊరక కూర్చుండి సలహాచెప్పుచుండిన చాలును, నేనే స్వయముగ కోర్టుపని యంతయు చూచుకొనెదను. కావలెనన్న మీయిష్టము వచ్చినపుడు దేశహితైక కార్యములు నెరవేర్చు కొనుచుండవచ్చును" అని నాకు సానుభూతితో సలహానిచ్చిరి. నానిశ్చయము తిరుగదని వారితోచెప్పి సమాధానపరచితిని. ఆయన జూనియరుగా నుండుటచే ఆయనకే యొప్పజెప్పినయెడల కక్షిదారులు సమ్మతించరని సంశయముకలిగి, కొద్దిపాటి అప్పీళ్ళు మాత్రము స్వల్పముగ ఆయన కిచ్చి, తక్కిన అప్పీళ్ళను, అసలు వ్యాజ్యములను శ్రీపతి శ్రీనివాసరావుగారి కప్పజెప్పితిని. కొన్ని ముఖ్యమైన అసలువ్యాజ్యముల కక్షిదారులు తమవ్యాజ్యముల నెవ్వరి కిచ్చినను ఒప్పుకొనమనియు మీరే చేయవలసినదనియు గట్టిగా పట్టుపట్టినందున అట్టి రికార్డులు అయినవారు మాత్రము నాయొద్దనే యుంచుకొంటిని.

ఇట్లు నేను నాచేతనున్న వ్యవహారములు ఇతరులకు వదలివేయుచున్న విషయము విని, నాతో ఆంధ్రోద్యమప్రచారములోనూ, అంతకుముందునుండి కాంగ్రెసువిషయములలోను కలసిసంచరించుచుండిన శ్రీ గొల్లపూడి సీతారామశాస్త్రి వచ్చి "ఇది యంతయు సంసారమును వదలి సాన్యాసాశ్రమము పుచ్చుకొను విరాగి చేయుకార్యముగనో లేక ప్రాణావసానకాలమున లోకమువిడిచిపోవువాడు తన ఆస్తిపాస్తులు బందుగుల

కిచ్చివేయుపనివలెనో యున్న”దని వర్ణించెను. గుంటూరులోని కొందరుమిత్రులు అందు ముఖ్యముగ న్యాపతి హనుమంతరావు పంతులుగారు ఈప్రయత్నమును మాన్పించవలెనని బహుదూరము నాతో వాదించిరి. శ్రీ రాయసం వెంకటశివుడుపంతులు గారును నా నిశ్చయమునుండి మరల్పజూచిరిగాని తుదకు నా పూనిక-యే యుక్తమని వారును తలంచిరి. తోడి న్యాయవాదు లందరికి నేను చేసినపని మిక్కిలి ఆశ్చర్యముగనే యుండెను. వారిలో పలువురు నేను బాగుగ సంపాదనచేసియుంటినిగనుక మిగిలినకాలము సుఖముగ కూర్చుండి, అనుభవింతునని తలంచిరి. నేను పూర్వము చేసుకొన్న నిశ్చయమునుగూర్చి నాముఖ్య మిత్రులుతప్ప ఇతరు లెరుగరు. ఈదీక్షకు ముఖ్యప్రేరణ శ్రీ గోపాలకృష్ణ గోఖ్లేగారి జీవితవృత్తాంతమే. వారితో నెందుకు పోలనివాడ నైనను యథాశక్తి వారివలెనే వృత్తిని వదలి, దేశసేవచేయుటకు జీవితకాలములో కొంతయైనను గడుపుట యుక్తమని తలంచితిని. కొంతకాలముక్రిందట వారి భారత సేవాసంఘములో సభ్యుడుగా నుండవలెనని యోచించితినిగాని అది సిద్ధించలేదు. కాని ఆసేవకులవలెనే దేశములో చేతనైన సేవచేయుటకు అడ్డు లేదని యెంచితిని.

శ్రీ చెన్నాప్రగడ భానుమూర్తిగారు తమ ఉద్యోగ మును మానజాలమని ప్రత్యుత్తరమువ్రాసినను నేనుమాత్రము నాదీక్షను కొనసాగింప నిశ్చయించుకొని యొంటరిగనే ఎదియో సేవ చేయవచ్చునని యనుకొంటిని. వేటపాలెములో విద్యాసంస్థ స్థాపించుటకు శ్రీ భానుమూర్తిగారు తోడ్పడునని తలంచితిని.

కాని ఆయాశ నిరాశయయ్యెను. మరెవ్వరును ఆభారమును పైనబెట్టుకొనుటకు సమ్మతించకుండిరి.

ఇట్లుండగా, భారతదేశసేవాసంఘములో సభ్యులైన శ్రీ వాజపేయ వెంకటసుబ్బయ్యగారితో నాకు స్నేహమేర్పడెను. వారు బెంగుళూరువాస్తవ్యులైనను తెలుగువారు. చాల సౌమ్యస్వభావముగల శాంతమూర్తులు, త్యాగశీలురు నగుటచే వేటపాలెములోని స్త్రీవిద్యాశాల కధ్యక్షులుగా నుండదగినవారనియెంచి, వారిని కోరగా వారు సమ్మతించి, శ్రీ గోఖ్లేగారిని కలుసుకొని, వారి అనుజ్ఞపుచ్చుకొని వచ్చెదనని పునహాకువెళ్ళి, వారివలన అనుజ్ఞాతులై, భార్యగారితో, చిన్నకుమార్తెతో గుంటూరు వచ్చిచేరిరి. వారి కొక నెల గ్రాసమునకు సరిపోవు పదార్థములు మూటలుగట్టి, పాత్రసామగ్రితోగూడ వేటపాలెము పంపుటకు సిద్ధముచేసి, వాకిటిలోనికి వచ్చునప్పటికి పోస్టు జవాను తంతివార్త యొకటి చేతి కిచ్చెను. అది విప్పి, చదువుకొనగా శ్రీ గోఖ్లేగారు పరలోకగతులైరను పిడుగువంటివార్త తెలియవచ్చెను. విభ్రాంతిచెంది, శ్రీ సుబ్బయ్యగారు కొంత తడవు నిశ్చేష్టితులై నిలచి, దుఃఖపూరితుడయ్యెను. ఇకను వెంటనే పునహా వెళ్ళవలెనని తెలిపెను. తా నొకటి దలచిన దైవ మొకటి తలచు ననునట్లు తగినవారు దొరకిరిగదా యని సంతోషించినందుకు ఆ ఆశయు నిరాశయయ్యెను. కాని ఇంకను శారదానికేతనము స్థాపించవలెనను కోర్కె నన్ను విడువలేదు. బంగళాలను తోటను కాపాడుటకు నెలజీతము లిచ్చి వృథావ్యయముచేయుట కష్టముగనే తోచుచుండెను.

కాబట్టి ఆయూరిలో నొక పాఠశాలకు అద్దె లేకుండగనే ఇచ్చి వేసితిని. అవసరము వచ్చినపుడు ఖాళీచేయుటకు పాఠశాల కమిటీ అంగీకరించెను.

## 5, 6 నెల్లూరు - నంద్యాల (ఆంధ్రమహాసభలు)

1916 లో నెల్లూరులో ఆంధ్రమహాసభ సమావేశమగుట కేర్పాట్లు జరిగెను. స్థాయీసంఘము నన్నే ఆసభకు అధ్యక్షుడుగానుండునట్లు నిర్ణయించిరి. శ్రీ వంగోలు వెంకటరంగయ్య గారు సన్మానసంఘాధ్యక్షులుగా నుండిరి. నెల్లూరిలో వీరు న్యాయవాదిగానుండిరి. మిక్కిలి సౌమ్యస్వభావులు. ఆంధ్ర భాషయందు అభిరుచికలవారు. ఆంధ్రరాష్ట్రనిర్మాణవిషయమున పూర్ణమగు అభిమానముకలవారు. శ్రీ ఆమంచర్ల సుబ్బుకృష్ణ రావుగారు శాసనసభాసభ్యులు. వీ రచట పబ్లిక్ ప్రాసిక్యూటరు గాను మునిసిపల్ ఛైర్‌మన్‌గా నుండిరి. వీరును మరికొందరును ఆంధ్రరాష్ట్రనిర్మాణమునకు వ్యతిరేకులు. వారు బాహాటముగ నెదిరింపకున్నను ఆంధ్రరాష్ట్రతీర్మానము ఆసభలో నెగ్గు విషయములో కొంత సంశయమేర్పడెను. శ్రీ సుబ్బుకృష్ణరావు గారికితోడు శ్రీ చంగయ్యగా రను మరియొక ప్లీడరుగారుకూడ ఆంధ్రరాష్ట్రనిర్మాణమునుగూర్చి వ్యతిరేకాభిప్రాయము కలిగి యుండిరి. మహాసభకు వచ్చిన ప్రతినిధులు ఉదయమున పినాకినీ నదిలో స్నానముచేసి తిక్కనసోమయాజులవారి ఘంటమును చలువచప్పరములో నుంచి, జాతీయగీతములుపాడుచు నూరేగించిరి. నెల్లూరుసమీపమున పాటూరుగ్రామములో ఆయన సంతతివారు ఆఘంటమును దేవతార్చనలో నుంచి ప్రతిదినము

పూజించుచుండిరి. ఆపాటూరులోనే హరిహరనాథుని దేవా లయము కలదు. నాడుపన్యాసములో నెల్లూరువారి వ్యతిరేకవాద మును ఖండించుచు "ఇది ఎట్టి నీతియో తెలియకున్న" దని నేను వచించితిని. ఆవాక్యమునకు కోపించి శ్రీ సుబ్బుకష్ణరావు మొద లగువారు సభను విడిచిపోయిరి. అంతట సభలో కలవరము సాగెను. నేనుమాత్ర మెవ్వరిని తూలనాడవలెనని ఆవాక్యము పలుకలేదు కాని నామూలముగ సభలో కలవరము కలుగుట వలన మనస్సు బాధించినది. పలువురు "ఎట్టినీతి" అన్నంత మాత్రమున తప్పులేదు అని వాదించసాగిరి. కాని మరి కొందరు మిత్రులు మాత్రము అది ఉద్దేశపూర్వకముగాకున్నను ఆక్షే పణీయమే యని అభిప్రాయపడుచుండిరి. సభ నిలుపుదల కావల సివచ్చెను. శ్రీ బయ్యా నరసింహేశ్వరశర్మగారు వచ్చి నే నెవ్వ రిని అవమానించవలెనని చెప్పినదికా దని సభలో చెప్పినయెడల సభవిడిచిపోయినవారు మరల వచ్చెదరని చెప్పినందున నేను ఆ ప్రకారము చెప్పుటకు ఆక్షేపణలేదనియు ఆవచనములు పలికినపు డైనను నాకు వేరొక యుద్దేశము లేదనియు తెలిపితిని. ఈ మాటయైనను నేను జెప్పవలసిన పనిలేదని చాలమంది మిత్రులు ముఖ్యముగ యువకులగువారు విరోధించి పల్కిరి. సభ చక్కగా జరిగిపోయెను. ఆంధ్రరాష్ట్రతీర్మానమునుగూర్చి వాదప్రతివాద ములు హెచ్చుగా నడిచెను. రాత్రి ప్రొద్దుపోవునప్పటికి సమ్మ తులు తీసుకొనుట సంభవించెను. సభలో మొత్తముమీద లెక్కించగా అనుకూలాభిప్రాయములే హెచ్చుగా తేలినవి. కాని విడదీసి లెక్కించవలెనని సభ్యులలో కొందరు పట్టుబట్టిరి. ఆప్రకారము అనుకూలురను, ప్రతికూలురను విడదీయగా వ్యతి

రేకులకంటె మున్నూరుమంది అనుకూలురే అధికముగ లెక్కకు వచ్చిరి. ఇట్లు జయముచేకూరినను కొంద రైనను వ్యతిరేకులుండుటచే ప్రజలకు ఉద్యమముపట్ల పట్టుదల కొరతగనే యుండెనని స్పష్టమయ్యెను. కాని ఈవ్యతిరేకాభిప్రాయము కొందరు ప్రముఖుల పలుకుబడిచే నేర్పడినదేగాని స్వతంత్రము కాదు. ఈ జయమునకు శ్రీ కోడి రామమూర్తిగారు సామాన్యప్రజలతో కలసి మాట్లాడుటగూడ చాల ఉపయోగించినది. రామమూర్తిగారు అభినవభీము డని పేరుపొందిన జగజెట్టి. హిందీలోనూ, తెలుగుభాషలోనూ ధారాళముగ నుపన్యసించి ప్రజల హృదయములను రంజింపజేయుచుండెడివాడు. శ్రీ వెంకటరంగయ్యగారు తమ ఉపన్యాసములో ఆంధ్రరాష్ట్రనిర్మాణమును సహేతుకముగ బలపరచిరి. ఆంధ్రులు ప్రత్యేకరాష్ట్రము కోరుట ఆత్మవ్యక్తిత్వసిద్ధినిమిత్తమే యని స్పష్టీకరించిరి. ఆరవ ఆంధ్రమహాసభను కర్నూలుప్రతినిధులు నంద్యాలకు ఆహ్వానించిరి.

